Sri Venkateswara University

PRE-UNIVERSITY EXAMINATION 1959

# Selections in old Poetry

## PART I TELUGU

Introductions, Exhaustive Notes, Paraphrases, Critical Essays, Annotations, Topical Questions and Answers, Prescribed Grammar, Prosody and Poetics.

*By*

**Vidwan SRI BADI GURAVA REDDY,**

*Pandit, V. R. College, NELLORE.*

**CITY PUBLISHING HOUSE,**

**PRAKASH NAGAR, NELLORE-2.**

Sri Venkateswara University

PRE-UNIVERSITY EXAMINATION 1958

# Selections in old Poetry

## PART I TELUGU

Introductions, Exhaustive Notes, Paraphrases, Critical Essays, Annotations, Topical Questions and Answers, Prescribed Grammar, Prosody and Poetics.

And Guide for
Prose & Non-detailed.

Vidwan SRI BADI GURAVA REDDY,
*Pandit, V. R. College, NELLORE.*

CITY PUBLISHING HOUSE,
PRAKASH NAGAR, NELLORE-2.

 1957 [Price

# విజ్ఞప్తి

1958 సం॥ ప్రీ యూనివర్సిటీ పరీక్షకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారు పఠనీయములుగా నిర్ణయించిన తెలుగు ప్రాచీన కావ్యభాగములను, ఆ పద్యభాగములకు సంబంధించిన 'నోట్సు'ను ప్రత్యేకముగా ముద్రించి విద్యార్థిలోకమునకు సమర్పించుటకు మే మెంతయుఁ సంతసించుచున్నవారము. నేటి విద్యార్థుల విద్యా ప్రమాణములను, వారి యవసరములను మనంబున నుంచుకొని, మాకుం గల యనుభవమును పురస్కరించుకొని, పరీక్షలకు ముఖ్యమని తోచిన విషయములనే యీ 'నోట్సు' భాగమునందు విపులముగాఁ జేర్చితిమి. ప్రతి పద్యభాగమునకుఁ గావలసిన కవి విషయాదికము, ప్రతిపదార్థ తాత్పర్యములు, ప్రశ్నోత్తరములు, వ్యాకరణ విశేషములు, అలంకారములు, వ్యుత్పత్త్యర్థములు, సందర్భసహిత వ్యాఖ్యలు, ఛందోవిశేషములు, పూర్వగాథలు మొదలగు నవన్నియు యీ 'నోట్సు' నందు సంతరింపఁబడినవి. పాఠ ప్రవచనమున ననుభవముగల పండితునిచే రచింపఁబడిన యీ 'నోట్సు' విద్యార్థులకుఁ గల్పతరువుగాఁ బరిగణింపఁబడఁగలదని మా నమ్మకము. ఈ 'నోట్సు'లోని గుణదోషములు పరికించునప్పుడు యుక్తములని తోచిన మార్పులను నేర్పులను సూచించినచో మఱు సంవత్సరపు 'నోట్సు'న వానిని సవరించుకొని విద్యార్థిలోకమునకు మఱింత యుపకరించునట్లు చేయఁగలవారము. విద్వాంసులు, విద్యార్థులు మా యీ ప్రయత్నము నాదరించి ప్రోత్సహింతురని విశ్వసించుచున్నారము.

ఇట్లు,

ప్రకాశకులు.

# విషయసూచిక

# శ్రీమదాంధ్ర మహాభారతము

(తిక్కన సోమయాజి)

ఆనుశాసనికపర్వము - ప్రథమాశ్వాసము

## గౌతమీలుబ్ధక సర్ప మృత్యుకాల సంవాదము

క. శ్రీమత్కటాక్ష గోచి
స్త్రీమనస ముల్లాస విహితసుస్థిర లక్ష్మీ
భూమాసందిత భక్త
వ్యామోహ విదూరయుక్త హరిహరనాథా! 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియెనట్లు దివ్య
జ్ఞాన దేదీప్యమానుండైన దేవవ్రతుండు వివరింప వివిధంబులగు
ధర్మంబు లాకర్ణించి యజాతశత్రుం డతనికి సభక్తిక ప్రణామం
బాచరించి వినయవిశేష విభూషితుండై. 2

సీ. అనఘ నాదగు చిత్తమున కుశమంబు గా
వించుటకై నీవు వివిధ విశద
భంగుల పరమ కృపానిరతుండవై
సకల ధర్మోపదేశములుఁ జేసి
తిమ్మయిఁ జెప్పగాఁ, వించుక యేనియు
శమము లేకున్నది సలముకొని య
నేక బంధుల వధియించితి నదిమొక్క-
తలయు నీ కలిగిన దారుణత్వ

ఆ. మొక్క తలయునైన యుగ్రకర్మంబులు,
చిత్తవృత్తిఁ దగిలి యుత్తలంబుఁ

జేయ శాంతి యెట్లు సిద్ధించు మునిమాన
నీయ యింక నేమి సేయువాఁడ. 3

వ. దుర్యోధనుం డతిలోభంబున నాతోఁ బంచికుడువ నొడంబడండ
యేనును నాగ్రహంబున నతనికి రాజ్యంబిచ్చి తొలంగి నిలువను
మా యిద్దఱ కతంబున నింతపుట్టెం బశ్చాత్తాపం బెప్పాటనుం
ద్రోపు వడదయ్యెడు. 4

చ. అనవుడు భీష్ముఁ డిట్టులను నాతనితో నకటా వధింపఁగా
మనుజుఁడు గర్తగాఁడు వినుమా యితిహాస మొకండు సెప్పెదన్
మనుజవరేణ్య గౌతమి యనంగ శమాన్విత యొక్క భూసురాం
గనయురగంబుచేసుతుఁడు గాలవశత్వముఁ బొందియుండఁగన్. 5

చ. వగ దుచుఁ జూడ నయ్యురగ వల్లభురజ్జునఁ గట్టితెచ్చి య
మ్మగువకుఁజూపి దీనిఁదలద్రుంచఁగ మోఁదెదఁ గోలనొండె రెం
డుగ నెఱగత్తి ద్రేసెదఁ గడుంజెడు గీ పొడపాఁప పుర్వు నే
మిగతి వధింతునంచు నొక మేటికిరాతుఁడు రోషదీప్తుఁడై. 6

క. ఉన్నఁగని యప్పడఁతియో
యన్న విడువు భుజగనాథు ననవుడు నతఁ డీ
పిన్నాతని ప్రాణంబులు
గొన్నది యిదె దీని యుసురుఁగొనియెద ననియెన్. 7

వ. అనిన నక్కోమలి యక్కిరాతుం జూచి. 8

క. విధివశమున వచ్చిన కీ
డధములు కొనియాడి వ్రేఁగులై విపులభవాం
బుధి మునుఁగుదురు మునుంగరు
సధర్ములగు నుత్తములు ప్రశాంతిఁ జులకనై. 9

వ. అదియునుం గాక 10

క. ఈ పాముఁజంప బ్రదుకునె
నా పుత్త్రుఁడు విడువు మర్జునక నావుడు వాఁ
డీ పేదమాట లెల్లను
గోపవివశుఁడైన నాకుఁ గొలుపవు ముగ్ధా! 11

ఉ. కావున నెట్లుఁ జంపుదున కాని భుజంగముఁ బోవనీను జూ
నావుడు నింతి యర్జునక నామము నీకవదాత భంగికిం
గావలదే మహీసురులు గాదనుచొప్పునఁ దత్సహాయులుం
బోవరుగాదె యేల నినుబోఁటికిఁ గ్రూరత నాదుసన్నిధిన్. 12

సీ. హింసకు నోడఁబడ నే నెట్లు ననవుడు
జనబాధకములైన జంతువులను
జంపినఁ బాపంబు సమకూరదని పల్కె
బోయ వట్టిన రవుఁ బోరిఁగొనంగ
వలదని చెప్పె నవ్వనిత వాఁడహిఁ దెగఁ
జూచి జనంబులఁ గాచు టుఱదె
వృత్త్రుఁజంపఁడె దేవవిభుండు యజ్ఞ ధ్వంస
నము సేయఁడే ఫాలనయనుఁ డట్ల

తే. కావె ధర్మువు హింసలు నీవు దీని
కియ్యకొనుమని తఱిమె నట్లెంత దఱిమి
నను దయావతియైన యన్నాతి పాప
మునకుఁ జొరదయ్యె బోయ కిట్లనియెఁ బాము. 13

క. ఏనేమి తప్పొనేసితిఁ
గానవు నెఱి నీవు లెస్సగా మృత్యుపరా
ధీనత బాలునిఁ గఱచితిఁ
గాని వినుము లేవుకోప కామాదు లెదన్. 14

వ. అనుటయు నతండు. 15

క. వినుమృత్యువునకుఁ దగు సా
ధన మవగుటఁ జేసి నిన్ను దండింపంగాఁ
జను ననవుడుఁ గుమ్మరి కో
లనుసారెం బోలితిం దలఁచి చూడుమెదన్. 16

వ. ఈ క్రియ నావశంబగునే యని పల్కినన్ బాముస కర్జునకుం
డి ట్లనియె. 17

తే. ఏయువాడుండ నమ్మోచి సేయుననక
యోపితత్ఖండనము సేత పాతమంత్రె
యెవ్వరేఁ బంపఁ గఱతుగా కేమి క్రూరు
నిన్ను గీటడఁగించిన నింద రాదు. 18

తే. అదియుఁగాక విశేషించి యరయబుద్ధి
గలుగునట్టి సాధనములు గారె మీరు
మృత్యువున కట్లు గావున మెలఁగ మిడుక
నీక పొరిగొనవలయు మి మ్మెల్లభంగి. 19

వ. అనిన విని బోయకు భుజగం బిట్లనియె. 20

తే. బుద్ధిగల్గు సాధనముల పోహవిస్సు
లరసివేల్తురు ఋత్విజు లా ఫలంబు
గాంచు నధ్వరకర్తయకాక వారి
కేమిపని యనఁగా మృత్యు వేఁగుదెంచె. 21

క. చనుదెంచి పామునకు ని
ట్లను నిను నేఁగోరి పనిచి నట్టుల నన్నుం

బనిచెంగాలుం డీ చా
వునకీవును నేను హేతువులుగా మనఘా. 22

క. ఇన శశిపావకభూమి గ
గన జలపవనాది వస్తుగతులెల్లను గా
లుని యఱచేతి వనిఁ ద
క్కిన పనిసెప్పంగ నేటికిని భుజగేంద్రా. 23

క. విను మిట్లగు పేర్వడ నెఱిఁ
గిన నాపై నిడుదు వెట్లు కిల్బిషముం గా
లునిచెయిది నన్ను దూఱిన
నినుదూఱుట యుఱదె నాదునిర్మాణమునన్. 24

ఆ. అనిన భుజగ మిట్టులను నీవలన నేను
గుణము సెప్ప దోషగణనసేయ
నన్నుఁ బనిచెనంటి నామీఁదీ దోషంబుఁ
బాపికొనుట నా కుఁబాడిగాదె. 25

క, వినుమటు కాలుని దెసనై
నను దోషము కలిమిలేమి నా కాడంగాఁ
బనియేమి దోషగతి చిం
తన. భాషణములకు నేను దగుదునె యనఘా. 26

వ. అని పలికి పాము బోయమొగంబు సూచి. 27

క. వింటే మృత్యువు మాటలు
గంటే నామీఁదఁ దప్పు గలిగించెద వి
ట్లంటం గట్టం దగునే
యంటకు నగి బోయ యిట్టులనియె నరేంద్రా. 28

క. నీవును మృత్యువుఁ బాప స
మావేశితమతుల రొంటగనాడిన యంతం
బోవునె మీపై దోషము
లే వెఱతునె యిట్టు లనిన యింతన మీకున్. 29

వ. అనిన మృత్యువునుం బామును. 30

క. ఘనుఁడగు కాలుని వశమునఁ
జనియెడు మా కరయ దోషసంగతి గలదే
యనునెడఁ గాలుం డచటికిఁ
జనుదెంచెం బ్రీతి ధర్మసంశయ ముడుపన్. 31

వ. చనుదెంచి యర్జునకు నాలోకించి. 32

క. పామును మృత్యువు నేనును
గామీ దారకుని మృతికిఁ గారణ మీతం
డే మేఁ గర్మముఁ జేసెం
దామృతి బొందించె నదియ తలకొని యితనిన్. 33

క. విను కర్మం బొనరించును
జననము మరణము నదియ సౌఖ్యము దుఃఖం
బును గావించుం దనచే
సినదానిం బడక పోవ శివునకు వశమే. 34

వ. అని చెప్పి. 35

క. కావున నిందలు నుడుగుం
డీ వాదంబనుడు బోయ కిట్లను ధరణీ
దేవాంగన దన మెఱుకయు
దేవాలాపములు నొక్క తెరువై యున్నన్. 36

ఆ. ఇట్టివనటఁ బొందునట్టి పాపముసేసి
వనిత లిట్లయగుదు రనఘ యివ్వి
ధంబు మరణ మొందఁదగు కిల్బిషంబున
బాలు రిట్లు పోదు రేల కలఁగ. 37

వ. అని వెండియు. 38

క. సకలజనంబులుఁ గర్మము
నకు ననుగుణమైన తెరవునం బోదురు దీ
నికి రోషవిషాదము లే
టికి విడువుము పాము సంఘటింపుము శమమున్. 39

క. అన విని తెలిసివిడిచె న
ర్జునకుఁడు భుజగము నపాస్తరోషుం డగుచుం
జని కెలమిఁబొంది కాలుం
డును మృత్యువుఁ గావునను విడువు మీ వడలున్. 40

తే. కారు దుర్యోధనుఁడు నీవుఁ గారణములు
బాంధవుల రణమరణసంప్రాప్తి కనఘ
వారు దమతమ కర్మముల్ గారణములు
గాఁగ నిట్లయి రేల శోకంబు నీకు. 41

వ. గౌతమీలుబ్ధక భుజంగ మృత్యుకాలసంవాదంబగు నియ్యితి
హాసంబు తాత్పర్యంబు మనంబునం బట్టుకొలిపి యాపుట్టిన
కలంకం దొలంగ జడిసి శమంబున సుఖివి గమ్మనినం గొంతే
యాగ్రజుండు సంతసిల్లి శాంతనవునితో నిట్లనియె. 42

# శ్రీమదాంధ్ర భాగవతము



## అష్టమ స్కంధము :

## వామన బలిఘట్టము

(బమ్మెర పోతనామాత్యుఁడు)

ఉ. స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తకు హాసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు సదాంపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వరవిధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్త సువర్ణ సూత్రపరిహర్తకు దానవలోక భర్తకున్. 1

వ. అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుం బోలె ముందట నకుటిలుండును జటిలుండును సదండచ్ఛత్రుండును గక్షలంబిత భిక్షాపాత్రుండును గరకలిత జలకమండలుండును మనోహరవదనచంద్రమండలుండును మాయావాదసనటుండును నగు వటువుంగని దినకరకిరణపిహితంబులైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులు గూర్చున్న యెడల లేచి సేమంబడిగి తియ్యనిమాటల నాదరించిరి. బలియును నమస్కరించి తనగద్దియ నునిచి పాదంబులు దుడిచి తన ప్రాణవల్లభ పసిండిగిండి నుదకంబులువోయ వడుగుం గొమరుని చరణంబులు గడిగి తడియొత్తి తత్సమయంబున. 2

ఆ. వటుని పాదశౌచవారి శిరంబునఁ
బరమభద్ర మనుచు బలి వహించె
నేజలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ
దేవుఁ డుద్వహించె ధృతిశిరమున. 3

వ. మఱియు నయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె. 4

మ. వసుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలంబెయ్యది
య్యెఁడకున్ నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మముం
గసు ధన్యాత్ముఁడనైతి నీమఖము యోగ్యంబయ్యె నా కోరికల్
గడ తేఱెన్ సుహుతంబులయ్యె శిఖులుం గల్యాణ మిక్కాలమున్.

మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక నేమడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా. 6

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచనివచనంబులు విని
సంతోషించి యీశ్వరుం డిట్లనియె. 7

సీ. ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు
నొకచోటనక యెందు నుండనేర్తు
నెవ్వనివాఁడనం చేమని పలుకుదు
నాయంతవాడనై నడవనేర్తు
నీ నడవడియని యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు నని యేల చెప్పంగ
నేరుపు లన్నియు నేననేర్తు

ఆ. నొరులు గారు నాకు నొరులకు నేనాదు
నొంటివాఁడ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లిగలదు చెప్పెద నావెంకి
సుజనులఁనుఁ దఁచు నొచ్చిఁగుందు. 8

వ. అది యట్లుండనిమ్ము. 9

సీ. జననాథ నీమాట సత్యంబు సత్కీర్తి
దంబుఁ గులార్హంబు ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనతత్త్వమూర్తులు
గాని మీ కులమందుఁ గలుగ రొరులు
రణభీరువులు వితరణ భీరువులు లేరు
ప్రత్యర్థ లక్షలు ప్రార్థించిన
దానశౌండిమమునఁ దనువులు రక్షకులై
మీ తాతలందఱు మేటిమగలు

ఆ. మీ కులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు
మింటి చంద్రుమాడ్కి మేలి రుచులఁ
బ్రథిత కీర్తితోడ భవదీయవంశంబు
నీరరాశి భంగి నెగడుచుండు. 10

వ. తొల్లి మీ మూఁడవతాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు సేసి
గదాయుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరింప
విష్ణుండు వరాహరూపంబున నతని సమయించెఁ దద్భ్రాతయగు
హిరణ్యకశిపుం డది విని హరి పరాక్రమంబునకు నాశ్చర్యంబు
నొంది తన జయంబును బలంబునుం బరిహసించి గ్రద్దన నుద్దవిడి
నద్దనుజమర్దను మందిరంబునకుం జనియె నప్పుడు. 11

క. శూలాయుధహస్తుండై
కాలాకృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండుం
గాలజ్ఞత మాయాగుణ
శీలత నిట్లని తలంచెఁ జిత్తములోనన్. 12

మ. ఎదురై పోర జయింపరా దితనికిం గాం దేనినింబోవ భీ
ప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియంబై వచ్చు నంచుం
గ్రియాం

విదుఁ డజ్ఞాతుఁడు సూక్ష్మరూపమున నావేశించి నిశ్శ్వాసరం
ధ్రదిశన్ దైత్యహృదంతరాళమునఁ బ్రత్యక్ క్రియాభీరుఁడై. 13

వ. అంత నద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి వెదకి హరిం గానక కోపంబుమానక మిన్ను మన్ను నన్వేషించి త్రిదివంబున నరసి దిశలం బరికించి భూవివరంబులు వీక్షించి సముద్రంబులు సెదకి పురంబులు శోధించి వనంబులు విమర్శించి పాతాళంబు పరీక్షించి జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు సాలించి తనలో నిట్లనియె. 14

క. పగవాఁడు మడియ నోపును
దెగఁడేనిని నెదురుపడఁడె దేహధరులకుం
దెగినయెడఁ బగఱ మీఁదను
బగఁగొనఁ దగదనుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్. 15

వ. అతండు మీ ప్రపితామహులం డతని గుణంబు లనేకంబులు గల వవి యట్లుండనిమ్ము. 16

క. ఆతుర భూసురగతిఁ బురు
హూతాదులు దన్ను వేఁడ నొగిఁ గొండనుచున్
మీ తండ్రి యిచ్చె నాయువు
నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్. 17

క. ఏలితివి మూఁడు జగములుఁ
దోలితి వింద్రాదిసురులఁ దొల్లిటి వారిం
బోలితివి దానగుణముల
సోలితివి పిశాచరాక్షసుల రక్షింపన్. 18

వ, అదియునుంగాక, 19

క. రాజ్యంబు గలిగెనేనిం
బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్
భాజ్యముగ బ్రదుకఁడేనిం
ద్యాజ్యంబులు వాని జన్మ ధన గేహంబుల్. 20

క. మున్నెన్నఁడు దురు వదాన్యుల
నెన్నఁడుఁబోనిన్నుఁ ద్రిభువనేశుం డనుచున్
ఇన్ని దినంబుల నుండియు
నెన్నఁడు నినుఁ బెట్టు మనుచు నింద్రము సేయన్. 21

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము మేరయెల్ల
గోర్కిదీర బ్రహ్మకూఁకటి ముట్టెద
దానకుతుకసాంద్ర దానవేంద్ర. 22

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె. 22

ఆ. ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ
సత్యగతులు వృద్ధసమ్మతంబు
లడుగఁ దలఁచి కొంచె మడిగితి వోచెల్ల
దాతపెంపు సొంపుఁ దలఁప వలదె. 24

వ. అని మఱియు నిట్లనియె. 25

మ. వసుధాఖండము వేఁడితో జగములన్ వాంఛించితో వాజులన్
వెసనూహించితొ కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీవడుగ నీ భాగ్యంబు నీపాటిగా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీయల్పంబు నీ నేర్పునే. 26

వ. అనిన మొగంబునం జిఱునగవు మొలక లొత్త గృహ మేధికి మేధావి యిట్లనియె. 27

మ. గొడుగో జన్నిదమో కమండులువొ నాకున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూములెక్కడ కరుల్ వామాశ్వు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదాకాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవకిచ్చు టది బ్రహ్మాండంబు నాపాలికిన్. 28

వ. అదియునుంగాక. 29

క. వ్యాప్తింబొందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచుం
దృప్తింజెందని మనుజుఁడు
సప్త ద్వీపముల నయినఁ జక్కంబడునే. 30

శా. ఆశాపాశము దాఁ గడున్ నిడుపు లేదంతంబు రాజేంద్ర వా
రాశిప్రావృత మేదినీవలయసామ్రాజ్యంబు సేకూడియుం
గాసిం బొందిరి గాక వైన్యగయభూకాంతాదు లున్నర్థకా
మాశం బాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే. 31

సీ. సంతుష్టుఁ డీమూడు జగములఁ బూజ్యుండు
సంతోషి కెప్పుడు జరుగు సుఖము
సంతోషి గాకుంట సంసారహేతువు
సంతసంబున ముక్తి సతియు దొరకుఁ
బూఁటపూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ
తుష్టిని దేజంబు దోన పెరుఁగుఁ
బరితోషహీనతఁ బ్రభ సెడి పోవును
జలధార ననలంబు సమయునట్లు

ఆ. నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట
దగవుగాదు నాకుఁ దగినకొలఁది
యేను వేడికొనిన యీ పదత్రయమును
జాలదనక యిమ్ము చాలుఁజాలు. 32

వ. అని యిట్లు పలుకుచున్న ఖర్వునకు నుదీర్వదానంబు సేయం దలంచి కరకలితసలిలకలశుండైన యవ్వితరణ ముఖరునిం గని నిజవిచారయుక్తదనుజరాజ్యచక్రుండగు శుక్రుం డిట్లనియె. 33

సీ. దనుజేంద్ర యీతఁడు ధరణీసురుఁడు గాఁడు
దేవకార్యంబు సాధించు కొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితి గర్భంబునఁ
గశ్యపసూనుఁడై కలిగె నకట
యెఱుఁగ కీతని కోర్కి నిచ్చెదనంటివి
దైత్యసంతతి కుపద్రవము వచ్చు
నీ లక్ష్మిఁ దేజంబు నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చుఁ దా వాసవునకు

ఆ. మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల
నఖలకాయుఁ డగుచు నాక్రమించు
సర్వధనము విష్ణు సంసర్జనముసేసి
బడుగు వగిది నెట్లు బ్రదికె దీవు. 34

క. ఒక్క పదంబున భూమియు
నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి యున్నత మూర్తిన్
దిక్కులు గగనముఁ దానై
వెక్కసమై యున్న నెందు వెడలెదు చెపుమా. 35

సీ. ఇచ్చెదనని పల్కి యీకున్న నరకంబు
 గ్రోవ నీవును సమర్థుఁడవు గావ
యేదానమున నాశమేతెంచు నదియును
 దానంబుగాదంద్రుతత్త్వవిదులు
దానంబు యజ్ఞంబుఁ దపము కర్మంబును
 దావిత్తవంతుఁడై తలఁప నలయుఁ
దనయింటఁ గల సర్వధనమును నైదు భా
 గములుగా విభజించి కామమునకు

ఆ. నర్థమునకు ధర్మయశముల కాశ్రిత
బృందములకు సమతఁ బెట్టునట్టి
పురుషుఁ డిందునందుఁ బూర్ణుఁడై మోదించుఁ
దన్నుమానిచేత దగవు గాదు. 36

వ. అదియునుంగాక యీ యర్థంబునందు బహుభంగి బహ్వృచ
గీతార్థంబుగల దొక్కటి సావధానుండవై యాకర్ణింపుము. 37

సీ. అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో
 నన్నృతంబు గాదు లేదనిన నధిప
యాత్మవృక్షము మూల మనృతంబు నిశ్చయ
 మనృతమూలము గల్గ నాత్మసెడదు
పుష్పఫలము లాత్మభూజంబునకు సత్య
 మాత్రమౌను బ్రదుకమి నదియుఁ జెడును
ఫలపుష్పములు లేక పససెడి వృక్షంబు
 మూలంబుతో వృద్ధిఁ బొందుఁగాదె

తే. చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ జెంద కుండ
నిచ్చు పురుషుండు సెడకుండు నిద్ధచరిత

కాక యంచిత సత్యసంగతి నటంచు
నిజధనంబర్థి కిచ్చిన నీకు లేదు. 38

ఆ. సర్వమయినచోట సర్వధనంబులు
నడుగ లేదటంచు ననృత మాడు
చెనఁటి పంద నేమిసెప్పఁ బ్రాణముతోడి
శవము వాఁడు వానిజన్మ మేల. 39

వ. మఱియు నిందొక్కవిశేషంబు గలదు వివరించెద. 40

ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణవిత్తమానభంగమందుఁ
జకిత గోకులాగ్రజన్మరక్షణమందు
బొంక వచ్చు నఘము వొందఁ డధిప. 41

మ. కులమున్ రాజ్యముఁ దేజమున్ నిలుపు మీకుజ్జంతు విశ్వంభరుం
డలఁతింబోఁడు త్రివిక్రమస్ఫురణవాఁడై నిండు బ్రహ్మాండముం
గలఁడే మాన్ప నొకండు నాపలుకు లాకర్ణింపు కర్ణంబులన్
వలదీ దానము గీనముం బనుపుమీ వర్ణిన్ వదాన్యోత్తమా. 42

వ. అని యిట్లు హితంబు వలుకుచున్న కులాచార్యునకు క్షణ
మాత్రనిమీలితలోచనుండై యశస్వి యిట్లనియె. 43

సీ. నిజ మానతిచ్చితి నీవు మహాత్మక
మహిని గృహస్థధర్మంబు నిదియ
యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు
నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు
నర్థలోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు
పలికి లేదనుకంటెఁ బాప మెద్ది
యెట్టి దుష్కర్ముని నే భరించెదఁ గాని
సత్యహీనుని మోవఁ జాల ననుచుఁ

తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరమున నుండి తిరుగక చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె
మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె. 44

క. ధాత్రిని హాలికునకును సు
క్షేత్రము బీజములు నొకటఁ జేకుఱుభంగిం
జిత్రముగ దాత కీవియుఁ
బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే. 45

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరి మూట గట్టికొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా. 46

క. ఉడుగని క్రతువుల వ్రతములఁ
బొడగనఁ జననట్టి పొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడినఁట ననుబోఁటికి
నిడ రాదె మహానుభావ యిష్టార్థంబుల్. 47

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందుకరంబు క్రిందగుట మీఁదై నాకరంబుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే.

మ. నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుండభ్యాగతుండైన నాఁ
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్. 49

ఆ. నోడివినంతవట్టు నుసలక యిచ్చుచో
నేల కట్టు విష్ణుఁ డేటి మాట
గట్టైనేనిఁదాన కరుణించి విడుచును
విడువ కుండ నిమ్ము విమల చరిత. 50

క. మేరువు దలక్రిందైనను
బారావారంబు లింకఁ బాఱిన లోలో
ధారుణి రజమై పోయినఁ
దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్. 51

మత్తకోకిలము. ఎన్నఁడుం బరు వేడఁబోఁడఁట యేకలుండఁట కన్న వా
రన్నదమ్ములు నైన లేరఁట యన్నివిద్యల మూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రోడగుజ్జఁట చేతు లొగ్గి వసింప నీ
చిన్ని పాపనిఁ ద్రోసి పుచ్చఁగఁ జిత్త మొల్లదు
సత్తమా. 52

వ. అని యిట్లు సత్యపదవీప్రమాణతత్పరుండును వితరణకుతూహల సత్వరుండును విమలయశస్కుఁడును దృఢమనస్కుఁడును నియతసత్యసంధుండును నర్థిజనకమలబంధుండును నైన బలిం జూచి శుక్రుండు గోపించి మదీయశాసనం బతిక్రమించితివి గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శాపం బిచ్చె. బలియును గురుశాపతప్తుండయ్యు నన్నృతమార్గంబున కభిముఖుండు గాకుండె నప్పుడు. 53

ఆ. బ్రదుక వచ్చుఁ గాక బహుబంధనము లైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు మానధనులు. 54

వ. అయ్యవసరంబున. 55

ఆ. దనుజలోకనాథు దయిత వింధ్యావళి
రాజవదన మదమరాళగమన
వటుని కాళ్లు గడుగ వరహేమఘటమున
జలము దెచ్చె భర్త సన్న యెఱిఁగి. 56

వ. అయ్యవసరంబునఁ గపటవటునకు నద్దానవేంద్రుం డిట్లనియె. 57

క. రమ్మా మాణవకోత్తమ
లెమ్మా నీ వాంఛితంబు లేదన కిత్తుఁ
దెమ్మా యడుగుల నిటు రా
నిమ్మా కడుగంగ వలయు నేఁటికిఁ దడయన్. 58

వ. అనిన విని. 59

మ. బలిదైత్యేంద్ర కరద్వయీకృతజలప్రక్షాళనవ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమనస్సంప్రార్థితశ్రీదముం
గలితానమ్రమరమాలలాటపదవీకస్తూరికాశాదమున్
నలినామోదము రత్ననూపురితనానావేదముం బాదమున్. 60

క. సురలోక సముద్ధరణము
నిరత శ్రీకరణ మఖిలనిగమాంతాలం
కరణము భవసంహరణము
హరిచరణము నీటఁగడిగె నసురోత్తముఁడున్. 61

వ. ఇట్లు ధరణీసురదక్షిణచరణప్రక్షాళనంబు సేసి వామపాదంబు
గడిగి తత్పావనజలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశకాలాది
పరిగణనంబు సేసి, 62

శా. విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్య విదే త్రిపాద ధరణిం దాస్యామి యంచుం గ్రియా
క్షిప్తుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాఁచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధార వోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్.

ప. తత్కాలంబున. 64

ఆ. నీరధారఁ బడఁగనీక యడ్డంబుగాఁ
గలశ రంధ్ర మాఁపఁగాను దెలిసి
హరియుఁ గావ్యనేత్రమఁట గుశాగ్రంబున
నడువ నేకనేత్రుఁ డయ్యె నతఁడు. 65

వ. అంత. 66

మ. అమరారాతికరాక్షతోక్షితపవిత్రాంభఃకరశ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డె ఖండితదివౌకస్స్వామిజిన్హస్తముం
గమలాకర్షణ సుప్రశస్తము రమాకాంతాకుచోపాస్తముల్
విమలశ్రీకచశాతచూచుకతటీవిన్యస్తముల్ హస్తముల్. 67

క. మునిజననియమాధారను
జనితాసురయువతినేత్రజలకణధారన్
దనుజేంద్రనిరాధారను
వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్. 68

ఆ. కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రుమాట లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్రమనుచు నిచ్చె దానము బలి
మహి వదాన్యుఁడొరుఁడు మఱియుఁ గలఁడె. 69

క. బలి సేసిన దానమునకు
నలినాక్షుఁడు నిఖిలభూతనాయకుఁ డగుటం

గలకలమని దశదిక్కులు
బళిబళి యని పొగడె భూతపంచక మనఘా. 70

క. క్షితిదాన మిచ్చు నతఁడును
నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు
శతమఖలోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్. 71

వ. అట్లు గావుననే దానంబును భూదానంబునకు సదృశంబు గానే రదు గావున వసుంధరాదానంబిచ్చితి వుభయలోకంబులం గీర్తి సుకృతంబులు వడయుమని పలికి యమ్మాయావటుం డిట్లనియె. 72

క. ఇదియేమి వేఁడితని నీ
మది వగవక ధారవోయుమా సత్యము పెం
పొదవఁగఁ గోరిన యర్థం
బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 73

వ. అని పలికిన వటుని పలుకులకు హర్షనిర్భరచేతస్కుండై వైరోచ నుండు. 74

ఆ. పుట్టి నేర్చుకొనెనొ పుట్టక నేర్చెనో
చిట్టి బుద్ధు లిట్టి పొట్టివడుగు
బొట్ట నున్న వెల్ల బూమెలు నని నవ్వి
యెలమి ధరణిదానమిచ్చె నపుడు. 75

——:0:——

# శ్రీ కాళహస్తి మాహాత్మ్యము

(ధూర్జటి)

## తృతీయాశ్వాసము :

## నత్కీరోపాఖ్యానము

—: నత్కీరుఁ డొక భూతమునకుఁ జిక్కుట :—

సీ. తన పలాశశ్రేణి ధరకంతటికిఁ బచ్చ
 పట్టుఁ బుట్టంబు మేల్కట్టు గాఁగఁ
దన యూర్ధ్వశాఖావితానంబు సురలకు
 మరకతరచితహర్మ్యములు గాఁగఁ
దన వ్రేలుగొమ్మలు మునులకుఁ గల్పిత
 పర్ణశాలాకలాపములు గాఁగఁ
దన దిశాంతభ్రాంతఘనవిటపచ్ఛాయ
 వలయాద్రి హరిణశాద్వలము గాఁగఁ

తే. వాలఖిల్య మునీశ్వరావాసమైన
రోహణము రీతి పిత్రుముక్తిదేహమగుచు
గయఁ బ్రసిద్ధి వహించు నక్షయవటంబు
చందమున నున్న యొక మఱ్ఱిక్రింది కేగి. 1

వ. తదీయ శాఖాశైత్యంబున కత్యంత సంతోషంబు నొంది కూర్చుండి తద్వటంబుననుండి రాలిన పండుటాకులు బట్టబయటఁ బడినయవి విహంగంబులు జలంబులం బడినయవి మీనంబులునై పోవ నందొక్క పలాశంబు జలాశయంబున సగమును దటప్రదేశంబున సగంబును బడి మీనపక్షిత్వంబులఁ గైకొని

లోపలి కిన్నెలుపలికిం దివియు చమత్కారంబు నత్కీరుండు
చూచి యద్భుతరసపరవశుండై యుండె నంత. 2

ఉ. క్రూరనిరీక్షణప్రభల గ్రుడ్డులు గోఱలు నూర్ధ్వకేశముల్
నీరదనీలగాత్రమును నిష్ఠురవాక్యము లట్టహాసముల్
ఘోరవకంఠనిస్వనము భీకరహేతియు మానవాస్థి హా
రారవము ల్సెలంగ వికటాకృతితో నొక భూత మాతనిన్. 3

క. పట్టికొని తనదు గుహకుం
బెట్టిదముగఁ దెచ్చి మునుపు పెట్టిన మనుజుల్
దట్టఁబడిన పులుఁగుల గతి
నిట్టట్టు పడంగ నునిచి యెంతయు వేడ్కన్. 4

క. వారల నందఱ నేకా
హారముగాఁ గొనఁదలంచి యయ్యద్రి బిల
ద్వారమున రాయి ద్రోచి మ
హారయమునఁ గొలను నుదకమాడఁగఁ బోవన్. 5

వ. మునుపున్న మనుష్యులు నత్కీరునిం గనుంగొని యిట్లనిరి. 6

ఆ. ఏమి సేయ వచ్చు నింతయు మామీఁదఁ
గరుణ లేక కమలగర్భుఁ డిపుడు
నిన్నుఁ దెచ్చిపెట్టె నేఁడిక నందఱఁ
దిను నితండు పీని తెఱఁగు వినుము.

ఉ. నూఱుక త్రావు నీతఁడు కనుంగొను నంతటిలో మనుష్యులన్
నూఱువు రైనఁ గాని తిన నోటికి నాట దటంచుఁ గూర్చఁగా
నూఱువు రైరి నేటికి మనుష్యులు నీవునుఁగూడ, నింతటన్
నూఱును నిండె నిందఱ కనుగ్రహ మీశ్వరుఁ డేమి సేయునో. 8

క. అనవుడు నత్కీరుండును
మనమునఁ దలపోసి దీని మానుపఁ బురభి
త్తనయుఁడు తారకదమనుఁడు
తనకుం గలుగంగ నింకఁ దలఁకే లనుచున్. 9

—: నత్కీరుని సుబ్రహ్మణ్యస్వామి రక్షించుట :—

ఉ. తారకదైత్యభంజనుఁడు దారుణశక్తిధరుండు పన్నగా
హారహయుండు దీనజనతామరభూజము షణ్ముఖాట్టహా
సారభటీవిపాటితదిగంతకటాహుఁడు వీనిఁ బట్టి సం
హార మొనర్చి యిందఱ కృపాంబుధియై బ్రదికించు గావుతన్. 10

ఉ. భూతముఁ జంపుటే యరుదు భోరనఁ దారకు మన్నిగొన్న వి
ఖ్యాతమహాప్రతాపునకు నద్రిగుహాలయ మేమి దొడ్డు ని
ర్ఘాతమువంటి శక్తిఁగొని క్రౌంచముఁ జించిన రౌద్రమూర్తికిన్
భీతిఁ దొఱంగఁజేయు టొక పెద్దయె వారితదేవతార్తికిన్. 11

వ. అని యనేక ప్రకారంబుల బ్రహ్మణోక్తియుక్తంబుగా నిష్ట దేవతావరేణ్యుండును భక్తశరణ్యుండును నగు సుబ్రహ్మణ్యు సన్నుతింప ననుకంపాతరంగితాపాంగుండై యతండు చండతర వేగంబునం బయింబడి భూతంబు భూతలంబు పయింబడం బెడ చేత నడిచి బిలద్వారంబునం ద్రోచిన రాతిఁ దిగిచివైచి యందఱ వెడలుండని యనుగ్రహించిన డెందంబుల నానందంబున బొంగి యిందు శేఖరునందను సందర్శించి వందనంబులు సందడించుచు వారెందేనియుం జనిరి. నత్కీరుండును బునఃప్రణామం బాచ రించి నిలుచుటయుఁ బ్రసన్నతాంకురంబులు ముఖపంకేరు హంబునం బ్రభవింప నీవీ యెడకు రాఁగతం బేమి? యని యడుగుటయు నిట్లని విన్నవించె. 12

క. ఓ శరణాగత వత్సల!
కాశవన ప్రభవ! దీనకల్పక! యాప
న్నాశకర! **దురితగిరిఛే**
వేశ నను గరుణం జూడవే సుఖ నగుదున్. 13

ఉ. ఏనొక తప్పుఁ జేసిన మహేశుఁడు నన్ను శపించె గుష్ఠరో
గానుపమవ్యథన్ బడు మటంచును దానికి శాపమోక్ష మి
ట్లానతి యిచ్చె నాత్మనిలయంబగు రౌప్యనగంబుఁ జూచినన్
మాను నటంచు నక్కుధర మార్గము దుర్గమ మేమి సేయుదున్.

క. ఏలాగున దర్శింతుం
గైలాసం బెపుడు గాని కానన్ ఖేదో
ల్లోలోర్మి రోగజలనిధి
వేల యనుచు విన్నవింప విని గుహుఁడు దయన్. 15

శా. కైలాసం బనెఁగాని యుత్తరదిశాకైలాస మంచాడఁ డా
కాలగ్రీవుఁడు, నీవు దక్షిణదిశాకైలాసముం జూచినన్
జాలుం గుష్ఠము మాను నంచు మదిలోఁ జర్చించి యా పర్వతం
బాలోకింపఁగ నశ్రమంబగు నుపాయం బాత్మఁ జింతించుచున్.

తే. తన మహాత్త్వమ్ముఁ డాఁచి నెత్తమ్మి కొలని
మహిమవలె నుండ నా కవి మండలేంద్రు
నాడు మిందునఁ గైలాస మాడఁబోవు
తీర్థ మెదురైన రీతి సిద్ధించు ననుడు. 17

—: నక్కీరుఁడు సాయుజ్యము వడయుట :—

శా. సేనానీ వచనామృతంబు చెవులం జిందంగ డెందంబులో
నానందం బుదయింప నక్కొలనిలో నత్యంత నిష్ఠం గృత
స్నానుండై తలఁ యెత్తఁగా నెదుటఁగా నన్వచ్చె నాలోన వా
చీన స్థాణునగంబు హేమముఖరీసింధుప్రతీరంబునన్. 18

శా. కుష్ఠవ్యాధియు మానె హేమముఖరీ కూలస్థ కైలాసమున్
నిష్ఠాధీనమనస్కుఁడై కదిపి తన్నీరంధ్ర కల్లోల భూ

యిష్టౌఘుంబునఁ దీర్థమాడి గిరిజాధీశుఁ శివుఁ దేవతా
శ్రేష్ఠుఁ సంస్తుతి నూఱుపద్యములఁ జేసెన్ ద్రావిడోక్తిందగన్.

క. ఆ నూఱు పద్యములకున్
సేనానీజనకుఁ డార్తచింతామణి వి
ద్యానిధి జ్ఞాన ప్రనవాం
బానాథుఁడు కాళహస్తి పతి ప్రీతుండై. 20

శా. ప్రత్యక్షం బగుచున్ భవద్భనము సాఫల్యంబునుం బొందె సా
హిత్య శ్రీవర! నీకు నింపగు వరంబే నిచ్చెదన్ వేఁడు భీ
తిత్యాగం బొనరించి నాఁడవన నక్కీరుండుమాజానికిన్
బ్రత్యగ్జ్యోతికి మ్రొక్కి మ్రొక్కి ప్రమద ప్రాయాంతరంగంబుతోన్.

క. నిటలంబున నంజలి పుట
ఘటనం బొనరించి ప్రమదగద్గదగళమ
స్ఫుట వర్ణస్తుతి భాషా
ర్భటియును రోమోద్గమంబు పైపైఁ బఱగన్. 22

వ. ఇట్లు విన్నవించె. 23

క. ఈ సంసారము దుఃఖా
వాసానందంబు దీని వర్జింపంగా
నే సుఖము గల్గు దయ న
న్నా సుఖమునఁ గూర్పవే కృతార్థుఁడ నగుదున్. 24

మ. అని ప్రార్థింపఁగ భక్తకల్పకమవిద్యాసూత్రదాత్రంబు జీ
వన ఖేదాంబరకర్తరీముఖము కైవల్యార్థదానామృతా
శనరత్నంబు తుషారశైలతనయా జాంపత్య సంపన్నపా
వనగార్హస్థ్యము కాళహస్తిపురదైవం బిచ్చె సాయుజ్యమున్. 25

—:0:—

# శ్రీమదాంధ్ర మహాభారతము

(తిక్కన సోమయాజి)

## ఆనుశాసనిక పర్వము

## గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాదము

## కవివిషయాదికము.

శ్రీమదాంధ్రమహాభారతము నితిహాస మందురు. ఇతిహాస మనఁగాఁ బూర్వవృత్తము. భారతమును సంస్కృతభాషలో వేద వ్యాసుఁడు రచించెను. దుష్యంతపుత్రుఁడగు భరతుని వంశస్థుల చరిత్ర మీ గ్రంథమున వర్ణింపఁబడియుండుటచే దీనికి భారత మను నామము గలిగినది. వేదవ్యాసుఁడు వేదోక్త ధర్మము లనేకములను వర్ణించి మహాభారతమును రచింపఁగా దేవతలు దీని యందలి మహాత్మ్యమును గనుగొనుటకుఁ దులలో నుంచి వేద ములతో సమానముగాఁ దూచఁగా నిదియే బరువుగాఁ దూగెననియు నందుచే నీ గ్రంథము భారత మను నామమును బొంది పంచమ వేదం బయ్యె ననియుఁ జెప్పుదురు.

మహాభారతములోని భాగములకుఁ బర్వము లని పేరు. సంస్కృతమున శతపర్వసనాథమైన యీ భారతము తెలుఁగునఁ బదునెనిమిది పర్వములతో నొప్పియున్నది. పర్వము లనఁగాఁ గనుపులు. పర్వము లనుటచే నీ గ్రంథమును జెఱకుగడతో సరి పోల్చెదరు. చెఱకుగడయందువలె భారతమునందును సార మెక్కువగా నుండు ననెడి సామ్యమే యిందుకుఁ గారణమై యుండనోపును. కావున మహాభారతమం దొక్కొక్క భాగమునందును జెఱకు గనుపులందలి రసముపోలె రసము చిప్పిలుచుండుటచే భారతభాగ ములకుఁ బర్వము లను పేరు సార్థకమై యొప్పియున్న దనఁదగును.

ఆంధ్రసాహిత్యమున మహాభారత మొక సార్వజనీన గ్రంథము. పదునెనిమిది పర్వముల వృత్తముతోఁ గూడుకొనిన యీ గ్రంథమును క్రీ. శ. 1022 నుండి 1063 సం॥ వఱకు నాంధ్ర దేశమును బరిపాలించిన రాజరాజనరేంద్రుని కోర్కెపై నాతని యాస్థానకవి నన్నయభట్టాంధ్రీకరించుటకుఁ బూనుకొనెను. అతఁడాదిసభాపర్వములను బూర్తిగాను నరణ్యపర్వములోఁ గొంతవఱకును రచనను సాగించి కాలవశమున దివంగతుఁ డయ్యెను. తరువాత క్రీ. శ. 1250 సం॥ ప్రాంతమున మనుమసిద్ధి భూపాలుని యాస్థానకవి తిక్కన సోమయాజి విరాటపర్వము మొదలు మిగిలిన పదునైదు పర్వముల నాంధ్రీకరించెను. మఱికొంత కాలమునకు క్రీ. శ. 1345 సం॥ ప్రాంతమున నెఱ్ఱాప్రెగ్గడ యరణ్యపర్వ శేషము నాంధ్రీకరించి పూర్తిచేసెను. ఇట్లు భారతరచన మారంభమైన పిమ్మట దాదాపు మూడువందల సంవత్సరములకుఁ బూర్తియైనది. ఈ మువ్వురు కవులకును గవిత్రయ మని పేరు. వీరు మువ్వురు ప్రామాణికకవులలో నగ్రగణ్యులు. వీరిలో నన్నయభట్టునకు "వాగనుశాసనుఁ"డనియుఁ దిక్కన సోమయాజికిఁ "గవిబ్రహ్మ, యుభయకవిమిత్రుఁ"డనియు, నెఱ్ఱాప్రెగ్గడకుఁ "బ్రబంధ పరమేశ్వరుఁడు, శంభుదాసుఁ"డనియును బిరుదములు గలవు.

ప్రస్తుత పాఠ్యభాగ మానుశాసనిక పర్వమునుండి గైకొనఁబడినది. ఈ పర్వమును దెనిగించినవాఁడు తిక్కన సోమయాజి. జగద్విఖ్యాత చరిత్రుఁడగు మంత్రిభాస్కరుఁ డీతని పితామహుఁడు. తండ్రి కొమ్మన దండనాథుఁడు. తల్లి అన్నమ. బ్రాహ్మణ క్షత్రియ ధర్మములు మూర్తీభవించిన ఖడ్గతిక్కన యీతని పెదతండ్రి యగు సిద్ధయ కుమారుఁడు. వైదిక మార్గానుప్రవర్తకులును పండితులు కవులు శూరులును నగు - మహాపురుషుల వంశమున నవతరించెను. యజ్ఞము జేసి సోమయాజి యయ్యెను.

క్రీ. శ. 1250 సం॥ ప్రాంతమున నెల్లూరు మండలము నేలిన మాండలికరాజగు మనుమసిద్ధి భూపాలుని యాస్థానకవిగా నుండి తాను రచించిన మహాభారతమును నెల్లూరులో నుండిన హరిహర నాథునకుఁ గృతియిచ్చెను. ఇతఁడు తాను రచించిన మహాభారత మునకుఁ బూర్వము నిర్వచనోత్తర రామాయణ మను గ్రంథమును రచించి మనుమసిద్ధి భూపాలున కంకితముఁ జేసెను. ఇతఁడు కృతి కర్తగాఁ బ్రసిద్ధిని పొందుటయే గాక కేతన రచించిన దశకుమార చరిత్ర మను గ్రంథమునకుఁ గృతిభర్తయై పొగడొందెను. మనుమ సిద్ధి భూపాలునకు మంత్రియై రాజ్యసంరక్షకుఁడై నెగడెను. ఒకప్పుడు మనుమసిద్ధి రాజ్యముఁ గోల్పోవఁగాఁ గాకతి గణపతిరాజు సాయ ముచే నాతనిని రాజ్యపునఃప్రతిష్ఠితునిఁ జేసిన రాజనీతి కోవిదుఁడు. కాకతి గణపతి కొలువున కేగి యచటఁ దన పాండిత్యమును బ్రద ర్శించి బౌద్ధపండితులతో వాదోపవాదముల నెగ్గి గణపతిదేవుని ప్రశంసలకుఁ బాత్రుఁ డయ్యెను. పదమూడవ శతాబ్దమున నాంధ్ర దేశమునఁ జెలరేగుచున్న శైవవైష్ణవమత వైషమ్యములను బురస్క రించుకొని యుభయులకును నైక్యత సమకూర్చుట కీతఁడు హరిహర నాథుని తన యిష్టదైవముగఁ గొలిచి తనగ్రంథము హరిహరాంకిత మొనర్చెను.

## హరిహరారాధనాతత్త్వము.

ప్రాచీనాంధ్రగ్రంథములను హిందూదేశ చరిత్రమును బరిశీ లించినచో హరిహరారాధనాతత్త్వముయొక్క యథార్థ స్వరూపము కరతలామలక మగును. దక్షిణహిందూస్థానమున 12 వ శతాబ్దము నుండి 15 వ శతాబ్దమువఱకు హిందూమతములో వివిధ సంస్కరణ ములుఁ దత్కారణమున స్పర్ధలు గలవరములు గాలక్రమోద్దిత ముగాఁ బెఱిగినవి. 12 వ శతాబ్దమున నొకవంక బసవారాధ్యునిచే

నుద్ధరింపఁబడిన వీరశైవమతమును, వేఱొకవంక శ్రీరామానుజుల వారిచే నుజ్జీవితమైన వీరవైష్ణవమతమును, శ్రీ శంకరులవారి యద్వైత మతమును డిందుపఱచి పరస్పర విజిగీషచే ముఖ్యముగాఁ గన్నడ దేశమున, నరవదేశమున దురహంకార ప్రేరితములైన వైషమ్యములు చిందులు ద్రొక్కుచుండెను. ఇట్లుండ పదమూఁడవ శతాబ్దమున మధ్వాచార్యులవారు మఱియొక విధముగా వైష్ణవవిభాగము గావించి కయ్యపువేడుకను ముప్పిరిగొల్పిరి. ఇట్లావేశపూరితముగాఁ బెనఁగులాడుచుండిన వ్యవస్థలో హిందూమతముయొక్క నిజ తత్త్వము గుప్తమై యుండెను.

ఇట్టి మతవైషమ్యముల నంతరింపఁజేసి యాత్మైకతత్త్వమును బోధచేయుటయు, నానారూపధరుఁడగు భగవంతుఁ డొకఁడే యని నిర్ధరించుటయు నవశ్యాచరణీయమని కొందఱు మహాత్ములుపలక్షించి హరిహరవిభేదమును ఖండించి హరిహరైకతత్త్వప్రబోధముఁ జేయసాగిరి. అట్టి సుస్థిరమతులును, సనాతన ధర్మానుష్ఠాన నిరతులును, వేదశాస్త్ర పారంగతులును, శాంతశీలవ్రతులును నగు మహాత్ములలో నొకరు ప్రస్తుత పాఠ్యభాగమునకుఁ గర్తయైన తిక్కన సోమయాజి. ఇతఁడు హిందూసనాతన మతగౌరవమును సంస్థాపించుచుఁ దన జీవితము నన్నివిధముల దేశసేవాదులఁ గర్పించి హరిహరాత్మకమగు పరమాత్మను ధ్యానించుచుండెను. అందు వలన నీతఁడు తన గ్రంథమును హరిహరున కంకితముఁ జేసెను. ప్రతి పర్వమునందును మొదట హరిహరుని ప్రార్థించి కథను వ్రాయుట కుపక్రమించుట తిక్కనకుఁ బరిపాటి.

తిక్కన కవిత్రయమువారిలో ద్వితీయుఁడైనను నద్వితీయుఁడైన మహాకవి. ఇతని కవిత్వము మిక్కిలి మృదుమధురముగ నుండి తెనుఁగున నిట్టి కవివరం డొరుఁడు లేడని చాటుచున్నది.

ఇతఁడు మాతృకలో నుండు నసందర్భములను నప్రయోజనములను బరిహరించి కవితనాంధ్రదేశీయముగ నుద్ధరించినాఁడు. భాషాంతరీకృతి యైనను స్వకపోల కల్పితకావ్యమువలె సంతరించినాఁడు. తెనుఁగు పదములను వాడుకలో నున్నవానిని చేఁబట్టి భాషను విపులము జేసి పదప్రయోగవైచిత్ర్యములకు మార్గదర్శి యైనాఁడు. ఇతని శైలిలోని శబ్దజాల మర్థమున కనుగుణముగా నుండును. శైలియందలి అనుప్రాసాది శబ్దాలంకారములు భావమునకుఁ బ్రతిబంధకములు గాక సహజములై రసమును బోషించుచుండును. ఇతని కవితయందలి పదములచే నధికమగు భావము ధ్వనించుచుండును. ధార యనర్గళమై గంగాప్రవాహమువలెఁ బరుగిడుచుండును.

ఆ కాలమునాటికి సంస్కృతఛందోరీతులతోను, భాషారీతులతోను గూడిన మార్గపద్ధతి యను నొకరీతియు, సామాన్య ప్రజాబాహుళ్యమునందు వ్యాప్తిలోనున్న దేశిపద్ధతి యను నొక రీతియుఁ గవితారంగమున విలసిల్లుచుండ నీతఁడే యీ రెండుపద్ధతులకును బొత్తుఁగూర్చి యుభయకవిమిత్రుఁ డని బఱఁగెను. ఈతని కవిత్వమందు మూడుపాళ్లు తెలుఁగు పదములును నొకపాలు సంస్కృత పదములును గన్పించుచుండును. వరుగువంటి నీరసకథనుగూడ సరసముగాఁ దీర్చి కావ్యకళశోభతో నింపు నైపుణి తిక్కనకుఁ గలదు. ఇతఁడు ప్రయత్నపూర్వకముగాఁ దన మహిమను బ్రకటించుకొనుటకుఁ బ్రయాసపడక పాఠకులు భారతామృతమును గర్ణపుటంబులఁ గ్రోలుటకుఁ బాటుపడెను.

ఇతని దృష్టి లోకవ్యవహార నైపుణ్యప్రధానముగా నుండును. లోకవ్యవహారమున నితఁడు సాంగవేదాధ్యయనముఁ జేసినవాఁడు. లోకశాస్త్రికళాజీవన రహస్యములను దన విజ్ఞానవివేక మంధరముతో మథించి ప్రజాభద్రజీవితమునకు శాశ్వతముగా నమృత

కలశము నందించినాఁడు. ఈ మహాత్త్వ మాయనలో నాయన యుభయకవిమిత్రతలో నాయన హరిహరోపాసనాతాత్పర్యములో "ఆంధ్రావళి మోదమున్ బొరయ" కావ్యనిర్మాణము చేయుటలో నిమిడియున్నది. ఆ మహాకవి మనకుఁ ద్రికాలములయందు నారాధ్యమూర్తి.

ఆనుశాసనికపర్వ మార్యవిజ్ఞానమునకుఁ బేటిక. ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబన్న ప్రశంస యీ పర్వమునకే విశేష ముగా నన్వయించుచున్నదని చెప్పవచ్చును.

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ

తే.గీ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.

—భార. ఆది.

——:0:——

# గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాదము

## కథాసంగ్రహము

శ్రీమదాంధ్రమహాభారతమునం దానుశాసనికపర్వములో నిది యొక యుపాఖ్యానము. ఉపాఖ్యాన మనఁగా నొకానొక పెద్ద కథాసందర్భమున వచ్చు చిన్న కథావిభాగమునకు నుపాఖ్యాన మని పేరు. సాధారణముగా నుపాఖ్యానములు నీతిప్రబోధకములై యుండును. ఇట్టి యుపాఖ్యానములు భారత భాగవతాదిగ్రంథ ములయం దెక్కువగా నుండును. ప్రస్తుత పాఠ్యభాగమైన గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాద మొక యుపాఖ్యానము.

ఈ యుపాఖ్యానమును కురుక్షేత్ర మహాసంగ్రామము ముగి సినపిదప శరతల్పగతుఁడైన భీష్ముఁడు తన మనుమఁడగు ధర్మ రాజునకుఁ జెప్పెను. ఒక్కొక్క ధర్మము నుపదేశించు సందర్భమున భీష్ముఁడు దాని కుదాహరణముగా నొక్కొక్క యుపాఖ్యానమును దెలుపుచు ధర్మోపదేశము గావించుచుండెను. అట్టి యుపాఖ్యాన ములలో నిదియొకటి. రాజపీఠము నధిష్ఠింపనున్న ధర్మనందనుని హృదయములోని కలఁతను బోఁగొట్టి శాంతోన్ముఖునిగాఁ జేయు టయే యీ యుపాఖ్యానముయొక్క ముఖ్య ప్రయోజనము.

దివ్యజ్ఞానముచే దేదీప్యమానముగాఁ బ్రకాశించు భీష్ముం డనేకవిధంబులగు ధర్మంబు లుపదేశింప ధర్మరాజు విని యతనికి సభక్తికప్రణామం బాచరించి వినయంబున నిట్లనియె: "మహాత్మా! నీవు నాయందుఁగల దయచేత నా చిత్తమునకు శాంతి చేకూరుటకై యనేకవిధంబులైన ధర్మంబుల నుపదేశించితివి. కాని నామనస్సునకుఁ గొంచెమైనను శాంతి గలుగుటలేదు. కఠినాత్ముండనై యనేక

బంధువులను యుద్ధమందు సంహరించితిని. అది యొకవంకయు, నిన్ను యుద్ధమునఁ బడవైచి ఘోరకర్మంబునకుఁ బాల్పడితిని, అది మఱియొకవంకయు నా చిత్తంబును గలఁతబెట్టుచున్నవి. అట్టి పాపకర్మంబులను జేసిన నా చిత్తంబున కెట్లు శాంతిగల్గును? దుర్యోధనుం డధిక లోభగుణముగలవాఁడై రాజ్యమునఁ బాలొసంగి నాతోఁ గలసియుండుటకు సమ్మతింపకపోయెను. నేనైనను వానికి రాజ్యము నప్పగించి తొలఁగకపోయితిని. ఇంత చేటు సంభవించుటకు మే ముభయులమే కారణము. నాకీక దుఃఖం బెవ్విధంబునను బోనేర''దని ధర్మజుండు వాపోవుచుండ భీష్ముం డిట్లనియె. ''ధర్మ నందనా! ఒకరిని చంపుటకు మనుష్యుఁడు కర్తగాఁడు. ఇతిహాస మొక్కటి గలదు చెప్పెద వినుము.''

పూర్వము శమాన్వితయైన గౌతమి యను భూసురాంగన గలదు. ఆమెపుత్రుండు సర్పదష్టుండై కాలవశత్వంబుఁ బొందెను. ఆమె కుమారుని యకాలమరణంబునకుఁ గడు వగచుచుండెను. ఒక మేటికిరాతుండు రోషావేశముతో బాలుని గఱచిన సర్పంబు నొక త్రాట బంధించి తెచ్చి గౌతమియెదుటఁ బెట్టి ''యీ పామును గోల చేతఁ గొట్టెదను లేక కత్తిచే రెండు తునియలుగాఁ జేసెద''నని చెప్పఁగా, గౌతమి యందుల కొడంబడక పామును విడువుమని చెప్పెను. అంతఁ గిరాతుండు ''తల్లీ, గౌతమీ! యీ నాగంబు నీ బిడ్డనుజంపిన పాతకి. విడువఁదగినది కాదు. కావున చంపెద''నని చెప్పఁగాఁ గౌతమి కిరాతునితో ''నర్జునకా! యవివేకులు దైవవశం బునఁ గల్గిన కీడునకు దుఃఖింతురు. వారు శాంతిని గోల్పోయి సంసార సాగరంబున మునుఁగుదురు. పుణ్యాత్ములు శమాన్వితులై సంసార సాగరమందు మునుఁగరు. నీవీ సర్పంబును జంపినయెడల నా కుమారుండు జీవించునా? జీవింపఁడు. గనుక నీవీ వ్యాళంబును విడువు''మని చెప్పెను.

అందులకుఁ గిరాతుండు "తల్లీ! నీ పేదమాటలు కోపనివశుండనైన నాకు నచ్చవు. కనుక నేవిధముగానైనను సర్పంబును జంపుదు నేగాని విడిచిపెట్టను". అంత గౌతమి "కిరాతుఁడా! మహీసురులు కూడదని చెప్పినమాటల నెవ్వరు నతిక్రమింపరు. కావున నీవంటి గుణవంతున కిట్టికఠినత్వము తగ"దని చెప్పఁగాఁ గిరాతుండు "తల్లీ! జనబాధకంబులైన జంతువులను జంపుటవలన హింసాదోషంబులు గలుగవు. వృత్రాసురుని దేవేంద్రుఁడు సంహరింపలేదా? దక్షాధ్వరంబు రుద్రుండు ధ్వంసంబు సేయలేదా? కావున నేనీ విషవ్యాళంబును జంపి జనులబాధను బాపెదను. నీ విందుల కియ్యకొను" మని నిర్బంధించెను. కాని దయామతియైన గౌతమి యందుల కియ్యకొనక సర్పంబును విడువుమని చెప్పెను.

అంత సర్పంబా యర్జునకున కిట్లనియెను. "కిరాతుఁడా! నేనేమి తప్పిదము నొనరించితిని. మృత్యుదేవత యధీనమువలన బాలుని గఱచితిని. అది కారణంబుగా బాలుండు గాలవశంబునఁ జచ్చెను. నా చిత్తంబునఁ గామక్రోధాదులు లేవు. ఇది తెలియక నీవు నన్నుఁ జంపెద ననుచున్నావు". అందులకుఁ గిరాతుండు "సర్పమా! నీవు మృత్యుదేవతకు సాధనమవగుటఁ జేసి నిన్ను దండించుట యుచితంబు. కావున నిన్ను దప్పక చంపెద"ననఁ బాము మిట్లనియె. "కిరాతుఁడా! కుమ్మరివానికిఁ జెడిపోయిన కుండలఁ బగులఁగొట్టుటకుఁ గఱ్ఱ సాధనమైనట్లు నేను మృత్యువునకు సాధనమైతిని. నేను నిమిత్తమాత్రుండను. లేనిచో నొకరిని చంపుటకు నాకు సాధ్యముగా"దని చెప్పఁగాఁ గిరాతుం డిట్లనియె. "సర్పమా! లోకములో నొకనిని మఱియొకఁడు చంపినయెడలఁ జంపినవాఁడే పాపము ననుభవింపవలసియుండును. ఎవరో పంపఁగాఁ గఱచితినిగాని బాలుని నేను చంపలేదని సమర్థించుకొనెదవు. నీవు చెప్పునది సరికాదు. కావునఁ గ్రూరజంతువగు నిన్నుఁ జంపినయెడల నాకుఁ బాపంబు గలుగదు. మఱియు మీరు

మృత్యువునకు బుద్ధిగలుగు సాధనంబులు. ఎటులైనను నినుఁ జంపుదునేగాని విడిచిపెట్ట''నని చెప్పెను. అందులకు సర్పంబు ''కిరాతుఁడా! మేము మృత్యువునకు బుద్ధిగలుగు సాధనములే యగుదుము. యజ్ఞమందుఁగల యగ్నిహోత్రమందు హవిస్సులను ఋత్విజులు వేల్చి హోమముఁ జేయుదురు. ఆ ఫలము యజ్ఞకర్తను జెందునుగాని ఋత్విజులను జెందదు.''

ఇట్లు సర్పము కిరాతునితోఁ జెప్పుచుండగా మృత్యుదేవత ప్రత్యక్షమై సర్పంబుతో నిట్లనియె. ''ఓ సర్పమా! యీ బాలుని మరణమునకై నిన్ను నేను బంపినట్లు గాలుండు నన్నుఁబంపె. కావున నీతని చావునకు నీవును నేనును గారణభూతులము గాము. సూర్యచంద్రులు, భూమ్యాకాశములు, నగ్ని, జలము మొదలగు పరికరములన్నియుఁ గాలుని యధీనములో నున్నవి. అట్లు సర్వము కాలుని యధీనమైయుండ నవివేకులు నన్ను నిందింతురేల? అట్లు నన్నే నిందించినప్పుడు నిన్ను నిందించుట యొక లెక్కయా?'' యని చెప్పఁగా నందులకు సర్పంబు ''మృత్యుదేవతా! నీవలన గుణ దోషము లున్నవని నేను చెప్పలేదు. కాలుఁడు నన్ను బంపెనని చెప్పితిని. నాపై మోపఁబడిన నిందను దోషమును నేను బాపు కొనుటకుఁ బ్రయత్నించుట దోషముగాదు. ఈ సందర్భములోఁ గాలునియందు దోషవిచారణ సేయుటకు నేను తగను. నా కావశ్యక మును లే''దని యుగ్గడించి కిరాతుని మొగంబు సూచి సర్పంబు ''కిరాతుఁడా! మృత్యుదేవతమాటలను వింటివిగదా. నాపై తప్పును మోపితివి. నన్ను జంపుట నీకు ధర్మంబుగాదు.'' అని చెప్పఁగాఁ గిరాతుండు నవ్వి ''సర్పమా! నీవును మృత్యువును బాపాత్ములు. మీరు మీ గుణంబుల సమర్థించుకొన్నయంతమాత్రమున మీ యందుఁగల దోషములు బోనేరవు. కావున మీకు నేను భయ పడవలసిన యవసరము లేదు. నా కార్యమును నేను నిర్వహింతును.''

అని చెప్పఁగా మృత్యుదేవతయు సర్పంబును నిట్లనిరి. "కాలునికి లోనై మేమాతని యాజ్ఞం బ్రవర్తించెదము. అట్టి మా కెట్టి దోషములు గలుగవు." అనిచెప్పెడి సందర్భమున ధర్మసంశయం బును బాపుటకై కాలుండు ప్రత్యక్షమయ్యెను. కాలుండు కిరాతకుని బురస్కరించుకొని "యర్జునకా! ఈ సర్పంబును మృత్యువును నేనును నీ బాలుని మృతికి హేతువులము గాము. పూర్వజన్మంబున నీబాలుఁ డేయే కర్మంబులఁ జేసికొనియుండెనో యాయా కర్మంబు లీతనిమృతికిఁ గారణభూతంబు లైనవి. అట్టి కర్మఫలప్రభావంబున నీ బాలుండు మరణించెను. కర్మఫలంబు జననమరణంబులను సుఖ దుఃఖంబులను గలిగించును. తన కర్మంబునుండి తాను దప్పించు కొనుటకు శివునకైనను సాధ్యంబుగాదనిన నితరుల విషయమును జెప్ప నక్కర లేదుగద. కావున మీ వాదంబులను మాని యిది యంతయుఁ గర్మఫలంబని గ్రహింపుఁడు." అని చెప్పగా భూసు రాంగన గౌతమి కిరాతకునితో నిట్లనియె. "కిరాతుఁడా! యంతకుని పలుకుల వింటివిగద. కావున నాయట్టిస్త్రీ లిట్టి పుత్రదుఃఖమును గలిగించు కర్మములను బూర్వజన్మంబునఁ జేసికొన్నందున నిట్టి దుఃఖములు సంప్రాప్తించినవి. అట్టి కర్మంబులను జేసికొనినవార లిట్లు పుట్టి బాల్యంబుననే గిట్టుచుందురు. కనుక మీ వాదంబులవలనఁ బ్రయోజనంబు శూన్యంబు. సకలజనంబులు దమతమ కర్మంబు లకుఁ దుల్యంబైన ఫలంబుల ననుభవించితీరవలయును. కావున నీయందుఁగల రోషవిషాదాదులను బరిహరించుకొని శాంతంబు నలవరచుకొనుము." అని గౌతమి చెప్పఁగా నర్జునకుఁడు తెలివిని దెచ్చుకొని శాంతోన్ముఖుండై సర్పంబును విడిచిపుచ్చెను. అంత నంతకుండును మృత్యుదేవతయు నంతర్హితులైరి.

కావున ధర్మనందనా! నీ బంధు మరణంబునకు నీవును దుర్యో ధనుండును గారణభూతులు గారు. మరణించినవారు దమతమ కర్మ

ఫలంబులఁ బురస్కరించుకొని మృతులైరి. అట్టివారికొఱకు నీవు దుఃఖింపరాదు. ఈ గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాదం బను నితిహాసంబునఁ గల తాత్పర్యంబును మనంబున నిడికొని నీకుఁ గల సందేహంబుల నివారించుకొని శాంతోన్ముఖుండవై సుఖంబులఁ బడయుము." అని చెప్పగా, భీష్ముండు గావించిన ధర్మోపదేశము నజాతశత్రుండు సావధానచిత్తుండై గ్రహించి, బంధుమరణంబునఁ గలిగిన మనోదుఃఖంబులను విడనాడి, శాంతచిత్తుండై సంతోషంబుతో శాంతనవునితో నిట్లనియె.

—(:0:)—

# శ్రీమదాంధ్ర మహాభారతము



## అనుశాసనికపర్వము - ప్రథమాశ్వాసము.

### ప్రతిపదార్థ తాత్పర్యాదులు

1. శ్రీమత్ = సంపద్యుక్తమైన; కటాక్ష = క్రేగంటి చూపులయొక్క; రోచిస్ = కాంతులయొక్క; స్తోమ = సమూహముయొక్క; సముల్లాస = ప్రకాశముచేత; విహిత = విధింపఁబడిన; సుస్థిర = మిక్కిలి స్థిరమైన; లక్ష్మీ = సంపదయొక్క; భూమ = అతిశయముచేత; ఆనందిత = ఆనందింపఁజేయఁబడిన; భక్త = భక్తులయొక్క; వ్యామోహ = కోరికలవలన; విదూర = దూరమై యుండుటచేత; యుక్త = కూడినవాఁడ; హరిహరనాథా! = (హరిహరనాథు నకు సంబోధనము.)

తా. హరిహరనాథుని కటాక్షములు శ్రీమంతములు. భక్తుల నాతఁ డట్టి కటాక్షముచేఁ జూచెను. ఆ కటాక్షప్రసరణములవలన భక్తులకు సుస్థిర లక్ష్మి గలిగి, వారితర వ్యామోహంబులకు విదూరులై యానందించిరి. (ఇచట లక్ష్మియనఁగా మోక్షలక్ష్మి యనుట యుచితము. నేత్రములయందు లక్ష్మి నివసించునని కవిసమయము. "వాణీం ముఖేన నేత్రాభ్యాం శ్రియం దోష్ణాచ మేదినీం మానయం స్తుల్యతాం ధత్తేతాసు రుద్రనరేశ్వరః"

—ప్రతాపరుద్రీయము.

వ్యా. వి. భూమ + ఆనందిత = భూమానందిత (సవర్ణ దీర్ఘసంధి).

సూ. సంస్కృతశబ్దంబులకు సంహిత యున్నప్పుడు అ, ఇ, ఉ, ఋ కారములకుఁ గ్రమముగా అ, ఇ, ఉ, ఋ వర్ణములు పరమగునేని దీర్ఘ మేకా దేశము గావచ్చును.

2. దివ్యజ్ఞాన దేదీప్యమానుండు=దైవసంబంధమైన విజ్ఞానముచే మిక్కిలి ప్రకాశించువాఁడు; దేవవ్రతుండు = భీష్ముఁడు; వివరింపన్ = వక్కాణింపఁగా ఆకర్ణించి=విని; అజాతశత్రుండు=ధర్మరాజు; సభక్తిక ప్రణామంబు=భక్తితోఁ గూడిన నమస్కారము; వినయవిశేషవిభూషితుండై = వినయాతిశయములో నలంకరింపఁబడినవాఁడై.

తా. జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. దివ్యజ్ఞానముచే దేదీప్యమానముగాఁ బ్రకాశించు భీష్ముం డనేక విధంబులగు ధర్మంబుల నజాత

శత్రునకుపదేశించెను. అట్టి యుపదేశంబులను విని ధర్మరాజతనికి నమస్కరించి వినయవిధేయతలతో నిట్లనియె.

3. అనఘ=పాపరహితుఁడా! (భీష్మునికి సంబోధనము); నీవు; నాదగు చిత్తమునకున్ = నా యొక్క మనస్సునకు; శమంబున్ = శాంతమును; (కామ క్రోధాదులులేక యడఁగియుండుట); కావించుటకై = కలిగించుటకై; వివిధ= అనేకవిధములైన; విశదభంగులన్ = స్పష్టమైన రీతులతో; పరమకృపానిరతుండవై = మిక్కిలి దయార్ద్రహృదయము గలవాఁడవై (దయయందాసక్తి గలవాఁడవై; సకల=సర్వవిధంబులైన; ధర్మ+ఉపదేశములన్ = ధర్మములతోఁ గూడుకొనిన యుపదేశములను; చేసితి = కావించితివి; ఈ+మెయిన్ = ఇమ్మెయిన్ = ఈ విధముగా; చెప్పఁగాన్ = చెప్పినప్పటికిని; ఇంచుక+ఏని యున్ = ఇసుమంతయైనను (కించిత్తైనను); శమము = శాంతి; లేక+ఉన్నది= కలుగుటలేదు; చలముకొని=మాత్సర్యముగొని; అనేక బంధులన్ = బంధువులనేకులను; వధియించితిన్ = సంహరించితిని; అది+ఒక్క-తలయున్ = ఆ పాప మొకవంకయు; ఈ కలిగిన దారుణత్వము = నీవు యుద్ధములోఁ బడిపోవుటచే సంక్రమించిన దారుణమైన పాపము; ఒక్క-తలయున్ = మఱియొక వంకయు; ఐన = ఏర్పడిన; ఉగ్రకర్మంబులు = భయంకరమైన పాపములు; చిత్తవృత్తిన్ తగిలి=మనోవ్యాపారమునందు హత్తుకొని; ఉత్తలంబున్ చేయన్ = పరితాపమును గలిగించుచుండఁగా; శాంతి = శాంతము (శమము); ఎట్లు సిద్ధించున్ = ఏ విధముగాఁ గలుగును; ముని మాననీయ = మునుల మన్ననలకుఁ బాత్రుడైనవాఁడా! (భీష్మునికి సంబోధనము); ఇంకన్+ఏమి+చేయువాడన్= ఇంక నేనేమి చేయఁగలను.

తా. మహాత్మా! నీవు నాయందుఁగల కృపాతిశయముచే నా చిత్తమునకు శాంతిని గూర్చుటకై యనేక విధంబులైన ధర్మంబు లుపదేశించితివి. కాని నా మనస్సున కిసుమంతయైనను శాంతి సమకూరుటలేదు. కఠినాత్ముండనై యనేక బంధుల సంహరించియు నిన్ను యుద్ధమునఁ బడవైచియు ఘోరకర్మంబులకుఁ బాల్పడితిని. ఈ యుగ్రకర్మంబులు నా చిత్తమును గలఁతపెట్టుచున్నవి. ఇట్టి పాపకర్మంబులను చేసిన నాచిత్తమున కెట్లు శాంతి గలుగును.

వ్యా. వి. 1. ధర్మ+ఉపదేశములు = ధర్మోపదేశములు (గుణసంధి)

సూ. 'అ'కారమునకు ఇ, ఉ, ఋ వర్ణములు పరమగునేని క్రమముగా ఏ, ఓ, అర్ వర్ణము లేకాదేశము లగును. (ఏ, ఓ, అర్ వర్ణములకు గుణమని సంజ్ఞ.)

వ్యా. వి. 2. ఈ+మెయి = ఇమ్మెయి (త్రికసంధి.)

సూ. ఆ, ఈ, ఏ యను సర్వనామంబులు త్రికంబనంబడు. త్రికంబు మీది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగును. (ఈ + మ్మెయి) ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడాచ్చికంబగు దీర్ఘంబునకు హ్రస్వం బగును. (ఇమ్మెయి)

4. అతిలోభంబునన్ = మిక్కిలి పిసినితనముతో (ఆకాంక్షతో); నాతోన్ + పంచి = నాతోఁగూడ పంచుకొని; కుడువన్ = అనుభవించుటకు; ఒడంబడండు = ఇష్టపడఁడు; ఆగ్రహంబునన్ = కోపముతో; మా + ఇద్దఱ + కతంబునన్ = మా యుభయులవలన (మే మిద్దఱముఁ గారణమగుట చేత); పశ్చాత్తాపము = అనుతాపము (వగపు); ఏ + పాటనున్ = ఏవిధమునను (త్రికసంధి); త్రోపు + పడగు + అయ్యెడున్ = పోనేరదయ్యెను.

తా. అధిక లోభగుణము గలవాఁడై సుయోధనుండు నాకు రాజ్యములో భాగము నిచ్చి నాతోఁ గలిసియుండుటకు సమ్మతింపఁడు. నేనైనను రాజ్యమును వదలుకొని తొలఁగియుండక పోతిని. ఇంతచేటు మా యుభయులవలన సంభవించినది. నా కిఁక దుఃఖం బెవ్విధంబునను బోనేరదు.

వ్యా. వి. త్రోపు + పడగు = త్రోపువడగు.

సూ. ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళంబుగా నగును.

5. అనవుడున్=అని చెప్పఁగా (అని ధర్మరాజు భీష్మునితోఁ జెప్పఁగా; భీష్ముఁడు; ఆతనితోన్ = ధర్మరాజుతో; ఇట్టులు + అనున్ = ఈ విధముగా ననును; అకటా = (ఆశ్చర్యార్థకము, అవ్యయము); వధంపఁగాన్=చంపుటకు, మనుజుఁడు = మానవుఁడు; కర్తగాఁడు = బాధ్యుఁడుగాఁడు; ఇతిహాసమున్= పూర్వవృత్తమును; ఒకండు + చెప్పెదన్ = ఒకదానిని చెప్పెదను; వినుమా= ఆలకింపుమా; మనుజవరేణ్య = మనుజులలో శ్రేష్ఠుఁడైనవాఁడా (ధర్మరాజా); గౌతమి + అనంగన్ = గౌతమి యనెడి; శమ + అన్విత=శాంతస్వభావముతోఁ గూడుకొనిన; ఒక్క + భూసుర + అంగన = ఒక బ్రాహ్మణ స్త్రీ; సుతుఁడు = తన పుత్రుఁడు; ఉరగంబుచేన్ = సర్పంబుచేత; కాలవశత్వము + పొంద + ఉండఁగన్ = మరణించియుండఁగా.

తా. అని ధర్మరాజు చెప్పఁగా విని భీష్ముఁ డిట్లనియెను. ధర్మనందనా! లోకములో నొకనిని చంపుటకు మానవుఁడు బాధ్యుఁడుగాఁడు. అందుల కితిహాస మొకటి గలదు. చెప్పెద నాకర్ణింపుము. పూర్వము శమాన్వితయగు నొక భూసురాంగన యుండెను. ఆమె పుత్రుండు సర్పదష్టుండై మరణించియుండఁగా (తరువాతి పద్యములో నన్వయము)

6. వగచుచుఁ + చూడఁగ = దుఃఖించుచుఁ జూచుచుండఁగా; ఆ + ఉరగవల్లభుఁ = ఆ సర్పరాజమును; (త్రికసంధి) రజ్జునఁ = త్రాటితో; కట్టి తెచ్చి = బంధించి తెచ్చి; ఆ + మగువకుఁ = ఆ స్త్రీకి; చూపి = చూపించి; దీనిఁ = ఈ సర్పమును; కోలఁ = కఱ్ఱతో; తల = శిరస్సు; మ్రందఁగఁ = చిదిగిపోవునట్లు; మోఁదెదఁ = కొట్టెదను; ఒండె రెండుగఁ = ఒకదానిని రెండు తునియలగునట్లుగా; నెఱ + కత్తిఁ + వ్రేసెదఁ = పెద్ద కత్తితో నఱుకుదును; (నెఱ - దే. విశ - వృత్తియందు నెఱవు శబ్దమునకు నీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము.) కడుఁ + చెడుగు = మిక్కిలి చెడ్డది; ఈ + పొడ + పాఁప + పుర్వు = ఈ మచ్చలుగల పామును; ఏమిగతిఁ = ఏవిధముగా; వధింతుఁ + అంచుఁ = చంపవలయుననుచు; ఒక + మేటి + కిరాతుఁడు = ఒక మేటిబోయవాఁడు; రోషదీప్తుఁడై = రోషముతోఁ బ్రకాశించువాఁడై.

తా. కుమారుని యకాల మరణంబునకు దుఃఖించుచుండఁగా నొక మేటి కిరాతుఁడు సర్పంబును ద్రాట బంధించి తెచ్చి గౌతమి యెదుటఁ బెట్టి యీ పామును గఱ్ఱతోఁ గొట్టెదను. లేక కత్తితో రెండుతునియలుగాఁ జేసెదను. ఏవిధముగాఁ జేయమందువని పలుకుచున్న కిరాతుని (తరువాతి పద్యముతో నన్వయము.

వ్యా. వి. 1. పాము + పుర్వు = పాఁపపుర్వు.

సూ. కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాగుల మువర్ణంబులు పవ్వవర్ణంబులగు.

వ్యా. వి. 2. వధిఁచుదును = వధింతును.

సూ. చువర్ణంబుతోడి దుగ్ధకారంబునకుఁ దకారంబగు.

7. ఉన్నఁ + కని = ఉండఁగాఁ జూచి (కిరాతుఁడు రోషదీప్తుఁడై యుండఁగాఁ జూచి); ఆ + పడఁతి = అప్పడఁతి = ఆ స్త్రీ (త్రికసంధి); ఓ + అన్న = (కిరాతునికి సంబోధనము); భుజగనాథుఁ = సర్పరాజమును; పిన్న + ఆతని = పిన్నాతని = పసిబిడ్డయొక్క (అత్త్వసంధి); అనవుడుఁ = అని చెప్పఁగా; ఉసురు = ప్రాణము.

తా. అట్లు రోషావేశముతో నున్న బోయవానిని జూచి గౌతమి సర్పంబును విడిచిపెట్టుమని చెప్పెను. అందులకుఁ గిరాతుం డీసర్పంబు బాలుని ప్రాణంబులం గొన్నది కావున దీనిని విడిచిపుచ్చక చంపెదనని చెప్పెను.

వ్యా. వి. పిన్న + ఆతని = పిన్నాతని (అత్త్వసంధి).

**సూ. అత్తునకు సంధి బహుళముగా నగును.**

8. ఆ + కోమలి = అకోమలి = ఆ స్త్రీ (త్రికసంధి); ఆ + కిరాతునిన్ = అక్కిరాతునిన్ = ఆ బోయవానిని (త్రికసంధి).

తా. గౌతమి కిరాతుని జూచి క్రింది విధముగాఁ జెప్పుచున్నది.

9. విధివశమునన్ = దైవవశమున; వచ్చిన = కలిగిన; ఏర్పడిన; కీడు= అశుభమును (దోషము, అపకారము, పాపము); అధములు = హీనులు (అవివేకులు); కొని + ఆడి = కొనియాడి = ఆదరించి; వ్రేఁగులై = భారముచేఁ గ్రుంగిపోయినవారై (భరపడినవారై); విపులభవ + అంబుధి = అంతులేని సంసార సాగరంబున; మునుఁగుదురు = మునిఁగిపోవుదురు (అడఁగుదురు); సద్ధర్మలగు + ను + ఉత్తములు = ధర్మప్రవర్తకులగు సజ్జనులు; ప్రశాంతిన్ + చులుకనై = శాంతివిమూరులై; మునుంగరు = సంసారసాగరంబున నడఁగిపోరు.

తా. అర్జునకా! దైవవశంబున నేర్పడిన కీడున కవివేకులు శాంతిని గోలుపోయి దుఃఖించుచు సంసార సాగరంబున మునుఁగుచుందురు. సజ్జనులు శమాన్వితులై సంసార సాగరంబున మునుఁగరు.

వ్యా. వి. సద్ధర్మలగు + ను + ఉత్తములు = సద్ధర్మలగు నుత్తములు.

సూ. ఉదంత తద్ధర్మార్థ విశేషణంబున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు.

10. అదియును + ఇన్ + కాక = అదియునుంగాక, అదియునుఁ గాక.

సూ. కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. ('అదియును' అనుదాని తుది ను వర్ణము ద్రుతము. దానికిఁ బరముగా ద్రుతమే కలిసి ద్రుతకార్యములచేఁ బూర్ణబిందువుగా మారి 'అదియునుంగాక' యను రూప మేర్పడెను.)

11. అర్జునక = కిరాతుఁడా! నావుడున్ = అనిచెప్పఁగా; ఈ + పేద మాటలు + ఎల్లన్ = ఈ నీరసపుఁ బలుకులన్నియు; కోపవివశుఁడు + ఐన + నాకు = కోపముచే నొడలు తెలియని నాకు; కొలుపవు = షనికిరావు; ముగ్ధ = (అంగనాయని సంబోధనము).

తా. నీ వీ సర్పంబును జంపినయెడల నా కుమారుండు జీవించునాశ జీవింపఁడు గనుక నీ వీ వ్యాళంబును విడిచిపుచ్చుమని చెప్పఁగాఁ గిరాతుండు నీ నీరసపుఁ బలుకులు కోపవివశుండనైన నాకు నచ్చవని గౌతమితోఁ జెప్పెను.

12. కావునన్ = కాఁబట్టి; ఎట్లున్ = ఏవిధముగా నైనప్పటికిని; చంపుదున్ + కాని = చంపుదునేకాని; భుజంగమున్ = సర్పంబును; పోవన్ + ఈను=

పోనియ్యను (విడిచిపెట్టను); చూ = చూడుము; (అవ్యయము); నావుడున్ = అనిచెప్పఁగా; ఇంతి = ఆయంగన (గౌతమి); అర్జునకనామము = అర్జునకుఁడను పేరు (అర్జున శబ్దమునకుఁ దెల్లనిది యని యర్థమున్నది); నీకు = కిరాతుఁడవైన నీకు (అర్జునకుఁడవైన నీకు); అవదాతభంగికిన్ = నైర్మల్యమునకు (తెల్లనిది యనెడు విధమునకు); కావలదే = సార్థకముగా వలయునుగదా; (నైర్మల్యము కీర్తికి చిహ్నము గావున అట్టి కీర్తి నీయందు సార్థకము గావలయునుగదా యని భావము). మహీసురులు = బ్రాహ్మణులు; కాదనుచొప్పునన్ = కూడదని చెప్పిన విధమున; తత్సహాయులున్ = ఆ బ్రాహ్మణులకు సహాయముఁ జేయువారును (బ్రాహ్మణుల ననుసరించువారును); పోవరు+కాదె = అతిక్రమింపరు గదా (వ్యతిరేకముగా నడచుకొనరుగదా); ఏల = ఎందులకు; నినుబోఁటికి = నీయంటివానికి; క్రూరత = కఠినత్వము (క్రౌర్యము); నాదుసన్నిధిన్ = నా దగ్గఱ.

(అర్జునకా! నీ నామమునందు నైర్మల్యము గోచరించుచున్నది. నైర్మల్యము కీర్తికి చిహ్నము. అట్టి కీర్తి యిప్పట్టున నీయందు సార్థకము గావలసి యున్నది. సత్త్వగుణ ప్రధానులు బ్రాహ్మణులు. సత్త్వగుణము నైర్మల్యమునకు చిహ్నము. మేము సత్త్వగుణప్రధానులమైన బ్రాహ్మణులము. మమ్మనుసరించెడివారు (తత్సహాయులు) సత్త్వగుణ ప్రధానులై యుండవలయును. కావున నీవు నాకు సాయముఁజేయుచున్నావు. కావున నేను జెప్పిన విషయములను మనంబున నిడికొని నన్ననుసరించి నీకుఁగల యర్జునకనామమును సార్థకపఱచుకొని చరితార్థుఁడవు గమ్మని గౌతమి యభిప్రాయమును గిరాతునకు సూచించెను.

తా. కావున నే నెవ్విధంబుననైనను నీ సర్పంబును జంపుదునేగాని విడిచిపుచ్చనని చెప్పిన కిరాతునితో గౌతమి "అర్జునకా! నీనామమును సార్థకపఱచుకొనుము. నీనామ సాదృశ్యంబు సత్త్వగుణంబునకును గీర్తికిని నిలయంబు. కావున నీవు సత్త్వగుణ సంపన్నుఁడవై మెలఁగుము. బ్రాహ్మణులు కూడదని చెప్పినదానిని తత్సహాయులు గూడ నతిక్రమింపరు. కావున నీవంటి వానికింతటి క్రౌర్యము దగదు."

వ్యా. వి. నాదు సన్నిధిన్ = నా + సన్నిధిన్ = నాదు సన్నిధిన్.

సూ. యుష్మదస్మ దాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాషనగు.

13. హింసకున్ = హింసచేయుటకు (చంపుటకు); ఒడఁబడన్ = అంగీకరింపను (ఇష్టపడను); అనవుడున్ = అనిచెప్పఁగా; జనబాధకములైన = మానవులకు బాధలను గూర్చునవియైన; రిపున్ = శత్రువును; పొరిఁగొనంగవలదు = చంపవ

వలదు; అహిన్=సర్పమును; తెగన్+చూచి=చంపి; కాచుట+ఉఅదె=రక్షించుట యుచితముగద. దేవవిభుఁడు=దేవతలకు ప్రభువైన యింద్రుఁడు; వృత్రున్=వృత్రాసురుని; చంపఁడే=చంపలేదా; ఫాలనయనుఁడు=ముక్కంటి (ఈశ్వరుఁడు); యజ్ఞధ్వంసనము+చేయఁడే=దక్షాధ్వరమును నాశనము చేయలేదా; ఇయ్యకొనుము=ఒప్పుకొనుము (అంగీకరింపుము); తతిమెన్=తొందరపెట్టెను; దయావతి = దయతోఁగూడుకొన్నదియైన; ఆ+నాతి = అన్నాతి = ఆ స్త్రీ (గౌతమి-త్రికసంధి); పాపమునకున్ + చొరదు + అయ్యెన్=హింసించుట కిచ్చగింపని దయ్యెను;

తా. నేనీ సర్పంబును హింసించుట కంగీకరింపననెడి గౌతమి పలుకులకుఁ గిరాతుండు "తల్లీ! జన బాధకంబులైన జంతువులను జంపుటవలన హింసా దోషంబులు గలుగవు. దేవేంద్రుఁడు వృత్రాసురుని సంహరింపలేదా. రుద్రుండు దక్షాధ్వరంబును ధ్వంసంబు గావింపలేదా. ధర్మాధర్మము లిట్లుండును. సర్పంబును జంపి జనంబులను రక్షించుటయుక్తము. కావున నీవిందులకియ్యకొను"మని గౌతమిని తొందఱవెట్టెను. కాని దయావతియైన గౌతమి యందుల కియ్యకొనదయ్యెను. ఆ సందర్భమున సర్పంబు కిరాతకునితో నిట్లనియెను.

## 1. వృత్రుఁజంపఁడె దేవవిభుండు (పూర్వగాథ)

అదితి వంశోద్భవుండైన త్వష్ట్ర పుత్రుని విశ్వరూపుఁడను వాని నింద్రుఁడు సంహరించెను. హతపుత్రుండైన త్వష్ట యింద్రునిపై నలిగి వానిని సంహరింపఁ జాలిన పరాక్రమవంతుని బడయఁగోరి, యింద్రునిపై మారణక్రతుహోమము గావించెను. ఆ యగ్నినుండి యుగాంత కాలంబునం గృతాంతునివోలె ఘోరదర్శనుండై వృత్రాసురుండు జన్మించెను. పరమభాగవతోత్తముండైన చిత్రకేతుండను సార్వభౌముఁడు పార్వతి శాపంబునంజేసి యసురత్వంబును బొంది వృత్రాసురుండై త్వష్ట గావించిన హోమంబున దక్షిణాగ్నినుండి జన్మించి యొకవంక నసురత్వంబును మఱియొకవంక హరిభక్తియు నగ్గలమగుచుండ దినదినప్రవర్ధమానుండై శత్రుభయంకరుఁడుగా వర్ధిల్లుచుండెను. భయంకరాకారుఁడై దుర్నిరీక్షుఁడైయున్న యతనింజూచి యెల్లవారును భయకంపితులైరి. వృత్రుఁడు రజస్తమస్స్వభావుఁడై పాపాత్ముఁడై సర్వలోకములనావరించి యలజడి పెట్టఁదొడంగెను. అట్లు విజృంభించుచున్న వృత్రాసురునిపై నింద్రుండు యుద్ధమునకుఁ దలపడి దివ్యాస్త్ర శస్త్రములఁ బరఁగించిన నాతండు వాని నన్నిటి నొక్కుమ్మడి మ్రింగివైచెను. అందులకుఁ గొందలంబునంది యింద్రాదిదేవతలు విష్ణు సన్నిధికిఁ జని యనేకవిధంబుల స్తుతించిరి. విష్ణువు ప్రత్యక్షమై సర్వము నెఱింగి వృత్రుని జంపు నుపాయంబును జెప్పి యంతర్హితుండయ్యెను. ఇంద్రాదులు వృత్రునిజంపు

నుపాయంబును దెలిసికొని దధీచియను ఋషివర్యుని చెంతకుంజని యాతనికి సర్వము నెఱింగించిరి. దధీచియు లోకకల్యాణార్థమై తన యంగములతో వజ్రాయుధంబును నిర్మించుకొనుటకియ్యకొని దేహమును చాలించుకొనియెను. దేవేంద్రుండమ్ముని యంగంబుల వజ్రాయుధము నిర్మించుకొని తేజోవిలసితుండై సురగణంబులు పరివేష్టించిరాంగ రుద్రునికైవడి రోషంబు భీషణంబుగా నసుర పరివృతుండైన వృత్రాసురుని దాఁకి ఘోర రణంబొనరించి సంహరించెను.

## 2. యజ్ఞ ధ్వంసనము సేయఁడే ఫాలనయనుఁ డట్లు? (పూర్వగాథ)

దక్షుండు బ్రహ్మ దక్షిణాంగుష్ఠమునఁ బుట్టి, బ్రహ్మ వామాంగుష్ఠమునఁబుట్టిన ధరణిని వివాహమాడెను. ఈ దంపతులకు జన్మించిన యేఁబదిమంది కూఁతులలో సతియను నామె పెద్దది. ఆమెను శివునకిచ్చి వివాహము చేసెను. బ్రహ్మ చేయుచుండిన యజ్ఞముఁ జూచుటకు దక్షుండుగూడా వెళ్లెను. యజ్ఞశాలలోఁ బితామహభర్గులు దక్కఁ దత్సదస్యులాదరంబున లేచి గౌరవించిరి. అందులకు దక్షుఁడు కుపితుండై శివుని యనేక విధంబులఁ దూలనాడి వెడలి పోయెను.

నాఁటఁగోలె నీశ్వరునకును దక్ష ప్రజాపతికిని విరోధము సంభవించియుండెను. కొంతకాలంబునకు దక్షుండు రుద్రవిహీనంబగు యాగంబు నొకదానిని జేయుటకుఁ బ్రయత్నించి భర్గుని దక్క నందఱిని యాహ్వానించెను. సతీదేవి జనకుని సవన మహిమను గగనచరులు నుతింపఁగావిని యాగంబును జూడవలయు ననెడి కుతూహలంబుతోఁ బిలువని పేరంటమైనను భర్త వలదనిచెప్పినను వినక దక్షుండు గావించెడి యజ్ఞశాలకుఁ బోయెను. అచట దక్షుండామె ననాదరించుటయేగాక యామె భర్తను దూషించి పరివారలలో నవమానమును గూర్చెను. అట్లు సతీదేవి జనకునిచే ననాదరంబునుబొంది యాహ్వానక్రియాశూన్యత్వ రూపంబైన తిరస్కారంబును నరుద్రభాగంబైన యజ్ఞంబును గనుంగొని రోషావేశంబుతో యజ్ఞ సభామధ్యంబునఁ బ్రతికూలుండగు దక్షప్రజాపతి నుద్దేశించి బహు విధంబులఁ దూలనాడి కోపోద్రేకంబుతో శరీరంబును మఱచి యోగమార్గంబునం జేసి ప్రాణాపాన వాయునిరోధంబు గావించి శివాంఘ్రిరాజీవ చింతనముచే నిజ యోగ సమాధి జనితంబైన వహ్నిచేఁ దత్క్షణంబ దగ్ధంబై పంచత్వంబును బొందెను. నారదుని వలన సర్వమును నెఱింగిన భర్గుండు కోపవివశుండై శిరంబున నుండి యొక జటను బెఱికి దూరముగాఁ బాఱవైచెను. ఆ జటనుండి ప్రళయకాల రుద్రుండై వీరభద్రుండు జన్మించి యఖిలలోకభయంకరుండై సర్వంబును నెఱింగి శివునాజ్ఞచే బ్రమదగణ పరివేష్టితుండై దక్షప్రజాపతి యజ్ఞశాలఁ బ్రవేశించి యధ్వరంబును జిందరవందఱచి ధ్వంసంబుఁ జేసెను.

14. ఏను + ఏమి + తప్పు + చేసితిన్ = నేనేమి తప్పిదము నొనరించితిని; నెఱి=న్యాయము; లెస్సగా=యోగ్యముగా; మృత్యు పర + అధీనతన్=మృత్యు దేవతకు లోఁబడి యుండుటచేత; రోషకామాదులు=కామక్రోధాదులైన యరిష డ్వర్గంబులు (కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులు); ఎదన్=హృద యమునందు.

తా. నేనేమి తప్పిదము నొనరించితిని. నేను మృత్యుదేవతకు లోఁబడి యుండుటచేత బాలుని గఱచితిని. కాని, నా చిత్తంబునఁ గామ క్రోధాదులు లేవని సర్పంబు కిరాతకునితోఁ జెప్పెను,

వ్యా. వి. తప్పు + చేసితిని=తప్పుసేసితిని.

**సూ.** ప్రథమావిభక్తిమీఁది క చ ట త ప లకు గ స డ ద వ లు బహు ళంబుగా నగు.

16. మృత్యువునకున్ = మృత్యుదేవతకు; తగు=తగిన; సాధనమువు + అగుటన్ + చేసి=ఉపకరణంబవగుటఁజేసి; దండింపఁగాన్=శిక్షింపఁగా; చనున్ = తగును; అనవుడున్=అనిచెప్పఁగా; కుమ్మరి=కుమ్మరివానియొక్క; కోలను= కఱ్ఱను; సారెన్ = కుండలు చేయు చక్రమును; పోలితిన్ = పోలియుంటిని; ఎదన్ = హృదయమునందు; తలఁచి చూడుము = యోచించి చూడుము.

(కుమ్మరివానికిఁ దన వృత్తియందుఁ గఱ్ఱయుఁ జక్రంబును ముఖ్యమైన సాధనంబులు. కుండలను జేయుటకుఁ జక్రంబును, పగిలిన కుండలను బగులఁ గొట్టుటకుఁ గఱ్ఱయు సాధనంబులనెడి విషయమును, జననమరణంబులతోఁ బోల్చి చెప్పుచుందురు. కుమ్మరికిఁ జెడిన కుండలను బగులఁగొట్టుటకుఁ గఱ్ఱ సాధన మైనట్లు మృత్యుదేవతకుఁ బ్రాణుల జీవంబుల నపహరించుటలో నేను సాధన మైతినని భావము. మఱికొందఱు కుమ్మరివానికిఁ జక్రంబును ద్రిప్పుటకుఁ గఱ్ఱ సాధనమైనట్లు నేను మృత్యుదేవతకు సాధనమైతిననియుఁ జెప్పుదురు.)

తా. సర్పమా! నీవు మృత్యుదేవతకుఁ దగిన పరికరంబ వగుటఁజేసి, నిన్ను దండించుట యుచితంబని పలికిన కిరాతకునితో సర్పం బిట్లనియె. కుమ్మరి వానికిఁ గఱ్ఱ సాధనమైనట్లు నేను మృత్యుదేవతకుఁ దగిన సాధనమైతిని.

అలంకారము :— ఉపమాలంకారము. (లుప్తోపమ)

ఉపమానోపమేయములకు సాగిన సామ్యమును స్పష్టముగా నిరూ పించుట యుపమాలంకారము.

సర్పము:—ఉపమేయము.

**కుమ్మరివాని చేతికఱ్ఱ**:—ఉపమానము.

సాధనముగాఁ బరిగణింపఁబడుట :—ఉభయ సాధారణ ధర్మము.

పోలిక్రి :—ఉపమావాచకము.

17. ఈ క్రియ = ఈ కార్యము (చంపుట యనెడి పని); నా వశంబు + అగునే = నాకు సాధ్యమౌనా; అర్జునకుండు = బోయవాఁడు.

18. ఏయువాఁడు + ఉండఁగ = ప్రయోగించెడి వాఁడుండఁగా; అమ్ము= బాణము; ఏమి + చేయున్ + అనక = ఎట్టి యపకారమును జేయదని; ఓపి = ఓర్చుకొని; తత్ఖండనము + చేత = ఆ యమ్మును నఱకుట యనెడి కృత్యమును; పాపము + అండ్రె = పాపమందురు; ఎవ్వరేన్ + పంపన్ = ఎవ్వరుగోసంపఁగా; కఱతుగాక + ఏమి = కఱచెదవుగాకేమి; కృతాంతున్ = కఠినాత్ముఁడవైన; నిన్ను; గీటడఁగించినన్ = చంపిన యెడల; నిందరాదు = దోషము గలుగదు.

తా. బాణమును ప్రయోగించెడి వాఁడుండఁగా, బాణమెట్టియపకారమును జేయలేదని యోర్చుకొని దానిని తునియలుగాఁ జేయుటను పాపమందురు గా కి (ఒకడు బాణమును ప్రయోగింపఁగాఁ బ్రత్యక్షముగా నపకారము జేయునది బాణము గావున దానిని తునియలుగాఁ జేయుట పాపకార్యముగాదని భావము.) ఇచట నీవు బాలుని గఱచి ప్రత్యక్షముగా నపకారము జేసితివి. కావున నిన్ను జంపుట యుచితంబు. ఇచట ప్రయోగించెడి వాఁడును బాణమును రెండును నున్నవి. ప్రత్యక్షముగా నపకారము చేయునది బాణముగాని ప్రయోగించెడి వాఁడుగాఁడు. కావున నో సర్పమా, నీవు మృత్యుదేవత పనుపున నీ బాలునికిఁ బ్రత్యక్షముగా నపకారముఁ జేసితివి కావున నిన్నుఁ జంపుట యుక్తంబని కరా తుండు చెప్పెను.

19. విశేషించి = అతిశయించి; అరయన్ = విచారింపఁగా; మీరు; మృత్యువునకు = మృత్యుదేవతకు; బుద్ధి + కలుగు + సాధనములు + కాగ=అంతః కరణవృత్తుల ననుసరించి ప్రవర్తించుకొనెడి యుపకరణములు గాగ (బుద్ధికి సను గుణముగా, బ్రవర్తించుకొనియెడి వారని భావము.) మెలఁగన్ + మిమ్ముకస్ + ఈక = కదలనీయక బ్రదుకనీయక; పొరిగొనవలయున్ = చంపవలయును.

తా. మీదుమిక్కిలి మీరు మృత్యుదేవత బుద్ధికి ననుగుణముగాఁ బ్రవర్తించుకొనియెడు నుపకరణములుగాఁ బరిగణింపఁబడుచున్నారు. కావున నెవ్విధంబుగానైనను మిమ్ముఁ జంపుట యుచితంబు.

వ్యా. వి. మిమ్మున్ + ఎల్ల భంగిన్ = మిమ్మెల్ల భంగిన్.

సూ. ప్రథమేతర విభక్తి శత్రర్థక చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును.

20. అనినన్ + విని = అని చెప్పఁగా విని; భుజంగంబు = సర్పంబు.

21. బుద్ధి + కలుగు + సాధనములు + అ + పో = మృత్యుదేవత బుద్ధికి ననుగుణముగాఁ బ్రవర్తించుకొనుచుండెడి యుపకరణంబుల మేయనియనుకొందము; హవిస్సు = అగ్నిహోత్రమునం దివురఁ బెట్టిన యన్నము, నెయ్యి; (హవి, హవిష్యము రూపాంతరములు); ఋత్విజులు = యజ్ఞకర్తచేత ధనమును బుచ్చుకొని యజ్ఞము చేయించువారు (వీరు పదియాఱుగురు బ్రహ్మ, ఉద్గాత, హోత, అధ్వర్యుఁడు, బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రావరుణుఁడు, ప్రతిప్రస్థాత, పోత, ప్రతిహర్త, అచ్ఛావాకుఁడు, నేష్ట, అగ్నీధ్రుఁడు, సుబ్రహ్మణ్యుఁడు, గ్రావస్తుతుఁడు, ఉన్నేత); వేల్తురు = హోమాగ్నియందు నేయి మొదలగువానిని సమర్పింతురు; ఆ ఫలంబు = ఆ యజ్ఞఫలమును; కాంచున్ + అధ్వరకర్తయకాక = యజ్ఞకర్త పొందును గాక; (ఆ యజ్ఞఫలము యజ్ఞకర్తను చెందునుగాని) వారికిన్ + ఏమి + సని = ఋత్విజుల కేమి సంబంధము? (ఆ ఫలము ఋత్విజులను జెందదని భావము) ("కారయితుః కర్తృత్వమ్" కర్తృత్వము యొక్క ఫలము చేయించువారిదేగాని యుపాగకఁ జేయు వారిది కాదనెడి న్యాయము ననుసరించి ఫలము యజ్ఞకర్తను జెందునని భావము.)

తా. అనిపిని సర్పంబు "కిరాతుఁడా! మేము నీవు చెప్పినట్లు మృత్యుదేవతకు బుద్ధికిఁ దగిన సాధనములమే యగుదుము. కాని యజ్ఞశాలయం దగ్నిహోత్రములో ఋత్విజులు హవిష్యములను వేల్చి హోమము చేయుదురుగద. ఆ యజ్ఞఫలము యజ్ఞకర్తను జెందుచున్నదా? ఋత్విజులను జెందుచున్నదా? యోచింపు"మని చెప్పెను. ఆ సందర్భమున మృత్యుదేవత ప్రత్యక్షమయ్యెను.

వ్యా. వి. వేల్చుదురు = వేల్తురు.

సూ. చువర్గంబుతోడి దుగ్ధకారంబునకుఁ దకారంబగు.

22. పనిచిన + అట్టులన్ = పనిచినట్టులన్=పంపించినట్లుగా; కాలుండు = యముఁడు; హేతువులు + కాము = కారణభూతులము గాము; అనఘా = పాపరహితుఁడా.

తా. మృత్యుదేవత సర్పంబుతో నిట్లనియె. "ఓ సర్పమా! ఈ బాలుని జంపుటకై నిన్ను నేను బంపినట్లు కాలుండు నన్నుఁ బంపెను. కావున నీ బాలుని మరణమునకు నీవును నేనును గారణభూతులము గాము.

23. ఇన–శశి–పావక–భూమి–గగన–జల–పవన + ఆది + వస్తుగతులు + ఎల్లన్ = సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని, భూమి, ఆకాశము, నీరు, వాయువు మొదలుగాఁ గల పరికరము లన్నియును; కాలుని = యమునియొక్క; అఖి

చేతివి + అనిన న్ = అటచేతిలో నున్నవనఁగా; తక్కినపని = మిగిలిన విషయమును; భుజగ + ఇంద్రా = భుజగేంద్రా = సర్పరాజమా (గుణసంధి).

తా. సూర్యచంద్రులు, భూమ్యాకాశములు, అగ్ని, వాయువు, జలము మొదలుగాఁ గల పరికరములన్నియుఁ గాలుని యధీనమైయుండ నిఁకఁ దక్కిన విషయములను జెప్ప నవసరము లేదుగద.

24. ఇట్లు + అగుట + ఏర్పడన్ = ఈ విధముగా నిర్ణయమై యుండఁగా; (సర్వము కాలుని యధీనమై యుండఁగా ననిభావము); కిల్బిషమున్ = దోషమును; నాపైన్ + ఇడుదువు = నామీఁద మోపెదవు; కాలుని చెయిది = యముని యొక్క కృత్యము; దూఱినన్ = నిందించినన్.

తా. అట్లు సర్వము గాలుని యధీనమై యుండగా దోషమును నాపై నేట్లు మోపెదవు. యముని కృత్యమునకు నన్ను నిందించుచున్నప్పుడు నిన్ను నిందించు టొక లెక్కగాదు.

వ్యా. వి. నా + నిర్మాణమునన్ = నాదు నిర్మాణమునన్.

సూ. యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునప్పుడు దుగాగమంబు విభాషనగు.

25. అనినన్ = అని చెప్పఁగా; ఇట్టులు + అనున్ = ఈ క్రింది విధముగా నను; భుజగము = సర్పము; గుణము + చెప్పన్ = గుణమున్నదని చెప్పను; దోషగణన + చేయన్ = దోషములు లెక్కించుటలేదు; (నీ యందు గుణదోషములున్నవని చెప్పుటలేదని భావము); నన్నున్ + పనిచెన్ + అంటిన్ = యముఁడు నన్నుఁ బంపెనని చెప్పితిని; నామీఁది దోషంబున్ = నాపై మోపఁబడిన నిందను; పాపికొనుట = పోఁగొట్టుకొనుట; నాకున్; పాడి + కాదె = ధర్మముగదా.

తా. అని చెప్పఁగా సర్పం బిట్లనియె. "మృత్యుదేవతా! నీ వలన గుణదోషములున్నవని చెప్పుటలేదు. యముఁడు నన్నిచటికిఁ బంపించెనని చెప్పితిని. నాపై మోపఁబడిన నిందను నేను బాపికొనుటకై ప్రయత్నించుట ధర్మముగదా!"

26. కాలుని + దెసన్ + ఐనను = యముని పక్షమున నైనను; దోషము కలిమిలేమి = దోషాదోషంబులను (కలిమి=కలిగినది; లేమి=లేనిది); నాకున్ + ఆడంగాన్ = నాకు నిర్ణయించుటకు (చెప్పుటకు); పని + ఏమి = అవసరము లేదు; దోషగతి చింతన భాషణములకు = దోషవిచారణముతోఁ గూడిన మాటలకు; నేను + తగుదునా = నాకు యోగ్యత కలదా?

తా. మఱియుఁ గాలునియందైనను దోషాదోషంబులను నిర్ణయించ వలసిన యవసరము నాకు లేదు. మీదుమిక్కిలి నాకు దోషవిచారణఁ జేయఁదగిన యోగ్యతయు లేదు.

28. మృత్యువు మాటలు = మృత్యుదేవత మాటలు; వింటే = వింటివా; కంటే = చూచితివా; నా మీదన్ + తప్పు + కలిగించెదవు = నాపైన దోషంబును మోపెదవు; ఇట్లు + అంటన్ + కట్టన్ + తగునే = ఇట్లు దోషంబును మోపుట న్యాయమా; అంటకున్ = అనుటకు; నగి = నవ్వి; బోయ + ఇటులు + అనియెన్ = బోయవాఁడీ క్రింది విధముగా ననెను.

తా. సర్పంబు కిరాతుని మొగంబును జూచి యిట్లనియె. "కిరాతుఁడా! మృత్యుదేవత మాటలను వింటివిగదా! చూడుము నాపైన దోషంబును మోపఁ జూచెదవు. ఇట్లు నామీఁద దోషంబు మోపుట ధర్మంబుగా" దని చెప్పిన మాటలకుఁ గిరాతుండు నవ్వి సర్పంబుతో నిట్లనియెను.

29. పాపసమావేశితమతులకు = పాపముతోఁ గూడికొనిన మనస్సులు గల వారలు; ఒఱగన్ + ఆడిన + అంతన్ = వంగి మాట్లాడినంత మాత్రముచేత (నమ్రతతో మాట్లాడినంత మాత్రముచేత); మీపై దోషములు = మీమీఁద మోపఁబడిన దోషములు; ఏన్ + వెఱతునే = నేను భయపడుదునా (మీ మాటలను విని వెనుదీయనని భావము.)

తా. నీవును మృత్యుదేవతయును మిక్కిలి పాపాత్ములు. మీరు మీ గుణంబులను సమర్థించుకొని, నమ్రతతో మాట్లాడినంత మాత్రముచేత మీమీఁద మోపఁబడిన నింద బోనేరదు. మీ మాటలు విని వెనుదీయువాఁడను గాను.

వ్యా. వి. పాపసమావేశితమతులరు.

సూ. ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున— వును—లును బహుత్వంబున—రును—లు నంతాగమంబులు ప్రాయికంబుగనగు. (పాపసమావేశితమతులు + రు)

సూ. ఈ యాగంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు (పాప సమావేశితమతుల + రు.)

వ్యా. వి. వెఱచుదునె = వెఱతునె.

సూ. చువర్గంబుతోడ దుగ్గకారంబునకుఁ దకారంబగు (చుదు = త)

31. ఘనుఁడగు = గొప్పవాఁడగు; కాలునివశమునన్ = యమునకులోనై; చనియెడు మాకున్ = ప్రవర్తించుకొనెడి మాకు; (కాలునికి లోఁబడియున్న

మాకు); దోషసంగతి = దోషచింతనము; ధర్మ సంశయము + ఉడుపక = ధర్మ సంశయమును బోఁగొట్టుటకు.

తా. సర్పంబు మృత్యుదేవతయుఁ గిరాతునితో నిట్లనిరి. "కిరాతుఁడా! కాలునకు లోఁబడి యాతనియాజ్ఞం బ్రవర్తించెడి మాకెట్టి దోషంబులును గలుగ నేర"వని చెప్పెడి సందర్భమునఁ గాలుండు వారికిఁ గలిగిన ధర్మసంశయంబును బాపుటకై వచ్చెను.

32. అర్జునకుఁ = బోయవానిని (కిరాతుని); ఆలోకించి = చూచి.

33. పామును = సర్పంబును; మృత్యువు = మృత్యుదేవతయు; నేనును = కాలుండనైన నేనును; ఈ + దారకుని = ఈ బాలునియొక్క; మృతికిఁ = మరణంబునకు; కారణము + కాము = హేతువులము గాము; ఈతండు = ఈ బాలుఁడు; తాఁ = తాను; ఏమి + ఏఁ + కర్మముఁ + చేసెఁ = ఎట్టి కర్మమును జేసికొనెనో; అది + అ = ఆ కర్మమే; తలకొని = పూని; ఇతనిఁ = ఈ బాలుని; మృతి + పొందించెఁ = మరణమును గలుగఁజేసెను.

తా. కాలుండు కిరాతకునితో నిట్లనియె. ఈ పామును, మృత్యువును, నేనును బాలుని మరణంబునకుఁ గారణభూతులము గాము. పూర్వజన్మంబున నీ బాలుం డేయే కర్మంబులఁ జేసికొనియెనో యాయా కర్మంబు లీతవి మృతికి హేతుభూతము లైనవి.

34. జననముఁ = పుట్టుకను; మరణముఁ = మృత్యువును; కర్మంబు + ఒనరించును = కర్మము గలుగఁ జేయుచుండును (కర్మమునుబట్టి జనన మరణంబులు గలుగుచుండునని భావము); అది + అ = అదియ = ఆ కర్మమే; సౌఖ్యముఁ = సుఖమును; దుఃఖంబును = దుఃఖమును; కావించును = కలుగఁజేయును; (కర్మనుబట్టి సుఖదుఃఖంబులు గూడ కలుగుచుండునని భావము); తన + చేసిన + దానిఁ = తాను జేసికొనిన దానిని (తనకు సంప్రాప్తంబైన కర్మంబును); పడక పోవఁ = అనుభవింపక యుండుటకు; శివునకుఁ = ఈశ్వరునకు; వశమే = సాధ్యమగునా? (తాను జేసికొనిన కర్మంబునుండి తప్పించుకొనుటకు శివునకైనను సాధ్యంబు గాదని భావము. అలంకార మర్థాంతర న్యాసము.)

తా. కర్మఫలము జనన మరణంబులను సుఖ దుఃఖంబులను గలిగించుచుండును. తన కర్మంబునుండి తాను తప్పించుకొనుట . కీశ్వరునకైనను సాధ్యంబుగాదు.

అలంకారము:—అర్థాంతర న్యాసాలంకారము.

లక్షణము :—సామాన్యము, విశేషము, శబ్దములచే నిరూపింపఁబడి యున్నచో నర్థాంతర న్యాసమగును. అందొకటి ప్రస్తుతము వేఱొకటి యప్ర

స్తుతము నగుచుండును. విశేషము ప్రస్తుతమై సామాన్య మప్రస్తుతమైనచో సామాన్యమున విశేషసమర్థన రూపభేద మగును. సామాన్యము ప్రస్తుతమై విశేషము ప్రస్తుతేతరమైనచో విశేషమున సామాన్య సమర్థన రూపభేదమగును. ఒకదానిలోఁ గూడ నర్థాంతరముయొక్క వ్యసనము (ఉంచుట) ఇందుండుట నీ యలంకార మర్థాంతరన్యాస మగుచున్నది.

అర్థ్యము:— ఈ పద్యమునందు విశేషభావము "కర్మఫలము జనన మరణంబులను సుఖ దుఃఖంబులను కలుగఁజేయుచుండును."

సామాన్య భావము: "తన కర్మంబునుండి తాను దప్పించుకొనుట కీశ్వరునకైనను సాధ్యంబుగాదు."

ఇట్లు విశేషభావము సామాన్యభావముచే సమర్థింపఁబడుచున్నది. కావున నిందలి యలంకారము మర్థాంతరన్యాస మగుచున్నది,

వ్యా. వి. తన+చేసినదానికి (తాను చేసినదానిని)

సూ. ధాతుజ విశేషణ భావార్థక పూర్వ వ్యవహితా వ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱుచుగ యొక్క షష్ఠియగు.

సూ. యొక్కకు లోపంబు బహుళంబు.

36. కావునన్ = కాఁబట్టి; ఇందఱున్ = ఇచట నుండువారందఱును; ఈ వాదంబును = ఈ వాగ్వివాదమును; ఉడుగుండు = మానుఁడు; ధరణీదేవ+అంగన = భూసురాంగన (బ్రాహ్మణ స్త్రీ) (సవర్ణ దీర్ఘ సంధి); తన+ఎఱుక యున్ = తాను తెలియక చేసినవిధమును; దేవ + ఆలాపములు = యముని మాటలును (సవర్ణ దీర్ఘ సంధి); ఒక్క+తెఱవు+ఐ+ఉన్నన్=ఒకే విధముగా నుండఁగా.

తా. కాఁబట్టి మీ రందరును వాగ్వివాదంబును మానుండని కాలుండు చెప్పఁగా భూసురాంగన తాను మున్నెఱుకపరిచిన తీరును యముని మాటల తీరును నొకే విధముగా నుండుటను జూచి.

37. వనటన్ = దుఃఖమును; పొందు+ను+అట్టి పాపమున్ = అనుభవించునట్టి పాపమును; చేసి = చేసికొని; వనితలు=స్త్రీలు; ఇట్లు+అగుదురు= ఈ విధముగా నగుచుందురు (ఇట్లు దుఃఖించుచుందురు); ఈ+విధంబు = ఇట్టి విధమైన (ఇవ్విధంబు — త్రికసంధి); మరణము = చావు; ఒందఁ+తగు = కిల్బిషంబునన్ = సంభవించునట్టి పాపముచేత; బాలురు; ఇట్లు+అ+పోదురు= ఈ విధముగా గతించుచుందురు; ఏల=ఎందులకు; కలఁగన్=కలఁతపడవలయును,

తా. స్త్రీ లిట్టి పుత్రదుఃఖంబు ననుభవించు కర్మంబులను జేసికొన్నందున దుఃఖంబుల పాలగుచుందురు. అట్టి కర్మఫల ప్రభావంబుచేతనే బాలురుపుట్టి బాల్యంబుననే గిట్టుచుందురు. కావునఁ గలఁతఁ జెందుటవలనఁ బ్రయోజనంబు శూన్యంబు.

వ్యా. వి. పొందునట్టి = పొందు+ను+అట్టి.

సూ. ఉదంత తద్ధర్మార్థ విశేషణంబున కచ్చుపరంబగునపుడు నుగాగమంబగు.

వ్యా. వి. బాలురు = బాలు+లు.

సూ. అదంతంబై దీర్ఘపూర్వ లోపఘంబైన మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు. (బాల+రు).

సూ. పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకు త్వంబగు (బాలు+రు = బాలురు).

38. వెండియుఁ = మఱియును.

39. సకల జనంబులు=సర్వమానవులు; కర్మమునకుఁ; అనుగుణము+ఐన = తగిన; తెరవునఁ = మార్గమున; విధమున; రోషవిషాదములు = కోపమును దుఃఖమును (ద్వంద్వసమాసము); శమముఁ=శాంతమును; (కామక్రోధాదులడఁగియుండెడి విధానమును); సంఘటింపుము = అలవరచుకొనుము).

తా. సర్వమానవులు దమతమ కర్మములకుఁ దగిన ఫలముల ననుభవించుచుందురు. కావున నీయందుఁగల రోషవిషాదములను బరిహరించి, శాంతంబు నలవరచుకొని, సర్పంబును విడిచిపెట్టుమని భూసురాంగన కిరాతునితోఁ జెప్పెను.

వ్యా. వి. రోషవిషాదములు = రోషమును విషాదమును.

సూ. ఉభయ పదార్థ ప్రధానంబు ద్వంద్వంబునాఁబడు.

40 తెలిసి+విడిచెఁ = సర్పంబును గాఱింగి విడిచిపెట్టెను (కిరాతునకు జ్ఞానోదయంబగుటచే సర్పంబును విడిచిపెట్టెను); అర్జునకుఁడు = బోయవాఁడు; భుజగముఁ = సర్పమును; అపాస్తరోషుండు+అగుచుఁ = నివర్తింపఁబడిన రోషముగలవాఁడై (నశించిన రోషము గలవాఁడై, శాంతచిత్తుఁడై); ఎలమిఁ+పొంది = సంతోషంబును బొంది; ఈవు=నీవు (ధర్మరాజు); అడలుఁ = కలఁతను; విడువుము = వదలిపెట్టుము.

తా. గౌతమి చెప్పిన ధర్మమును బురస్కరించుకొని కిరాతుండు శాంత చిత్తుండై సర్పమును విడిచిపెట్టెను. కాబట్టి "ఓ ధర్మరాజా! నీవును నీ మనంబునఁ గల కలఁతను బోఁగొట్టుకొనుము."

41. బాంధవుల = చుట్టములయొక్క; రణమరణ సంప్రాప్తికిన్ = యుద్ధరంగంబున సంప్రాప్తించిన మరణంబులకు; తమతమ కర్మములే = తాము జేసికొనిన కర్మంబులు; కారణములు + కాఁగన్ = హేతువులుగాఁగా; ఇట్లు + అయిరి = ఈ విధముగా మరణంబులను బొందిరి.

తా. నీవును దుర్యోధనుండును బాంధవుల మరణ కారణంబునకు హేతువులు గారు. వారు దమ తమ కర్మంబులను బురస్కరించుకొని మృతులైరి. కావున నీవు దుఃఖింపవలసిన యవసరము లేదని చెప్పెను.

42. గౌతమీ లుబ్ధక మృత్యుకాల సంవాదంబు + అగు = గౌతమి యొక్కయు, కిరాతకునియొక్కయు, మృత్యుదేవతయొక్కయు, యముని యొక్కయు సంవాదమైన; ఈ + ఇతిహాసంబు = ఇయ్యితిహాసంబు = ఈ పూర్వ వృత్తముయొక్క; తాత్పర్యంబున్ = భావమును (అభిప్రాయమును); మనంబునన్ = మనస్సునందు; పట్టుకొల్పి = నిలుపుకొని (ఉంచుకొని); ఆ + పుట్టిన + కలంకన్ = ఆ విధముగా నేర్పడిన కలఁతను; తొలంగన్ + జడిసి = పోఁగొట్టుకొని; శమంబునన్ = శాంతముతో; సుఖివి + కమ్ము + అనినన్ సుఖముగా నుండుమనినన్; కౌంతేయ + అగ్రజుండు = ధర్మరాజు (సవర్ణదీర్ఘసంధి); సంతసిల్లి = సంతోషించి; శాంతనవునితోన్ = శంతనపుత్రుండైన భీష్మునితో; ఇట్లు + అనియెన్ = ఈ క్రింది విధముగా ననియెను.

తా. నేను జెప్పిన గౌతమీలుబ్ధక సర్పమృత్యుకాల సంవాదంబును నితిహాసంబును మనస్సుననుంచుకొని నీకుఁగల సందేహంబుల నివారించుకొని శాంత చిత్తుండవై సుఖంబులం బడయుమని చెప్పిన భీష్మునితో ధర్మతనయుండు సంతోషాంతరంగుండై యిట్లనియెను.

—:o:—

# గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాదము



## ధర్మరహస్యము—నీతి

పంచమవేదము నాఁబరఁగిన మహాభారతము వ్యాసమునీశుని తక్కిన యష్టాదశ పురాణములవలెఁగాక విశిష్టమైన యితిహాసమై యతని రచనయందే యించుక కావ్యత్వమును దక్కించుకొన్నది. దీనికిఁ గవిత్రయమువారు మెఱుఁగు వెట్టిరి. వేదము శబ్దప్రధానమై ప్రభుసమ్మితమైనది. పురాణమర్థ ప్రధానమై సుహృత్సమ్మితమైనది. కావ్యము భావప్రధానమై కాంతాసమ్మితమైనది. ప్రభువలె శాసింపక, మిత్రునివలె నూరక సలహా నిచ్చియూరకుండక కాంతవలె సుకుమారముగా మనస్సును గరఁగించి మానవుడు దనకుఁ దానే కర్తవ్యమునకుఁ గడంగునట్లు ప్రేరేపించునది కావునఁ గావ్యఫక్కి యుత్తమమని పెద్దలు వాకొందురు. కావున భారత మితిహాసమైనను రచనలోఁ గావ్యత్వమును బొంది కాంతవలె మానవునకుఁ దగిన రీతిని ధర్మముల నుపదేశించినది.

భారతము వైదికమతమును స్థాపించుట కేర్పడిన గ్రంథమందురు. కాని యది కేవలము మత విషయములకే గాక యార్యవిజ్ఞాన సర్వస్వమునకుఁ బేటికయని చెప్పవచ్చును. మఱియు నిందు పారమార్థిక విషయములకన్న సాంఘిక విషయములే యెక్కువగా నుండును. వేదాంతాది విషయములు కేవల మానుషంగికములు.

కురుక్షేత్ర మహాసంగ్రామానంతరము కురువృద్ధుఁడగు భీష్ముఁడు శరతల్పగతుఁడై యుత్తరాయణ పుణ్యకాలము కొఱకెదురు జూచుచుండెను. యుద్ధములో విజయలక్ష్మిని చేఁబట్టిన ధర్మనందనుఁడు కౌరవ సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుండై బంధువధ

జనితంబైన వ్యాకులంబుతో రాజకార్య విముఖుండై యుండెను. ఇట్లుండ శ్రీకృష్ణుం డజాతశత్రుని చిత్తవృత్తిం గమనించి శరతల్ప గతుండైన భీష్ముని నియోగించి యనేకవిధంబులగు ధర్మోపదేశము లను జేయించెను. భీష్ముఁ డొక్కొక్క ధర్మము నుపదేశించు సందర్భమున నొక్కొక్క యుపాఖ్యానంబును జెప్పుచు ధర్మరాజు నకుఁగల సంశయంబులను నివారించుచుండెను. అట్టి ధర్మోప దేశము లెక్కువగా నానుశాసనిక పర్వములో నున్నవి. అనేక విధంబులగు ధర్మంబుల ననుశాసించునది కావున నీ పర్వమున కానుశాసనిక పర్వమను పేరు సార్థకముగా నున్నది.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబన్న ప్రశంస కేవల మానుశా సనిక పర్వమునకే విశేషముగా నన్వయించుచున్నది.

## ధర్మసూక్ష్మము

ధర్మరాజు భీష్మునితో "మహాత్మా! నీవు నాయందుఁ గల దయచే నా చిత్తంబునకు శాంతిని జేకూర్చుటకై యనేక విధంబు లైన ధర్మంబుల నుపదేశించితివి. కాని నా మనస్సునకుఁ గొంచె మైనను శాంతి గలుగుట లేదు. కఠినాత్ముండనై యనేక బంధు వులను వధించుటయేగాక, నిన్ను యుద్ధరంగంబునఁ బడవైచితిని. ఈ యుభయ కర్మంబులు నన్ను త్తలపెట్టుచున్నవి. మఱియు మా కులంబున కింతటిచేటు సంభవించుటకు దుర్యోధనుండును నేనును గారణ భూతులమై యుంటిమి. నా కీఁక దుఃఖం బెవ్విధంబునను బోనేర" దని యనేక విధంబుల వాపోవుచుండ భీష్ముండు గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాదంబను నుపాఖ్యానంబును జెప్పి ధర్మరాజును శాంతచిత్తునిగాఁ జేసెను.

ఒకరిని చంపుటకు మానవుఁడు కర్తగాఁడనియు, కర్మఫలము ననుసరించి జననమరణంబులు సుఖదుఃఖంబులు గలుగుచుండు

ననియు, విధికృతం బెవ్వరికిని దాఁటుటకు సాధ్యంబుగాదనియు, ఎవరు జేసికొనిన కర్మఫలమును వారే యనుభవింపవలయుననియు, కర్మఫలంబును దాటుటకు శివునకైనను సాధ్యంబు గాదనియు, మొదలుగాఁగల ధర్మంబులకు నిలయంబైన గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాదంబను నితిహాసంబు మూలంబున వివిధంబు లగు ధర్మంబుల నుపదేశించి, బాంధవుల రణమరణప్రాప్తికి ధర్మ రాజును దుర్యోధనాదులును గారణభూతులు గారని నిరూపించి ధర్మనందనుని శాంతోన్ముఖునిగా నొనరించెను.

మఱియు మరణించిన పుత్రుని విషయంబున గౌతమీ లుబ్ధకులు ప్రదర్శించిన వైఖరులనుబట్టి యనేక విధంబులైన ధర్మంబులు గోచరించుచున్నవి. గౌతమి కిరాతకునికి సర్పంబును విడువుమని ప్రబోధించిన విధానంబు మిక్కిలి విశిష్టమైనది. అట్టి ధర్మంబులు సర్వమానవులు నలవరచుకొనఁ దగినవి. గౌతమిని యాదర్శ ముగాఁగొని శాంతచిత్తుండవై మెలఁగుమని ధర్మరాజునకు ధర్మ రహస్యము నెఱింగించెను.

మఱియును సర్పంబును మృత్యుదేవతయుఁ దమకుఁ గాలుని వశంబున నిర్ణయంబైన కార్యములను నిర్వహించిన విధానంబును, గురుతర బాధ్యతయు నవశ్యాచరణీయంబులును శ్లాఘనీయంబులును నగును. వారి పరస్పర వాగ్వివాదంబుల పట్టుల వెల్లడియైన సర్వ విషయంబులును ధర్మయుక్తంబులుగా నున్నవి.

## గౌతమి స్వభావము

గౌతమి యొక భూసురాంగన. ఈమె శమాన్వితమతి. సాత్వికమూర్తి. ఈ యుపాఖ్యానమున గౌతమియందు సహజ మగు పరోపకారచింతనము, ధర్మపరత్వము, లోకజ్ఞాన సంపత్తి, వాక్చాతుర్యమునగు గుణములు నిహిత మొనర్పఁబడి యున్నవి.

ఈమె పుత్రుండు సర్పదష్టుండై యుండగా నొక కిరాతుండా సర్పంబును రజ్జునఁ గట్టితెచ్చి దీనిని చంపెదనని చెప్పఁగా గౌతమి వలదని వారించినది. ఈ సర్పంబు నీ బిడ్డను జంపిన పాతకి, కావున విడువఁదగినది కాదని కిరాతుండు చెప్పినను వినలేదు. మీఁదు మిక్కిలి సర్పంబును విడిచిపెట్టుమని నిర్బంధించినది. ఇత్యాది విషయములనుబట్టి గౌతమి శాంతచిత్త మెంతటి యుత్కృష్టమైనదో వెల్లడిగాక మానదు. గౌతమి కిరాతకునితో "అవివేకులు శాంతమును గోలుపోయి సంసారసాగరంబున మునుఁగుదురనియు సజ్జనులు శాంతచిత్తులై మునుఁగ"రనియుఁ జెప్పిన వాక్యములు కడు సమంజసములుగా నున్నవి. "నీ వీ సర్పంబును జంపినయెడల నా కుమారుండు జీవించునా? జీవింపఁడు. కనుక నీ వీ వ్యాళంబును విడువు"మన్న వాక్యంబులు మిక్కిలి ధర్మబద్ధము లైనవి. "అర్జునక నామమును నీయందు సార్థక పఱచుకొనుము. మహీసురులు కూడదని చెప్పిన మార్గమును దత్సహాయులు గూడా నతిక్రమింపరు." ఇత్యాది వాక్యము లామెకుఁ గల లౌకిక విజ్ఞానమునకు మచ్చుతునకలు. యముని మాటల నాలకించి కిరాతకునితో నన్న యీ క్రింది వాక్యములు శ్లాఘ్యంబులైనవి.

"నా యట్టి స్త్రీ లిట్టి పుత్ర దుఃఖంబును గలిగించు కర్మంబులను బూర్వజన్మంబునఁ జేసికొన్నందున నట్టి దుఃఖములు సంప్రాప్తించినవి. అట్టి కర్మములను జేసికొన్నట్టివారలిట్లు పుట్టి బాల్యంబుననే గిట్టుచుందురు. సకల జనంబులు దమతమ కర్మంబులకుఁ దుల్యంబైన ఫలంబుల ననుభవించి తీరవలయును. కావున నీయందుఁ గల రోష విషాదాదుల మాని శాంతంబు నలవరచుకొను" మన్న వాక్యంబులు ధర్మయుక్తంబులు నిర్వ్యళీకంబులునునై గౌతమికిఁగల లౌకిక విజ్ఞానసంపత్తిని ధర్మపరాయణత్వమును వెల్లడిచేయుచున్నవి. ఈమె వాక్యములు పరమ మూర్ఖుండైన కిరాతకుని సైతము

శాంతోన్ముఖునిగాఁ జేసినవి. మిక్కిలి శ్లాఘ్యంబులు ధర్మయుక్తంబులు నీతియుతంబులును నైన గౌతమి వాక్యంబులతో నిండిన యీ లోకవృత్తము నాలకించి యజాత శత్రుండు సైతము శాంతోన్ముఖుండయ్యెను. గౌతమి యాయా సమయంబులలోఁ దనకుఁ గల ధర్మబుద్ధిని శాంత స్వభావమును నీతిని వెల్లడించి బ్రాహ్మణులు సాత్త్వికగుణ ప్రధానులని రుజువుపఱచినది. ఈ కథాభాగము కేవలము ధర్మవిశేషములకే గాక విశిష్టమైన నీతికిని నవనీత ప్రాయమైనది.

తిక్కన పంచమవేదం బనఁబరఁగిన మహాభారతములో నీ యుపాఖ్యానభాగమునఁ బైనుడివిన ధర్మరహస్యమును నీతిని గౌతమి పాత్ర నాదర్శముగాఁ గొని వెల్లడించినాఁడు.

ఈ క్రింది వాక్యములకు సందర్భ సహిత వ్యాఖ్య వ్రాయుడు :—

(1) అకటా వధింపఁగా మనుజుఁడు గర్తగాఁడు. (5)

(2) విధివశమున వచ్చిన కీడధములు గొనియాడి విపుల భవాంబుధి మునుఁగుదురు. (9)

(3) ఈ పేద మాటలెల్లను గోప వివశుడైఁన నాకుఁ గొఱపవు ముగ్ధా! (11)

(4) అర్జునక నామము నీకవదాత భంగికిం గావలదే. (12)

(5) మహీసురులు గాదను చొప్పునఁ దత్సహాయులుం బోవరు గాదె. (12)

(6) పుత్త్రుఁ జంపఁడె దేవవిభుండు. (13)

(7) యజ్ఞ ధ్వంసనము సేయఁడే ఫాలనయనుఁ డట్లు. (13)

(8) కుమ్మరి కోలను సారెం బోలితిఁ. (16)

(9) ఏయువాఁడుండ నమ్మేమి సేయుననక యోపితత్ఖండనము సేత పాపమండ్రే. (18)

(10) తన చేసినదానిం బడకపోవ శివునకు వశమే. (34)

(11) సకల జనంబులుం గర్మమునకు ననుగుణమైన తెరవునం బోదురు. (39)

(12) వారు దమతమ కర్మముల్ గారణములుగాంగ నిట్లయిరి. (41)

ఈ క్రింది పద్యముల కర్థతాత్పర్యములను వ్రాయునది :—

(1) "అనవుడు భీష్ముం డిట్టులను నాతనితో నకటా వధింపంగా" (5)

(2) "వగచుచుంజూడ నయ్యురగవల్ల భు రజ్జునంగట్టి తెచ్చియ" (6)

(3) "కావున నెట్లుం జంపుదున కాని భుజంగముంబోవనీనజూ" 12

## —: ప్రశ్నలు :—

1. ఆనుశాసనిక పర్వమునందలి మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని భీష్ముండు ధర్మరాజునకుం దెలిపిన ధర్మ రహస్యమును దెలుపునది ?

2. ఉపాఖ్యానమనంగా నేమి ? గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాదంబను నుపాఖ్యానము వలనం దెలియం దగు నీతిని సంగ్రహించునది ?

3. "ధర్మతత్వజ్ఞులు ధర్మశాస్త్రం"బన్న ప్రశంస విశేషముగా నానుశాసనిక పర్వమునకే యన్వయించుచున్నది. మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని నిరూపించునది ?

4. ఆనుశాసనిక పర్వ మార్య విజ్ఞానమునకుం బేటిక. మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని వివరించునది ?

5. వరుగువంటి నీరస కథను గూడ సరసముగాం దీర్చి కావ్య కళ శోభతో నింపు నైపుణ్యము తిక్కనకుం గలదు విమ ర్శించునది ?

6. మీ పాఠ్యభాగము ననుసరించి తిక్కన కవితా రీతులను సోదాహరణముగ నభివర్ణించునది ?

7. గౌతమీ లుబ్ధక సర్పమృత్యుకాల సంవాదమునఁ దెలియ నగు ధర్మసూక్ష్మమును బరిశీలించునది ?

8. గౌతమీ లుబ్ధక సర్ప మృత్యుకాల సంవాదమను కథను సంభాషణ రూపములో వ్రాయునది ?

9. మీ పాఠ్యభాగమునఁ గిరాతునితో వాదించిన సర్ప మృత్యువుల సంభాషణమునందలి యౌచిత్యమును ధర్మ సూక్ష్మమును బరిశీలించునది ?

10. తిక్కన హరిహరారాధనా తత్పరుఁడనియెడు విషయ మును మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని నిరూ పించుఁడు ?

11. మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని గౌతమీ లుబ్ధ కులు ప్రదర్శించిన వైఖరులనుబట్టి వారి స్వభావముల నభి వర్ణించునది ?

## వ్యాకరణ విశేషములు

1. భూసురాంగన = భూసుర + అంగన; (సవర్ణదీర్ఘసంధి)

సూ. సంస్కృతశబ్దంబులందు సంహిత యున్నప్పుడు అ, ఇ, ఉ, ఋ, కారములకుఁ గ్రమముగా అ, ఇ, ఉ, ఋ, వర్ణములు పరమగునేని దీర్ఘ మేకాదేశముగా వచ్చును. (హ్రస్వాచ్చులకుఁ జెప్పిన కార్యము దీర్ఘాచ్చులకును వచ్చును.)

2. ధర్మోపదేశములు = ధర్మ + ఉపదేశములు – (గుణసంధి)

'అ' కారమునకు ఇ, ఉ, ఋ, వర్ణములు పరమగునేని క్రమ ముగా ఏ, ఓ, అర్, వర్ణము లేకాదేశముగా వచ్చును. (ఏ, ఓ,

అన్, వర్ణములకు గుణమని సంజ్ఞ కావున దీనికి గుణసంధి యని పేరు.)

3. అక్కోమలి = ఆ+కోమలి (త్రికసంధి)

సూ. ఆ, ఈ, ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు. (ఉ. ఆ = త్రికంబు)

సూ. త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగును. (ఉ॥ ఆ+క్కోమలి)

సూ. ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. (ఉ॥ అక్కోమలి)

4. పాఁపపుర్వు = పాము+పుర్వు.

సూ. కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల మువర్ణంబులు పవర్ణంబులగు. (ఇచట పవర్ణము వచ్చినది. పాములోని మువర్ణంబునకు పవర్ణము వచ్చినది కావున జీత్తు బిందు పూర్వంబగునెడి నియమముచే నిచట బిందువు వచ్చినది. దీర్ఘము మీఁదిది గాన నా పవర్ణమర్ధబిందు పూర్వకమై 'పాఁప పుర్వు' అనెడి రూప మేర్పడెను.)

5. పిన్నాతనిన్ = పిన్న+ఆతనిన్. (అత్త్వసంధి)

సూ. అత్తునకు సంధి బహుళముగా నగు. (బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధిలేదు.)

6. అదియునుంగాక = అదియును+న్+కాక;

సూ. కొన్నియెడల ద్రుతంబు మీఁద నకారంబు గానంబడియెడి. ('అదియును' అనుదాని తుది నువర్ణము ద్రుతము. దానికిఁ బరముగా ద్రుతమే కలిగి ద్రుతకార్యములచేఁ బూర్ణబిందువుగామారి 'అదియునుంగాక' యను రూపమేర్పడెను.)

7. తప్పసేసితిన్ = తప్పు + చేసితిన్.

సూ. ప్రథమావిభక్తిమీఁది క చ ట త ప లకు గ స డ ద వ లు బహుళంబుగా నగును.

8. నాదు నిర్మాణమునన్ = నా + నిర్మాణమునన్.

సూ. యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగు నపుడు దుగాగమంబు విభాషనగు. (నా + దు + నిర్మాణమునన్.)

9. వెఱతునె = వెఱచుదునె.

సూ. చువర్ణంబుతోడ దుగ్ధకారంబునకుఁ దకారంబగు. (ఇచట 'చుదు' లకుఁ దకారమువచ్చినది.)

10. తన చేసినదానిన్ = తాను చేసినదానిన్.

సూ. ధాతుజ విశేషణ భావార్థకపూర్వ వ్యవహితా వ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠియగు.

సూ. యొక్కకు లోపంబు బహుళంబు.

11. బాలురు = బాల + లు.

సూ. అదంతంబై దీర్ఘపూర్వ లోపథంబయిన మహత్తు మీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు. (బాల + ర్ + ఉ)

సూ. పుంలింగంబయి మహద్వాచకమయిన నామంబు తుది యత్వంబున కుత్వంబగు (బాలు + ర్ + ఉ = బాలురు.)

12. పొందునట్టి = పొందు + ను + అట్టి.

సూ. ఉదంత తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరంబగునపుడు నుగాగమంబగు. (పొందు + ను + అట్టి = పొందునట్టి)

13. చెప్పుమా = చెప్పుము + ఆ.

సూ. సంప్రార్థనంబున ముజ్జునకదాదులు విభాష ననుప్రయుక్తంబులగు. (అఆ, ఇఈ, ఉఊ, ఎఏ, ఒఓ, అమ్మ, అయ్య, ఇవి అదాదులు.)

14. కోపవివశుఁడైన = కోపవివశుఁడ నైన.

సూ. కొన్ని యెడల విశేషణంబుల ద్వితీయకుఁ బ్రథమగానం బడియెడు; ఒక్కొక్కప్పుడు విశేషణము షష్ఠికిఁ బ్రథమవిభాష నగును.

15. పాపసమావేశితమతులరు.

సూ. ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేక త్వంబున — 'వును' లును బహుత్వంబున 'రుము' లును నంతాగమం బులు ప్రాయికంబుగా నగును. (పాపసమావేశితమతులు+రు.)

సూ. ఈ యాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు. (పాపసమావేశితమతులరు.)

ఈ క్రింది వ్యాకరణ విశేషములను వ్రాయుఁడు :—

1. అక్కోమలి; 2. ధర్మోపదేశములు; 3. దేవా లాపములు; 4. పాఁపపుర్వు; 5. పాపసమావేశితమతులరు; 6. బాలురు; 7. వేల్పురు; 8. తన చేసినదానిన్; 9. కోపవివశుఁడైన.

ఈ క్రింది పద్యములలోని యలంకారములను బేర్కొని లక్ష్యలక్షణ సమన్వ యముఁ జేయునది:—

1. క. వినుకర్మం బొనరించును
జననము మరణము నదియ సౌఖ్యము దుఃఖం
బును గావించుం దనచే
సిన దానిం బడకపోవ శివునకు వశమే. (34)

2. క. విను మృత్యువునకుఁ దగు సా
ధన మవగుటఁ జేసి నిన్ను దండింపంగాఁ
జను ననవుడుఁ గుమ్మరి కో
లను సారెం బోలితిం దలఁచి చూడు మెదన్. (16)

(పై ప్రశ్నలకుఁ దగిన సమాధానముల నాయా పద్యముల యొక్క యర్థతాత్పర్యాదులనుండియు నితర వ్యాసములనుండియు గ్రహింపఁదగును.)

—:o:—

# శ్రీమదాంధ్ర భాగవతము

(బమ్మెర పోతనామాత్యుండు)

## అష్టమ స్కంధము :

## వామన బలిఘట్టము

### కవి విషయాదికము

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అన్నట్లితిహాస పురాణములచే వేదార్థములను విస్తరింపవలయును. ఇతిహాసమనఁగాఁ బూర్వరాజవృత్తము. "సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంతరాణిచ వంశానుచరితంచైవ పురాణం పంచ లక్షణమ్" అను లక్షణ పంచకముతోఁ గూడినది పురాణ మనఁ బడును. మహాపురాణములు పదునెనిమిది. (బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందముఁ వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము) వీనిలో భాగవతపురాణ మొకటి. దీనిని సంస్కృతభాషలో వ్యాసమహర్షి రచించెను. దీని లోని భాగములకు స్కంధములని పేరు. స్కంధ మనఁగా బోదె. భాగవత మొక కల్పవృక్షముతోఁ బోల్పఁబడినది. కావున భాగవ తమునందలి భాగములను స్కంధములందురు. ఈ పురాణములోఁ బండ్రెండు స్కంధములు గలవు.

ప్రస్తుత పాఠ్యభాగమైన వామన బలిఘట్టము భాగవతము లోని యష్టమ స్కంధమునుండి గైకొనఁబడినది. భగవత్తత్త్వార్థ ప్రతిపాదకంబులైన కావ్యరత్నంబులలో నీ భాగవత పురాణమగ్ర శ్రేణికిఁ జెందినది. వ్యాసవిరచితంబైన సంస్కృత భాగవతంబును

సహజపాండిత్య కవితావిశారదుఁడై తెనుఁగుదేశము నంతటిని భక్తిరసపారావారమున నోలలాడించిన బమ్మెర పోతనామాత్యుఁ డాంధ్రీకరించెను. ఇతఁడు పదునేనవ శతాబ్దము పూర్వభాగము లోనివాఁడు. శ్రీనాథునకు సమకాలికుఁడు. క్రీ.శ. 1423 సం॥ మొదలు 1447 సం॥ వఱకు రాజ్యమును బాలించిన వేంకటగిరి సంస్థానమునకుఁ బ్రభువైన సర్వజ్ఞ సింగభూపాలుని యాస్థాన పండితుఁడు. ఇతఁడు భాగవతము ననువదించి యాంధ్రవాఙ్మయ క్షేత్రమున భక్తిబీజములఁజల్లి తాను ధన్యుఁడగుటయేగాక యాంధ్ర లోకము నంతటిని ధన్యము గావించినాఁడు.

పోతనామాత్యుఁడు కౌండిన్య గోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. లక్కమాంబయుఁ, గేసనయు నీతని తల్లిదండ్రులు. అమాత్యశబ్దంబుచే నీతఁడు నియోగిబ్రాహ్మణుఁడని యూహింప నగును. ఇతని నివాస స్థానమేక శిలానగరము. నివాసస్థలమును గూర్చి యభిప్రాయభేదము లున్నవి. ఏకశిలానగర మనునది కడపమండలములోని యొంటిమిట్టకు నామమని కొందఱును, బ్రతాప రుద్రుని రాజ్యమున ముఖ్యపట్టణమగు నోరుగంటికి నామాంతరమని కొందఱును జెప్పుదురు. కాని యోరుగల్లు నగరమే పోతన పేర్కొనిన యేకశిలానగరమని చరిత్ర పరిశోధకులచే నిర్ణయింపఁ బడినది.

పోతనామాత్యుఁ డందఱివలె గురువులదగ్గర పఠింపక స్వత స్సిద్ధముగఁ బాండిత్యము నార్జించినట్లు "సహజపాండిత్య పోత నామాత్య" యను గద్యమునుబట్టి యూహింపఁదగియున్నది. ఇతఁడు తన గ్రామపరిసరములలో గోవులను మేపుచుండఁగాఁ జిదానందుఁ డను యోగీశ్వరుఁ డతనికిఁ బ్రత్యక్షమై రామమంత్రము నుపదేశించినట్లును, దన్మూలమున సహజపాండిత్య మబ్బినట్లును

గొంద అభిప్రాయపడిరి. భాగవతమున నాతఁడు రచించిన గద్యము నను దిలకించినచోఁ బరమేశ్వరానుగ్రహమునఁ గవనమల్ల నేర్చె ననియుఁ దెలియవచ్చుచున్నది. అట్లు తన సహజపాండిత్యము చేతను భగవదనుగ్రహముచేతను భాగవతమునేగాక వీరభద్ర విజయము భోగినీదండకమునను గ్రంథములనుగూడ వ్రాసెనని తెలియవచ్చుచున్నది.

ఇతఁడు చిన్ననాఁటినుండియు వ్యవసాయవృత్తిచేఁ జీవించుచు భగద్భక్తి గలవాఁడై భాగవతరచనమును సాగించెనని తెలియ నగును. తక్కిన కవులవలె ధనమునకై రాజుల నాశ్రయింపక స్వతంత్రజీవితమును గడపెను. దారిద్ర్యము ననుభవించుచుండినను ధనముచే నాకర్షింపఁబడక తన కృతియగు భాగవతమును సర్వజ్ఞ సింగభూపాలున కంకిత మీయక భగవంతునకే యంకిత మొన రించిన మహానుభావుఁడు. ఆత్మగౌరవముగల కవిసత్తముఁడు. స్వాతంత్ర్యశీలుఁడు.

భాగవతంబును బమ్మెర పోతనామాత్యుఁ డాంధ్రీకరించె నన్న వార్తను సర్వజ్ఞసింగభూపాలుఁడా కర్ణించి, పోతనను దన యాస్థానంబునకు రావించి, తదీయ గ్రంథమును గృతియిమ్మని యడిగెననియు, నందులకుఁ బోతన తన గ్రంథము నరాంకితము సేయనొల్లనని తెలుప రాజు కుపితుండై యాతని గ్రంథమును నేలం బాఁతి పెట్టించెననియు, శ్రీరామచంద్రుండా రాజు భార్యకు స్వప్నంబునం దోఁచి భాగవత మాహాత్మ్యమును దెలిపిపోయెననియు నా సతి స్వప్న వృత్తాంతంబును దన భర్తకు నివేదించి పాఁతిపెట్టిన భాగవతంబును వెలికిఁ దీయింప నందలి తాళపత్రంబులు క్రిమిదష్ట ములై శిథిలమై పోయెననియు, నా శిథిల భాగంబుల వెలిగందల నారయ, ఏర్చూరి సింగన, గంగన యనువారలు పూరించిరనియుఁ దెలియవచ్చుచున్నది.

## పోతన కవితా ప్రాగల్భ్యము

లోకోత్కృష్టమైన పోతన భాగవతము కేవల మాంధ్రీకృతముగాక స్వతంత్ర మహాకావ్యరూపమును దాల్చినది. కమనీయ కవితాకల్పశాఖియైన యష్టమ స్కంధమున వామన బలి ఘట్ట మొక యుజ్జ్వల సన్నివేశము. శబ్దార్థాలంకార విశిష్ట దుర్వార శైలితోఁ గూడిన యీ ఘట్టము గ్రంధమునకుఁ దలమానికమని చెప్పవచ్చును. పోతనకవి కవితాప్రాగల్భ్య మాబాలవేద్యంబు. కవిత్వము మృదుమధుర పదములతోఁ గూడి ద్రాక్షాపాకమును బొంది పండితపామరుల కాస్వాదనీయముగాఁ బరిగణింపఁబడినది. ఇతని కవితాకన్య సహజసౌందర్యసౌకుమార్యసముపేత. విచిత్రాలంకారవిరాజిత. సర్వాంగసుందరి. తెలుఁగుఁ బలుకుల సులవితముగఁ దీర్చి కైతదిద్దుటలో నితఁడు కడు గడుసరి. దుర్ఘట సంస్కృత సమాసంబులు సమకూర్చి కవితాప్రాగల్భ్యమును వెల్లడించుటలో నితఁడు దిట్ట. ఈ సందర్భమున

క. కొందఱకుఁ దెలుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండున్
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్.

అని కవితావిషయమున పోతన జేసిన ప్రతిజ్ఞ కడుంగడు శ్లాఘనీయము. పోతన భక్తి రసోన్మత్తుఁడు. భక్తి రసోజ్జీవకములగు కథా భాగములలో భగవంతునిలోఁ దాదాత్మ్యమును బొందును. వర్ణించిన ప్రతి ఘట్టమునందును భక్తిరసము చిప్పిలుచుండును. ఇతనికి హరిభక్తి యగ్గలము. పాండిత్య లోకానుభవములు మిక్కుటములు. రసానుగుణమైన శైలియు శైలికిఁ దగిన వృత్తిరీతులును వృత్తిరీతులకుఁ దగిన యమకాది శబ్దాలంకారములతోను నీతని కవితాకుమారి యథేచ్ఛముగఁ గవితా రంగస్థలమున నర్తనము

గావించినది. ఇతఁడు వర్ణించిన వర్ణనము లమోఘములైనవి. "ఇంతింతై వటుఁడింతయై" మొదలుగాఁగల పద్యంబులలో నితనికిఁ గల వర్ణనావైశద్యము విశదముగాఁ గలదు. ఈ కవి తల్లజుని తిక్కనతోఁ బోల్చి చూచినఁ దిక్కన కర్థ సారస్యమునందుఁ బుట్టి యెక్కువయనియుఁ బోతనకు రససౌభాగ్యమునందు దృష్టి మిక్కుటమనియు వక్కాణింపవచ్చును.

ఇతని కవిత్వములో నుభయ రేఫమైత్రియు, ద్రుతసంధియుఁ గ్త్వార్థ కేత్తునకు సంధిసేయుటయు, నుకారాంత శబ్దమునకుఁ గువర్ణకంబు పరంబగుచో నగాగమంబు రామియు, మొదలుగాఁ గల కొన్ని వ్యాకరణ దోషము లున్నవని చెప్పెదరు. కాని యీ వ్యాకరణ దోషము లితనివి కావనియు శిథిలభాగములఁ బూరించిన గంగనాది కవులవనియుఁ గూచిమంచి తిమ్మకవియు గుప్తార్థ ప్రకాశికా కారుఁడును నిరూపించియున్నవారు. ఈ దోషంబులు చంద్ర బింబంబునం గళంకంబునుంబోలె భాగవత గ్రంథంబునఁ జూపట్టుచున్నను నట్టి దోషంబుల నెవ్వరును నొక కొఱంతగా భావింపరు.

—(:0:)—

# శ్రీమదాంధ్ర భాగవతము

## (వామన బలిఘట్టము)

### పూర్వ కథ

భాగవత పురాణంబును శౌనకాది మహామునులకు సూతుండు చెప్పెనని, తద్వృత్తంబును భారత వీరుండైన పరీక్షిన్న రేంద్రునకు శుకుండు చెప్పెను.

"మునీంద్రా! హరి దీనుని రీతి నేల బలిని మూడడుగులు యాచించెను. మఱియు నిరపరాధుండైన బలిసార్వభౌమునివలనఁ దన కోర్కెను నెరవేర్చుకొనియు నేల యాతనిని బంధించెను. తద్వృత్తాంతంబు వినఁ గుతూహలంబయ్యె వినుపింపు" మని పరీక్షిన్న రేశ్వరుండు వేడుకొనుటయు శుకుం డిట్లని చెప్పఁదొడంగెను.

తొలుత దేవేంద్రున కోడి, ప్రాణములం బోఁ గొట్టుకొనిన బలిచక్రవర్తి భార్గవులు బ్రదికింపఁ బునర్జీవితుండై యా భృగు వంశ్యుల శిష్యవృత్తిం గొలిచెను. భృగువంశ్యుల ప్రసాదంబునం జేసి విశ్వజిన్నామకంబైన యాగంబును జేసెను. ఆ బ్రాహ్మణుల మంత్రాహుతి ప్రభావంబున హేమాలంకృత రథంబును నర్కు వాజులఁ బోలు హరులను సింహధ్వజంబును ధనువును గవచంబును వైతానాగ్ని ప్రసాదించెను. అట్లతండు బ్రాహ్మణానుగ్రహంబున నా యోధన సాధనంబులను సాధించి వారికిఁ బ్రదక్షిణ ప్రణామం బులాచరించి యాశీర్వాదములఁ బడసి యసురసేనా పరివృతుండై మరల నింద్రపురంబును ముట్టడించెను.

పరమ రభసంబైన బలి యుద్యమంబునకు జడిసి పురంధరుండు బృహస్పతి యొద్దకుంజని తద్వృత్తాంతం బెరిగించెను. అతడు బలి సార్వభౌమునకు భార్గవుల వలన లభ్యమైన బలమును గూర్చి వక్కా

ణించి, హరి దక్కఁ దక్కినవారెవ్వరు నిపుడు బలి నెదుర్కొన లేరని చెప్పెను. మఱియు సురలందఱు బృహస్పతిచే నాజ్ఞాపింపఁ బడి కామరూపులై త్రివిష్టపంబు విడిచి తమతమ పొందు పట్లకుం జనిరి.

నాఁటఁగోలె బలియుస్స్వర్గంబు నధిష్ఠించి ముల్లోకంబులఁ దన యానతిఁ బర్వఁజేసి శతహాయమేధంబుల నొనరించి దాన శౌండిమ ముచే విప్రులం దనుపుచుఁ దారా మధ్యగతుండైన సుధాకరుని భంగి తేజరిల్లుచుండెను.

అట్లు స్వర్గం బన్యాక్రాంతంబగుటకును, దనపుత్రు లదృశ్యు లగుటకును దేవమాతయైన యదితి మిక్కిలి పరితపించి, సమాధి నిష్ఠయందున్న తనభర్త కశ్యపుని స్మరించెను. యోగ ప్రభావం బున సర్వముం దెలిసికొని కశ్యపుండు దన ధర్మపత్నికి సాక్షాత్క రించెను. అట్లు ప్రత్యక్షంబైన కశ్యపునితో నదితి "దేవా! భార్గవబలంబున బలి సార్వభౌముండు నా పుత్రులఁ దఱిమి స్వర్గాధి పత్యము వహించి యున్నవాఁడు. నా కుమారులు యథావిధి స్వర్గాధి పత్యమును వహించునట్లనుగ్రహింపుఁడని వేఁడుకొనెను.

అందులకుఁ గశ్యపుండు భగవంతుని భావికాల కార్యం బూహించి యదితికిఁ బయోభక్షణంబను వ్రతంబు నుపదేశించి, దాని నాచరించినచో నీకోర్కె నెరవేరునని చెప్పెను. అదితియు నా వ్రతంబు నాచరించి హరి ప్రత్యక్షమును బడసెను. అట్లు ప్రత్యక్షంబైన శ్రీహరి యదితి నిష్ఠాగరిష్టతకు సంతసిల్లి నేను నిజాం శంబున నీకుఁ బుత్రుఁడనై పుట్టి యయ్యసురుల నిర్జించి యింద్ర జ్యేష్ఠులైన నీ పుత్రులు యథాపూర్వము లబ్ధవిభవు లౌనట్లు గావిం తునని యంతర్హితుండయ్యెను. ఇట్లు కొంతకాలంబున కదితియు నంతర్వత్నియై యొక పుణ్యదివసంబున శంఖచక్రగదాకమల కలిత

చతుర్భుజుండును నిఖిలజనమనోహరుండును వామనుండును నైన కుమారునిం బడసెను. ఆ బాలుండు దిన దిన ప్రవర్ధమానుం డయ్యెను. సముచితోపనయనకర్మకలాపంబులు ముగిసిన పిమ్మట బాలునికి సావిత్రి యుపదేశమిచ్చెను. బృహస్పతి యజ్ఞోపవీతమును, గశ్యపుండు ముంజియు, నదితి కౌపీనంబును, ధరణి కృష్ణాజనంబును, సోముండు దండంబును, గగనంబు ఛత్రంబును, బ్రహ్మ కమండలువును, సరస్వతి యక్షమాలను, సప్తర్షులు గుశపవిత్రంబులను, యక్షేశుఁడు భిక్షాపాత్రికను నిచ్చిరి.

ఇట్లుండ నొక్కనాఁడు వటుపుత్రుఁడు, భార్గవయాజితాశ్వమేధంబుల బలి బలియుండయ్యెనని విని యొక శుభముహూర్తంబున బలి యజ్ఞశాలకుఁ బేదటికంబు నభినయించుచు భిక్షంబునకై బయలుదేరెను.

——(:o:)——

# శ్రీమదాంధ్ర భాగవతము

## కథాసంగ్రహము

వామనుండు బలి యజ్ఞవాటమునకుం జని రక్షోవల్లభుండైన బలి సార్వభౌముని కుశపవిత్రాక్షతసంయుతంబగు దక్షిణహస్తంబు సాచి స్వస్తియగు గాతమని యాశీర్వదించెను. భార్గవులు ప్రత్యుత్థానంబు సలిపి మిక్కిలి గౌరవించిరి. బలిసార్వభౌముండును మోదమానసుండై మాయాభిక్షుకుండైన వామన వటువునకు సభక్తిక ప్రణామంబాచరించి యుచితాసనంబొసంగి యాసీనుం జేసెను. తన ప్రాణవల్లభ వింధ్యావళి పసిడి చెంబుతో నిర్మలోదకములు వోయ వటుని పాదంబులఁ గడిగి తడియొత్తి తదీయపాదప్రక్షాళన జలంబు పరమపవిత్రంబని శిరంబున ధరించెను.

అట్లు భక్తి తాత్పర్యములతోఁ బూజించి "యో బ్రాహ్మణోత్తమా! నీ వెవ్వరివాఁడవు. నీ నివాసస్థలం బెయ్యది. నీ రాక చే నేను ధన్యాత్ముఁడనైతిని. నా కులగోత్రంబులు పావనంబులయ్యెను. క్రతువు యోగ్యంబయ్యెను. అగ్నులు యథావిధి హుతంబులయ్యెను. భవత్పాదవిన్యాసంబున నీ భూమి పవిత్రంబయ్యెను. నీ కెయ్యది వలయునో వానినెల్ల గోరుకొనుము. నిష్కములో, వస్త్రములో, ఫలములో, వనములో, భూములో, గ్రామంబులో, హర్మ్యంబులో, గోవులో, రత్నంబులో, గజతురగరథంబులో నీ కెయ్యవి యభిమతంబులో వానినెల్లం గోరుకొనుమిచ్చె"దనని పలికిన బలిసార్వభౌముని పలుకులకు మెచ్చి యతనిం గని వామనుం డిట్లనియె.

"సార్వభౌమా! నీ పలుకు లత్యంత ధర్మయుక్తంబులై యున్నవి. సర్వాంతర్యామినైన నాకీ చోటు నివాసంబని యెట్లు వక్కాణింపఁగలను? ఎవ్వనివాఁడనని పలుకఁగలను? నా మార్గ

మిదియని యెట్లు నిర్ణయింపఁగలను? నేను నేర్చిన దిదియని యెట్లు నిర్ధరింపఁగలను? ముల్లోకంబులను నిండియుండెడివాఁడను. సర్వజ్ఞుండను. అందఱికిని నేను గావలసిన వాఁడనె. నా కెవ్వరును గావలసి యుండరు. ఒంటిగా నుందును. చుట్టంబులు లేరు. ఎల్లప్పుడు సుజనులయందు దాఁగియుందును. అది యట్లుండనిమ్ము. నీ పలుకులు సూనృతంబులు, కులోచితంబులు, యశస్కరంబులు, ధర్మయుతంబులునై యొప్పెడిని. మీ వంశంబు కరుణాత్ములకుఁ దత్త్వమూర్తులకు నిలయంబు. రణభీరువులుగాని వితరణ భీరువులు గాని మీ వంశంబునం గలుగరు. ఆశ్రయించినవారు శత్రువులైనను వారిని దానాతిశయముచేఁ దనుపుదురు. మీ తాతలందఱు మేటి మగలు. మింటి చంద్రుని మాడ్కి మీ కులంబునఁ బ్రహ్లాదుండు తేజరిల్లెడు.

మీ మూఁడవతాత హిరణ్యాక్షుం డేకవీరుండై భూతలంబునఁ దన్ను మాఱ్కొను ప్రతిభటుం గానక విక్రమంబున సంచరించి జగద్విఖ్యాతిం బొందెను. వరాహరూపంబున శ్రీ మహావిష్ణు వాతని సంహరించెను. తద్భ్రాతయగు హిరణ్యకశిపుండు భ్రాతృఘాతకుండైన విష్ణువుం దెగఁజూతునని యద్దనుజమర్దను మందిరంబునకుం జనియె. ఉద్రేకుండై శూలాయుధముఁ గేలంబూని వచ్చుచున్న యా హిరణ్యకశిపుంగని కాలజ్ఞుఁడు మాయావియు నగు విష్ణుండాతని జయించుట దుర్లభంబని భావించెను. ఎందేనిం బోవ నాతఁడు మృత్యువువోలె వెంటాడునని నిర్ణయించుకొని, దనుజేంద్రుని బహిర్దృష్టియగు హృదయంబుం జొచ్చుట మేలని నిశ్చయించి వాని నిశ్వాసరంధ్రమునుండి సూక్ష్మశరీరంబుతోఁ దదీయ హృదంతరాళమునఁ బ్రవేశించెను.

ఆ రహస్యంబు నెఱుఁగక హిరణ్యకశిపుండును విష్ణువును దల్లోకంబున వెదకి వెదకి విసిగి వేసారి, యాకసంబును దివంబును

నరసి, దెసలు, పాతాళంబు, సముద్రంబులు మున్నగుచోట్లు శోధించి, పురంబులు, వనంబులు విమర్శించి, హరిఁగానక, నా తమ్ముని జంపిన విష్ణుండు మడసియుండనోపునని భావించి, తెగిన యెడఁ బగ ఱమీఁదఁ బగఁగొనఁదగదని హిరణ్యకశిపుండు వైరంబుప సంహరించుకొనియెను. పురుహూతాదులు కృత్రిమ విప్రవేషం బులతోఁ దన్ను యాచింప మీ తండ్రి విరోచనుం డవ్వంచనంబు నెఱింగియు వారికిఁ దన యాయువు నొసంగెను. నీ వింద్రాది సురలఁ దఱిమి ముజ్జగంబుల నేలిన జగజ్జెట్టివి. అవిరళమైన దాన ధర్మంబుల నాచరించి మీ పెద్దలను మించితివి. యాచకులకు బ్రాహ్మణులకు రాజ్యమును భాజ్యముగఁ జేయఁ డేని వాని జన్మధనగేహంబులు నిరర్థకంబు లగును. జగదీశ్వరుండవు, దాతవు నగు నిన్ను వేఱొక్కటి యేను యాచింపను. నే నొంటివాఁడను. నాకు మూఁడడుగులకుఁ జాలిన భూమి నిమ్ము. అది నాకు చాలు'' నని పలికిన భూసురోత్తమునకు బలిసార్వభౌముం డిట్లనియె.

''విప్రనందనా! నీ మాటలు వృద్ధసమ్మతములు. దాత పెంపు సొంపుఁ దలఁపక కొంచెపు భూమి యాచించెద వేల? నీవు బాలుఁడవు, బాలిశమతివియుఁ గావునఁ గావలసినంత పుచ్చుకొను టకు నేరవైతివి. వసుధాఖండము వాంఛించితివా? జగములం గోరితివా? యువతులం గాంక్షించితివా? వాజులం గోరితివా? లోక ములకెల్ల నేకనాయకుండనైన నన్నుఁ బ్రశంసించి, పరిహాసపాత్రం బగు పదత్రయమాత్రం బడిగెద వేమి?'' యని పలికెడు సార్వ భౌమునకు మందస్మితవదనారవిందుండై వామనుం డిట్లనియె.

''దానవేంద్రా! గొడుగునో, జన్నిదమునో, కమండలువునో దండమునో, ముంజినో యాచించి ప్రతిగ్రహించుటకుఁ బాత్రుండ నైన నే నెక్కడ, భూములుఁ, గరులు, నశ్వంబులు, వామాక్షులు

నెక్కడ. యదృచ్ఛాలబ్ధంబునకుఁ దృప్తిఁజెందువాఁడను. గావున మూఁడడుగుల కొలందియే నాకుఁ జాలును. ప్రాప్తంబైన లేశమే పదివేలని తృప్తిఁజెందని మనుష్యుఁడు సప్తద్వీపసంభృతంబైన భూమండలంబు నిచ్చినను దనివిసెందఁడు. సప్తద్వీపాధిపతులైన పృథునృగాది నృపాలురర్థకామములఁ దృష్ణకుఁ దుదిఁగానరైరి. సంతుష్టుఁడీ మూఁడుజగంబులలోఁ బూజ్యుండు. అసంతుష్టుఁడు ముల్లోకములు దనకు లభించినను దృప్తిసెందఁడు. పురుషున కసంతోషమే సంసారకారణంబు. యదృచ్ఛాప్రాప్తంబునకుఁ దృప్తిఁజెందుటయే ముక్తికారణంబని పెద్దల యాశయము. పరితోషహీనుని తేజంబుదకంబున నగ్నివలెఁ బ్రతిహతంబై నశించును. కావున నాకు మూఁడడుగుల నేల కొల్ల'' యని పలికెను.

అట్లు పలికిన వామనునకు బలిసార్వభౌముండు వామనుం బురస్కరించుకొని నీకోరిన దానం బిచ్చెద గ్రహింపుమని, భూమిదానంబుసేయుట కుపక్రమించి జలభాజనంబు గైకొనియెను. అయ్యవసరంబున శుక్రాచార్యుండు శిష్యుండైన బలిని బురస్కరించుకొని ''విరోచనాత్మజా! ఈ వచ్చినవాఁడు సాధారణమైన బ్రాహ్మణుఁడు గాఁడు. దేవకార్యంబు సాధింప నీరూపంబున నవతరించిన సాక్షాద్విష్ణుదేవుండు. కశ్యపసూనుఁడై యదితి గర్భంబున బుట్టుపు దాల్చినవాఁడు. తెలియక దానమిచ్చెదనని బాస చేసినాఁడవు. ఇయ్యది నీకుఁ దగదు. రాక్షసజాతి కీ దానంబునం జేసి యెంతయేన నర్థంబు వాటిల్లును.

ఇతఁడు నీ లక్ష్మిని తేజంబును స్థానంబును యశస్సును హరించి వాసవున కిచ్చును. మఱియు నీతఁడు విశ్వకాయుండై మూఁడడుగులతో ముల్లోకంబుల నాక్రమించును. ఇట్లు నీ సర్వసంపదల విష్ణువున కిచ్చి యెట్లు వర్తింపఁగలవు. అదియునుంగాక యీతం డొక్క యడుగున సమస్త భూమండలంబును, రెండవ యడుగునఁ

త్రిదివంబు గగనంబు శరీరంబును నాక్రమించును. నీ విచ్చెదనన్న మూఁడవయడుగున కేమిగతి. ఇచ్చెదనని చెప్పి యీకున్నచోఁ దత్కారణంబున నరకంబు సంప్రాప్తంబగును. వృత్తికిఁ జేటు సంభవించు దానమును తత్త్వవేత్త లంగీకరింపరు. విత్తవంతునకే దాన యజ్ఞ తపఃకర్మంబులు విధింపఁబడియెను. తన యింటఁగల సర్వ ధనంబులను నైదుభాగంబులుగా విభజించి, కామమునకు నర్థమునకు ధర్మమునకుఁ గీర్తికి స్వజనంబులకు సమంబుగాఁ బెట్టు పురుషుం డుభయలోకంబులలోను సుఖించును. ఇయ్యర్థంబున నొక ధర్మంబు సెప్పెద వినుము.

అంగీకరించిన దానంబునఁ దన సర్వస్వముఁ గోలుపోవునట్లైన లేదని చెప్పుట యనృతంబుగాదు. ఆత్మవృక్షంబున కనృతంబు మూలంబు. సత్యంబు ఫలపుష్పములు, కావున నసత్యముతోఁ గూడని సత్యంబు ప్రకాశింపదు. సత్యము ప్రకాశింపవలయునన్న నసత్యము మూలమై యుండవలయును. మూలతుల్యంబైన యనృతంబు సమయభేదమునఁ బరిగ్రహింపఁ కుండిన నాత్మవృక్షంబు నిర్మూలంబగును. ఇది ప్రపంచన్యాయము గనుక సత్యవాక్యుఁడవగు నీవ సత్యము నాశ్రయించియైనను నీ సంపదను గాపాడుకొనుము.

మఱియు స్త్రీలయందును వివాహప్రసంగములయందును, గోబ్రాహ్మణ రక్షణంబునను ప్రాణవిత్తమానభంగములందును, ననృతంబు నింద్యంబుగాదు. ఈ వామనుండు విశ్వంభరుండు. త్రివిక్రమస్ఫురణగలవాఁడై నిండు బ్రహ్మాండంబును మాన్పఁగల ధీరుఁడు. కావున నా పలుకు లాకర్ణించి నీ రాజ్యవైభవంబును నిలుపుకొనఁదలచితివేని యీ కృత్రిమ భిక్షుకుని తిరస్కరించి పంపి వేయు''మని బోధింప బలియు ముహూర్తమాత్రం బాలోచించి యాచార్యున కిట్లనియె.

"ఆచార్యోత్తమా! మీ పలుకులు సత్యంబులు. అర్థకామ యశోవృత్తుల కొకప్పుడును బాధను గలిగింపకుండుటయే గృహస్థ ధర్మంబు. ఇచ్చెదనని మాటయిచ్చి యిప్పు డర్థలోభంబున నెట్లు గాదందును? పలికి లేదనుటకంటె పాపము మఱియొకటిలేదు. అనృతవాది నొక్కని దక్క నెట్టిదుష్కర్మునేని భరించెదనని తొల్లి భూదేవి బ్రహ్మతోఁ బలికెను. మఱియు సమరంబున వెన్నిచ్చుట కంటె మరణించుటయుఁ, బొంకక నిజమాడుటయు, మానధనులకు చితంబులైన మార్గంబులు. హాలికునకు సుక్షేత్రము బీజముల భంగి, దాతకీవియుఁ బాత్రంబు యోగ్యంబు. తొల్లి రాజులు రాజ్యాధి పత్యంబుల వహించి గర్వోన్నతిని బొంది పరిపాలనంబును సాగించిరి గద. వారి భోగము లిపుడు కాలగ్రస్తంబులయ్యె. వారు సిరులను మూటగట్టుకొని పోలేదు. ఈ భూమిలో వారి పేరైనను నిలువ లేదుగద? శిబిప్రముఖులైన చక్రవర్తులు యశఃకాములై ప్రాణంబు లను సహితము సమర్పించి ప్రాణులకు మేలుగలిగించిరి. అట్టి సాధు వుల నీ కాలంబుననైనను మఱచినారా?

మఱియు నెడతెగని యజ్ఞముచేతను వ్రతములచేతను జూడ రానట్టి యీ కర్మఠుండు రూపముచేత వామనుండై నన్ను యాచింపఁగా నా బోటివానికి నిష్ఠాంబులనిచ్చుట ధర్మంబుగద. లక్ష్మి ననునయించు కరంబు నా కరంబునకుఁ గ్రిందౌటయే నా భాగ్యంబని తలంచెదను. ఈ రాజ్యము గీజ్యము శరీరము శాశ్వతములుగావు. ఇంతయేల నే నొసఁగ్చెడి దానంబు వలనఁ గులాంతమైనను, దుర్మర ణంబు సంప్రాప్తంబైనను, నరకంబు సంభవించినను, బంధన మేర్ప డినను సత్యంబు నశించినను, హరిహరబ్రహ్మాదు లడ్డంబైనను నా జిహ్వ తిరుగనేరదు. తానడిగినంత దానము నిచ్చుచో నీ విష్ణుఁ డేల నన్ను బంధించును. ఒకవేళ బంధించినచోఁ దానే కరుణించి విడుచును. మేరువు దలక్రిందైనను, సముద్రంబు లింకఁ బాఱినను

ధారుణి రజమైపోయినను, ఆకసంబు బ్రద్దలైనను, నేనాడిలిప్పువాఁడను గాను.

ఈతం డొంటివాఁడఁట. ఇతరులను వేఁడఁబోఁడఁట. దగ్గరబంధువులు లేరఁట. సర్వవిద్యల సారమెఱింగిన వాఁడఁట. ఇట్టి కుఱ్ఱండు చేతులొగ్గి వేఁడుకొనఁగాఁ ద్రోసిపుచ్చుట న్యాయంబుగాదు. కావున నీ బ్రహ్మచారి యాచించిన దాని నిచ్చెద''నని నొక్కి వక్కాణించిన బలిసార్వభౌమునిపైఁ, దాఁ జెప్పిన వాక్యంబుల సఱకుసేయని కతంబున శుక్రుం డలిగి, యచిరకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శపించెను.

ఆచార్యుఁ డట్లు శపించినను సఱకుసేయక, సత్యపదవీ ప్రమాణతత్పరుండైన బలిసార్వభౌముండు వామనునకుఁ బ్రతిజ్ఞాత భూమిదానంబు సేయం బూనుకొనెను. వింధ్యావళిభర్త యభిప్రాయంబును గమనించి సలిలపూర్ణంబైన హేమకలశంబును దెచ్చెను. బలియు సభక్తికంబుగా నా జలంబుల వామను పాదంబులం గడిగి, లోకపావనంబులైన యా జలంబుల శిరంబునం జల్లుకొని, వడుగుం జేసాచి పూజించి, బ్రహ్మప్రీతమ్మని మూఁడు పాదంబుల భూమిని దారవోసెను. అట్టి తఱుణంబును బురస్కరించుకొని శుక్రుండు కలశరంధ్రంబునఁ బ్రవేశించి నీరధార నాటంకపఱచెను. హరియు నీ విషయంబును గమనించి కుశాగ్రంబునఁ బొడువ నాతం డేకనేత్రుఁ డయ్యెను. వామనుండు బలి పవిత్రాంతఃకరణంబుతో దారవోసిన భూదానంబును మోదంబున గ్రహించెను. దశదిక్కులు పంచభూతంబులు బలిసార్వభౌముని యీవిని గొనియాడిరి. కమలనాభుఁ డని యెఱిఁగియు, దేశకాలపాత్రంబుల నెఱింగియు, శుక్రు మాటల నాలకించియుఁ దనకుఁ గీడు మూడునని తెలిసికొనియు బలి నిష్కపటముతో వామనునకుఁ బదత్రయ పరిమితభూమిని దానంబుసేసె. అయ్యది బలిసార్వభౌమునకే చెల్లెను.

—:o:—

# శ్రీమదాంధ్ర భాగవతము

## అష్టమ స్కంధము :

## ప్రతిపదార్థ తాత్పర్యాదులు

1. జగత్త్రయీభువన శాసనకర్తకున్ = ముజ్జగములయందలి భువనములను శాసించువానికిని; హాసమాత్ర = చిఱునగవు మాత్రముచేతనే; విధ్వస్త = ధ్వంసము జేయఁబడిన (వశింపఁజేయఁబడిన); నిలింపభర్తకున్ = దేవేంద్రుఁడు గలవానికిని; ఉదార = ఉత్కృష్టమైన; పద = స్థానముచేత; వ్యవహర్తకున్ = వ్యవహరించువానికిని (న్యాయాధిపతికిని); మునీంద్ర = ఋషిశ్వరులచేత; స్తుత = పొగడఁబడిన; మంగళ = మంగళకరమయిన (పవిత్రమైన); అధ్వర = యజ్ఞములయొక్క; విధాన = చేయుటయందు; విహర్తకున్ = విహరించువానికిని; నిర్జరీ = దేవతాస్త్రీలయొక్క; గళ = కంఠములయందు; న్యస్త = ఉంచఁబడిన; సువర్ణ = బంగారముతోఁ జేయఁబడిన; సూత్ర = మంగళసూత్రములను; పరిహర్తకున్ = హరించినవానికిని; దానవభర్తకున్ = రాక్షసరాజునకును; స్వస్తి = శుభమగునుగాక (స్వస్తియగునుగాక).

తా. ముజ్జగంబులలోఁ గల భువనంబులను శాసించువాఁడును, చిఱునగవు మాత్రముచేతనే ధ్వంసము జేయఁబడిన దేవేంద్రుఁడు గలవాఁడును, విశిష్టమైన స్థానముచేత వ్యవహరింపఁబడినవాఁడును, మునీశ్వరులచేత శ్లాఘింపఁబడిన యజ్ఞములను నిర్వహించినవాఁడును, దేవతాస్త్రీల కంఠములందున్న మంగళసూత్రములను హరించినవాఁడును నైన రాక్షసరాజునకు (బలిచక్రవర్తికి) స్వస్తియగుఁగాక.

వ్యా. వి. ముని + ఇంద్ర = మునీంద్ర (సవర్ణ దీర్ఘసంధి).
మంగళ + అధ్వర = మంగళాధ్వర (సవర్ణ దీర్ఘసంధి).

సూ. సంస్కృత శబ్దంబులందు సంహిత యున్నప్పుడు అ, ఇ, ఉ, ఋ, కారములకుఁ గ్రమముగా అ, ఇ, ఉ, ఋ, వర్ణములు పరమగునేని దీర్ఘ మేకాదేశముగా వచ్చును. (హ్రస్వాచ్చులకుఁ జెప్పిన కార్యములు దీర్ఘాచ్చులకును వచ్చును.)

2. దీవించి = ఆశీర్వదించి; కరచరణ + ఆది + అవయవంబులు = హస్తములు పాదములు మొదలుగాఁ గల యవయవంబులు; ధరించిన = తాల్చిన; వేదరాశియున్ + పోలెన్ = వేదరాశివలె; (మూర్తీభవించిన వేదరాశి మాడ్కి యనిభావము); అకుటిలుండును = ఋజువర్తనుఁడును; జటిలుండును = జడలు

గలవాఁడును; సదండచ్ఛత్రుండును = పూజాదండముతోను గొడుగుతోను నొప్పినవాఁడును; కక్షలంభిత భిక్షాపాత్రుండును = చంకనుండి వ్రేలాడు భిక్షాపాత్రము గలవాఁడును; కరకలితజలకమండలుండును = హస్తమునందుఁ గల జలముతో నిండిన కమండలువు గలవాఁడును; మనోహర వదన చంద్రమండలుండును = మనోహరమైన ముఖమనెడి చంద్రమండలము గలవాఁడును (రూపకాలంకారము); మాయావాదనటుండును = మాయాతత్త్వమును నటించు వాఁడును; వటువుఁన్ + కని = బాలకుని జూచి (బ్రహ్మచారి); దినకరకిరణ పిహితంబులైన=సూర్యకిరణములచేఁ గప్పఁబడిన; గ్రహంబుల=సూర్యచంద్రాది నవగ్రహంబులయొక్క; చందంబునన్ = విధమున; తిరోహితులై = మఱుఁగు పడినవారై; భృగువులు = శుక్రుఁడు మొదలుగాఁ గల భార్గవులు; కూర్చున్న + ఎడల + లేచి = ఆసీనులైయున్న తమ స్థానంబులనుండి లేచి; సేమంబు + అడిగి= క్షేమసమాచారములను విచారించి; తియ్యని మాటలన్ = ఇంపైనమాటలతో; ఆదరించిరి = సమ్మానించిరి (గౌరవించిరి); పాదంబులన్ + తుడిచి = పాదంబులను శుభ్రపఱచి; పసిండి గిండిన్ = బంగారు చెంబుతో; ఉదకంబులు + పోయన్ = జలంబులను బోయఁగా; వడుగు + ను + కొమరుని = వటుపుత్రుని; (పసివాడైన బ్రహ్మచారిని); చరణంబులు + కడిగి = పాదంబులను గడిగి; తడి + ఒత్తి = నీటిచెమ్మను గుడ్డతోఁ దుడిచి.

తా. అని యాశీర్వదించి మూర్తీభవించిన వేదరాశివలె నుండటయు బుజువర్తనుండును, జడలుగలవాఁడును, యోగదండమును గొడుగును ధరించినవాఁడును, చంకనుండి వ్రేలాడుచున్న భిక్షాపాత్రము గలవాఁడును, హస్తమునందు కమండలువు గలవాఁడును, మనోహరమైన ముఖమనెడి చంద్రమండలము గల వాఁడును, మాయాతత్త్వమును నటించువాఁడును నగు బ్రహ్మచారిని గాంచి భార్గవులు ప్రత్యుత్థానంబు సలిపి మిక్కిలి గౌరవించిరి. బలిసార్వభౌముండును మోదమానసుండై నమస్కరించి, యుచితాసనం బొసంగి యాసీనుంజేసి, తన ప్రాణవల్లభ గొని తెచ్చిన నిర్మలోదకంబులఁ బాదంబులఁ గడిగి శుభ్రపఱచెను. ఆ సమయంబున (తరువాతి పద్యముతో నన్వయము).

వ్యా. వి. కరచరణాది + అవయవంబులు = కరచరణాద్యవయవంబులు (యణాదేశసంధి).

సూ. ఇ, ఉ, ఋ, ౠ, వర్ణములకు సవర్ణములుగాని యచ్చులు పరమైన యెడల య, వ, ర, ల వర్ణములు క్రమముగా వచ్చును.

వ్యా. వి. వడుగు + కొమరుఁడు = వడుగు + ను + కొమరుఁడు = వడుగుం గొమరుఁడు.

సూ. సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. (ఉ॥ వడుగు + ను + కొమరుఁడు.) ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు. (ఉ॥ వడుగు + ను + గొమరుఁడు.)

సూ. ఆదేశ సరళంబులకు ముందున్న ద్రుత మునకు బిందు సంశ్లేషములు విభాషనగు (ఉ = వడుగుం గొమరుఁడు.)

అలంకారము: (రూపకము) ఉ॥ మనోహరవదన చంద్రమండలుండు.

లక్షణము:—ఉపమానోపమేయముల కభేదము కల్పించుటకాని, ఉప మేయమునం దుపమాన తాద్రూప్యముఁ జెప్పుటకాని రూపకాలంకార మగును.

లక్ష్యము:—ఇచట వదనమునకును చంద్రమండలమునకును భేదము లేనట్లు వర్ణింపఁబడినది కావున రూపకాలంకార మగును. (ఉపమేయమగు వదనమునం దుపమానమగు చంద్రమండలం బారోపింపఁబడినది )

3. వటుని = బ్రహ్మచారియొక్క; పాదశౌచవారిన్ = పాదప్రక్షాళన జలంబును (పాదములను శుభ్రపఱచిన జలమును); శిరంబునన్ = శిరస్సునందు; పరమభద్రము + అనుచున్ = మిక్కిలి మంగళకరమనుచు (మిక్కిలి శుభకర మని); బలి = బలిసార్వభౌముఁడు; వహించెన్ = తాల్చెను; ఏ జలమున్ = ఏ యుదకమును; గిరీశుఁడు = శివుఁడు; ఇందుజూటుఁడు = జడలందు చంద్రుఁడు గలవాఁడు; దేవదేవుఁడు = దేవతలకు దేవుఁడు; శిరమునన్ = శిరస్సునందు; ధృతిన్ = సంతోషముతో; ఉద్వహించెన్ = తాల్చెను (ధరించెను, మోసెను).

తా. బ్రహ్మచారి పాదంబులను గడిగి పరమ మంగళంబైన తదీయ పాద ప్రక్షాళనజలంబు బలిసార్వభౌముండు శిరంబున ధరించెను. తచ్చరణ సలిలంబే చంద్రమౌళి పరమభక్తి నాత్మమస్తకంబున ధరించెను.

వ్యా. వి. గిరి + ఈశుఁడు = గిరీశుఁడు (సవర్ణ దీర్ఘసంధి).

సూ. సంస్కృత శబ్దంబులకు సంహిత యున్నప్పుడు అ, ఇ, ఉ, ఋ, కారములకుఁ గ్రమముగా అ, ఇ, ఉ, ఋ వర్ణములు పరమగునేని దీర్ఘ మేకా దేశముగా వచ్చును. (హ్రస్వాచ్చులకుఁ జెప్పిన కార్యము దీర్ఘాచ్చులకును వచ్చును.)

4. ఆ + యజమానుఁడు = ఆ యజ్ఞకర్త (గృహస్థుఁడు); అభ్యాగతు నకున్ = భోజనసమయమునకు వచ్చిన యతిథికి; ఇట్లనియెన్ = ఈ క్రింది విధముగా ననియెను,

5. వడుగా = (బ్రహ్మచారికి సంబోధనము); ఎవ్వరివాఁడవు = ఎవరికి సంబంధించినవాఁడవు; ఎవ్వడవు; సంవాసస్థలంబు+ఎయ్యది = నివాసస్థాన మెయ్యది; ఈ+ఎడకున్ = ఇయ్యెడకున్ = ఈ స్థలంబునకు (ఈ యజ్ఞ శాలకు); నీవు+అరుదెంచుటన్ = నీవు వచ్చుటవలన; వంశమున్ = కులమును; జన్మమున్ = పుట్టుకయును; సఫలమయ్యెన్ = చరితార్థము లయ్యెను (సార్థకము లయ్యెను); కడు+ధన్య+ఆత్ముడను+ఐతిన్ = మిక్కిలి ధన్యాత్ముఁడనైతిని (పుణ్యాత్ముఁడ నైతిని); ఈ మఖము = ఈ యజ్ఞము; యోగ్యంబు+అయ్యెన్ = పవిత్రం బయ్యెను (సాధ్వనుష్ఠితం బయ్యెను); నా కోరికలు = నా యీప్సిత ములు; కడతేఱెన్ = సఫలంబు లయ్యెను (ధన్యంబులయ్యెను, పండెను); శిఖులున్ = అగ్నులును; సుహుతంబులు+అయ్యెన్ = యథావిధి హుతంబు లయ్యెను; ఈ+కాలమున్ = ఇక్కాలమున్ = ఈ సమయమును; కల్యాణము= శుభప్రదమైనది.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! నీ వెవ్వరివాఁడవు. ఎవ్వఁడవు. నీ నివాస స్థలం బెయ్యది. నీ రాకచే నా కులగోత్రంబులు పావనంబు లయ్యెను. యజ్ఞంబు పవిత్రంబయ్యె. నా కోరికలు పండెను. అగ్నులు యథావిధి హుతంబు లయ్యెను. ఈ సమయంబు మిక్కిలి శుభప్రదం బైనది.

వ్యా. వి. ఈ+కాలమున్ = ఇక్కాలమున్ (త్రికసంధి).

సూ. ఆ, ఈ, ఏ యను సర్వనామంబులు త్రికంబునాఁబడు. త్రికంబు మీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. (ఈ+క్కాలమున్) ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. (ఇక్కాలమున్)

6. వరచేలంబులో=విశిష్టమైన వస్త్రములో; మాడలో=నిష్కములో; ఫలములో = పండ్లో (పంటలో); వన్యంబులో=వనములో; గోవులో=ఆవులో; హరులో = అశ్వములో; రత్నములో = (నవరత్నములో); రథంబులో = రథములో; మృష్ట+అన్నంబులో = విశిష్టములైన భోజనములో; కన్యలో = యువతులో; కరులో = ఏనుఁగులో; కాంచనమో = బంగారమో; నికేతన ములో = గృహములో; గ్రామంబులో = ఊళ్లో; భూములో = క్షేత్రంబులో; ధరణీఖండమొ = భూమండలమో; కాక = ఈ వస్తువులుమాత్రమే గాక; ఏమి +అడిగెదో = ఏమి కోరెదవో; ధాత్రీసుర+ఇంద్ర+ఉత్తమా = బ్రాహ్మ ణోత్తమా.

తా. బ్రాహ్మణోత్తమా! వస్త్రములో, నిష్కములో, ఫలములో, వనంబులో, భూములో గ్రామంబులో గజతురగరథంబులో, మృష్టాన్నంబులో నీ కెయ్యవి వలయునో వానినెల్ల గోరుకొనుము.

వ్యా. వి. ధాత్రీసుర+ఇంద్ర+ఉత్తమా = ధాత్రీసురేంద్రోత్తమా. (గుణసంధి)

సూ. 'అ'కారమునకు ఇ, ఉ, ఋ వర్ణములు పరమగునేని క్రమముగా ఏ, ఓ, అర్ వర్ణము లేకాదేశము లగును. (ఏ, ఓ, అర్ వర్ణములకు గుణమని సంజ్ఞ).

7. ధర్మయుక్తంబుగాన్ = ధర్మముతోఁ గూడుకొన్నట్లు; వైరోచని= =విరోచనుని నందనుఁడైన బలిచక్రవర్తియొక్క; వచనంబులు = మాటలు;

8. ఇది నాకు నెలవు+అని = ఈ స్థానము నాకు నివాసభూమియని; ఏరీతిన్ = ఏవిధముగా; పలుకుదున్ = పలుకఁగలను; ఒకచోటు+అనక+ ఒకచోటనెడి స్థిరనివాసములేక; ఎందున్ = ఏచటనైనను; ఉండనేర్తున్ = నివాస ముండఁగలను (సర్వాంతర్యామిని); ఎవ్వనివాఁడను + అంచున్ = ఎవ్వనికి సంబంధించినవాఁడనని; ఏమని పలుకుదున్ = ఏమని చెప్పఁగలను; నా+అంత+వాఁడను+ఐ = నాకు నేనే స్వయముగా; నడవనేర్తున్=గమనమును సాగింపఁగలను (స్వయముగా జీవయాత్రను సాగింపఁగలనని భావము). ఈ నడవడి+అని = ఇట్టి నడవడియని (నా నడవడి యిదియని); ఎట్లు వక్కాణింతున్ = ఏవిధముగాఁ జెప్పఁగలను; పూని=యత్నించి; మూఁడు+పోకలన్ = మూడులోకములయందును (పోక = గమనము, నడక, ప్రవర్తనము); పోవనేర్తున్=గమనమును సాగింపఁగలను; అదినేర్తున్+ఇదినేర్తున్+అని+ఏల+ చెప్పంగన్ = నే నదినేర్చితిని యిది నేర్చితినని యేల చెప్పవలయును; నేరుపులు +అన్నియున్ = నేర్చుకొందగిన సర్వవిషయములను; నేననేర్తున్ = నేనే స్వయముగా నేర్చుకొనఁగలిగితిని (సర్వజ్ఞుఁడనని భావము); ఒరులు+కారు+ నాకున్ = నాకితరుల యావశ్యకత లేదు (ఇతరులు నన్ను తెలిసికొనలేరని భావము); ఒరులకు+నేను+ఔదున్ = ఇతరులకు నేను కావలసినవాఁడను (ఎల్లరకును నేను కావలసినవాఁడనని భావము); ఒంటివాఁడన్ = ఏకాకిని; చుట్టము+ఒకఁడు+లేఁడు = బంధువు లొక్కరైనను లేరు; సిరియున్=లక్ష్మియును; తొల్లి = పూర్వము; కలదు = ఉండినది; నావెంకిన్ = నా నివాసస్థానమును; చెప్పెదన్ = చెప్పెదను; సుజనులందు = ఉత్తములయందు; తలచు = సాధారణముగా; చొచ్చి+ఉందున్ = ప్రవేశించియుందును.

తా. సార్వభౌమా! నీ పలుకు లత్యంత ధర్మయుక్తంబులై యున్నవి. ఈ చోటు నాకు నిలయంబని యెట్లు వక్కాణింపఁగలను? సర్వాంతర్యామినై సంచరించుచుండును. ఎవ్వనివాఁడనని పలుకఁగలను? నాకు నేనే స్వయముగా జీవయాత్ర సాగించుచుందును. నా మార్గ మిదియని యెట్లు నిర్ధరింపఁగలను?

ముల్లోకంబులలోను గమనమును సాగించుచుందును. నేను నేర్చిన దిదియని యెట్లు నిర్ణయింపఁగలను? సర్వజ్ఞుఁడనై ప్రవర్తించుకొనియెదను. నా కెవ్వరి తోను సంబంధములేదు. నా కెవ్వరును కావలసియుండరు. కాని నే నందఱికిని కావలసినవాఁడను. ఒంటిగా జీవించుచుందును. నా కెవ్వరును చుట్టంబులు లేరు. ఎల్లప్పుడును సుజనులయందు దాగియుందును.

వ్యా. వి. 1. వక్కాణింతుక్ = వక్కాణించుగును.

నేర్తున్ = నేర్చుదును.

సూ. చువర్ణంబుతోడ దుగ్ధకారంబుఁ దకారంబగు.

వా. వి. 2. మూఁడు + పోకలు = ముప్పోకలు.

సూ. సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డువర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగును. (ఉ॥ మూఁడు + పోకలు = మూ + ప్పోకలు.)

సూ. ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. (ఉ॥ ముప్పోకలు.)

9. అది + అట్లు + ఉండక్ + ఇమ్ము = ఆ విషయము నట్లుండనిమ్ము.

10. జననాథ = (రాజా యని సంబోధనము); నీమాట = నీ వాడిన మాట; సత్యంబు = సత్యంబైనది; సత్కీర్తిదంబు = యశస్కరంబైనది (కీర్తిని గలిగించునది); కుల + అర్హంబు=కులోచితమైనది (వంశమునకుఁ దగినది). ధర్మయుతము = ధర్మయుక్తంబైనది; కరుణ + అనువర్తులు = దయతో ననుస రించువారు; ఘనతత్త్వమూర్తులు = గొప్ప తత్త్వజ్ఞానముతో మూర్తీభవించిన వారు; కాని; మీ కులము + అందుక్ = మీ వంశమునందు; కలుగరు + ఒరులు= ఇతరులు జన్మింపరు (పైన వర్ణింపఁబడినట్టివారుగాక మీ వంశంబున నితరులు జన్మింపరని భావము); రణభీరువులు = యుద్ధమునకు వెనుదీయువారు (పిఱికి పందలు); వితరణభీరువులు = దానమన్న బెదరిపోయెడువారు (ఇచ్చినఁ దఱిగి పోవునని భయపడువారు); లేరు = (మీ వంశమున లేరని భావము); ప్రత్యర్థులు శత్రువులు; అర్థులు = అర్థించువారు (వేఁడుకొనువారు); ప్రబ్బికొనినక్ = చుట్టును వ్యాపించిన యెడల (అతిశయించినయెడల); దానశౌండిమమునక్ = దానసామర్థ్యమున (మిక్కిలి యీవితో); తనుపుగురు = తృప్తిపఱతురు; మీ తాతలందఱు; మేటిమగలు = మిక్కిలి గొప్పవారు; మీ కులంబునందుక్=మీ వంశమునందు; మింటి చంద్రుమాడ్కిక్ = ఆకసంబుననున్న చంద్రబింబంబు పగిది; ప్రహ్లాదుండు; మేలిరుచులక్ = విశిష్టమైన కాంతులతో; మెఱయుక్ = ప్రకాశించును; (ఉపమాలంకారము); ప్రథితకీర్తితోడక్ = ప్రఖ్యాతివహించిన

యశస్సుతో; భవదీయ = నీ యొక్క; వంశంబు = కులము; నీరరాశిభంగిన్ = సముద్రమువోలె; నెగడుచుండున్ = వర్ధిల్లుచుండును. (ఉపమాలంకారము)

తా. రాజా! నీ పలుకులు సూనృతంబులుఁ గులోచితంబులు యశస్కరంబులు ధర్మయుతంబులునై యొప్పెడిని. మీ వంశంబు కరుణాత్ములకుఁ దత్త్వమూర్తులకు నిలయంబు. రణభీరువులుగాని వితరణ భీరువులుగాని మీ కులంబునం గలుగరు. ఆశ్రయించిన శత్రువులనైనను దాన ధర్మములతోఁ దనుపుదురు. మీ తాతలందఱు మేటిమగలు. ఆకసంబునఁ జంద్రబింబంబుమాడ్కి మీ వంశంబునఁ బ్రహ్లాదుండు తేజరిల్లెడు. నిర్మలకీర్తితో మీవంశంబు సముద్రంబు పగిదివర్ధిల్లెడిని.

అలంకారము 1 : "మీ కులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు మింటి చంద్రుమాడ్కి మేలిరుచులన్". (ఉపమాలంకారము)

లక్షణము :— ఉపమానోపమేయములకు సొగసైన సామ్యమును స్పష్టముగ నిరూపించుట యుపమాలంకారము.

ఉపమేయము :— ప్రహ్లాదుఁడు (వర్ణింపఁబడునది, ప్రస్తుతమైనది.)

ఉపమానము :— చంద్రుఁడు (వర్ణింపఁబడుదానికి సమానమైనది, అప్రస్తుతమైనది.)

ప్రకాశించుట :— ఉభయసాధారణ ధర్మము.

మాడ్కిన్ :— ఉపమావాచకము.

ఉపమాసామాగ్రియగు పదార్థ చతుష్టయము వాచ్యముగా నున్నది. కావున నిది పూర్ణోపమాలంకారము.

అలంకారము 2 :— "ప్రథితకీర్తితోడ భవదీయ వంశంబు నీరరాశిభంగి నెగడుచుండు" (ఉపమాలంకారము)

ఉపమేయము :— వంశము.

ఉపమానము :— సముద్రము.

కీర్తి (నైర్మల్యము) :— ఉభయ సాధారణ ధర్మము.

భంగిన్ :— ఉపమావాచకము.

వ్యా. వి. కుల + అగ్ర్యంబు = కులాగ్ర్యంబు (సవర్ణదీర్ఘసంధి)

కరుణ + అనువర్తులు = కరుణానువర్తులు (సవర్ణదీర్ఘసంధి)

సూ. సంస్కృత శబ్దంబులకు సంహితయున్నప్పుడు అ, ఇ, ఉ, ఋ కారములకుఁ గ్రమముగా అ, ఇ, ఉ, ఋ వర్ణములు పరమగునేని దీర్ఘమేకాదేశము గావచ్చును.

11. గద + ఆయుధుండై = గద నాయుధముగాఁ గలిగినవాఁడై; ప్రతివీరులన్ = శత్రువీరులను; సమయించెన్ = తుదముట్టించెను (సంహరించెను);

తత్ + భ్రాత + అగు = అతనికి సోదరుఁడగు; గ్రద్దనన్ = శీఘ్రముగా; ఉద్ద విడి = మిక్కిలి (ఉద్దవడి యనియుఁ బ్రయోగము, మిక్కిలి శీఘ్రముగా నని భావము); ఆ + దనుజమర్దను = ఆ రాక్షసాంతకుని; మందిరంబునకున్ = గేహమునకు.

తా. పూర్వము మీ తాతయైన హిరణ్యాక్షుం డేకవీరుండై గదాపాణియై భూతలంబునఁ దన్ను మార్కొను ప్రతిభటుంగానక విక్రమంబున సంచరింప విష్ణుండు వరాహరూపంబున నాతనిని సంహరించెను. అతని సోదరుండైన హిరణ్యకశిపుం డదివిని హరి పరాక్రమంబున కాశ్చర్యంబును బొంది విష్ణువుం దెగఁ జూతునని హరిమందిరంబునకుం జనియెను.

వ్యా. వి. ఆ + దనుజమర్దను = అద్దనుజమర్దను (త్రికసంధి.)

సూ. ఆ, ఈ, ఏ, యను సర్వనామంబులు త్రికంబునాఁబడు. త్రికంబు మీది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు (అ + ద్దనుజమర్దను) ద్విరుక్తంబగు హల్లుపరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు (అద్దనుజమర్దను.)

12. శూల + ఆయుధహస్తుఁడై = త్రిశూల మాయుధముగాఁ గలిగిన హస్తము గలవాఁడై; (త్రిశూలమనెడి యాయుధము హస్తమునందుఁ గలవాఁడై); కాల + ఆకృతిన్ = యముని రూపముతో (యమునివలె); వచ్చు = వచ్చునట్టి; దనుజున్ = రాక్షసుని; కని = చూచి; విష్ణుండున్ = విష్ణుమూర్తి; కాలజ్ఞతన్ = త్రికాలవేదియై; మాయాగుణశీలతన్ = మాయాతత్త్వముతోగూడిన శీలముతో; ఇట్లు + అని = ఈ క్రిందివిధముగా ననుకొని; చిత్తములోనన్ = మనస్సునందు; తలంచెన్ = తలపోసికొనెను.

తా. త్రిశూల మాయుధముగాఁ గలవాఁడై కాలునిపగిది వచ్చుచున్న రాక్షసేశ్వరుని జూచి కాలవేదియు మాయావివర్యుండును నైన విష్ణుం డిట్లని భావించెను.

వ్యా. వి. శూల + ఆయుధహస్తుఁడు (సవర్ణదీర్ఘ సంధి)

13. ఎదురు + ఐ + పోరన్ = ఎదుట నిలిచి యుద్ధముచేసిన యెడల; ఇతనిన్ = ఈ రాక్షసుని; జయింపరాదు = జయించుట సాధ్యముగాదు; కాక = అట్లుకాక; ఎందు + ఏనినిన్ + పోవన్ = ఎచ్చటికైనను పాఱిపోవుట కుపక్రమించిన; భీప్రదుఁడై = భయంకరుఁడై; ప్రాణులన్ + తోలు + మృత్యువు క్రియన్ = జీవులవెన్నాడు నట్టి మృత్యుదేవతవలె; పైవచ్చున్ = పైఁబడివచ్చును (ఉపమాలంకారము); అంచున్ = అనుకొనుచు; క్రియావిదుండు = ఉపాయము నెఱింగిన

వాఁడు; అబ్జ+అక్షుడు = కమలనేత్రుఁడు, విష్ణువు (సవర్ణదీర్ఘ సంధి.) ప్రత్యక్ష క్రియ+అభీరుఁడై = ప్రత్యక్ష క్రియచేత భయములేనివాఁడై; నిశ్వాస రంధ్ర దిశన్ = ఘ్రాణరంధ్రమార్గమున (ముక్కునుండి); దైత్య+హృత్+అంతరాళమునన్ = రాక్షసునియొక్క హృదయము లోపలన్; సూక్ష్మరూపమునన్ = సూక్ష్మాకృతితో; ఆవేశించెన్ = ప్రవేశించెను. (చొఁఱబారెను.)

తా. ఈ రాక్షసుని యుద్ధములో నెదుట నిలిచి జయించుట దుర్ఘటంబనియు, నెందేనిం బాఱిపోవ మృత్యుదేవత మాడ్కి వెంటాడుననియు భావించి విష్ణువు ప్రత్యక్ష క్రియచేత భయరహితుఁడై సూక్ష్మ తనువును దాల్చి రాక్షసుని ఘ్రాణరంధ్రమునుండి తదీయ హృదంతరాళంబునఁ బ్రవేశించెను.

అలంకారము :— "భీప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియంబై వచ్చున్" (ఉపమాలంకారము.)

లక్షణము :— ఉపమానోపమేయములకు సొగసైన సామ్యమును స్పష్టముగా నిరూపించుట యుపమాలంకారము.

రాక్షసుఁడు :— ఉపమేయము.

మృత్యువు :— ఉపమానము.

భయంకరుఁడై వెన్నాడుట :— ఉభయసాధారణ ధర్మము.

క్రియన్ :— ఉపమావాచకము.

వ్యా. వి. అబ్జ+అక్షుఁడు = అబ్జాక్షుఁడు (సవర్ణదీర్ఘ సంధి) ప్రత్యక్ష క్రియ+అభీరుఁడై = ప్రత్యక్ష క్రియాభీరుఁడై (సవర్ణదీర్ఘ సంధి.)

14. ఆ+దైత్యవల్లభుండు = ఆ రాక్షసరాజు (త్రికసంధి); వైష్ణవ+ఆలయంబు = వైష్ణవాలయంబు = విష్ణుసదనంబు (సవర్ణ దీర్ఘ సంధి); చొచ్చి = ప్రవేశించి; మిన్ను = ఆకసము; మన్ను = భూమి; అన్వేషించి = వెదకి; త్రిదివంబు = స్వర్గము; దిశలన్ = దిక్కులను; పరికించి = పరిశోధించి; భూవివరంబులు = భూమియందుఁగల గుహలను; వీక్షించి=చూచి; అదృష్టశత్రుండై= కన్పించని శత్రువు గలవాఁడై; మార్గణంబు=అన్వేషణము (వెదకుట); చాలించి= మానుకొని.

తా. రాక్షసేశ్వరుండు విష్ణువును దల్లోకంబునఁ గానక కోపంబు మానక భూమ్యాకాశంబులను బరిశోధించి, దెసలు పాతాళంబు వీక్షించి, సముద్రంబులు శోధించి, పురంబులు వనంబులు భూవివరంబులు గాలించి శత్రువును బొడఁగనఁ జాలక వెదకుటను మానుకొనెను.

వ్యా. వి. ఆ+దైత్యవల్లభుండు = అద్దైత్యవల్లభుఁడు (త్రికసంధి.) వైష్ణవ+ఆలయంబు = వైష్ణవాలయంబు (సవర్ణదీర్ఘ సంధి)

15. పగవాఁడు = విరోధి; మడియక్+ఓపును = మరణించియుండ నోపును; తెగడు+ఏనిన్ = మరణింపకుండినచో; ఎదురు+పడఁడె = ఎదుటఁ బడఁడా (కన్పించునుగదా); దేహధరులకున్ = శరీరమును దాల్చినవారికి (ప్రాణులకు); తెగిన+ఎడన్ = మరణించిన సందర్భమున (ఓడిపోయిన సందర్భమున) పగఅమీఁదను = శత్రువులపైన; పగన్+కొనన్+తగదు = వైరమును బాటింప కూడదు; అనుచున్ = అనుకొనుచు; ఉడిగెన్ = మానుకొనెను (విరోధమును మానుకొనెను) ప్రాభవశక్తిన్ = అధికారసామర్థ్యముచేత.

తా. శత్రువు మరణించియుండనోపును. జీవించియుండిన నేలఁ బాడకట్టఁడు; ప్రాణులకు మరణించినవారిపైన శత్రుత్వము తగదని హిరణ్యకశిపుండు వైరంబుఁ బాటింపకుండెను.

16. ప్రపితామహుండు = ముత్తాత (బలిసార్వభౌముని తండ్రి విరోచనుఁడు. విరోచనుని తండ్రి ప్రహ్లాదుఁడు. ప్రహ్లాదుని తండ్రి హిరణ్యకశిపుఁడు)

17. ఆతుర భూసురగతిన్ = వ్యాధిగ్రస్తుఁడైన బ్రాహ్మణుని పగిది (బాధపడుచున్న బ్రాహ్మణుని పగిది యనియు); పురుహూత+ఆగులు = పురుహూతుఁడు మొదలుగాఁగల విబుధులు; తన్నువేఁడన్ = తన్ను ప్రార్థింపఁగా; ఒగిన్=ఒప్పిదముగా; విధిక్రమముగాననియు; కొండు+అనుచున్ = కైకొనుఁడనుచు; మీ తండ్రి=మీ తండ్రియైన విరోచనుఁడు; ఆయువున్=ఆయుస్సును; ఇచ్చెన్ = ప్రసాదించెను; (ఒసఁగెను); ఈ లోకమునన్ = ఈ జగములోన్; నీవున్ = నీవును; ఏతత్+మాత్రుఁడవె=(నీవు సామాన్యుడవు కావని భావము.)

తా. పురుహూతాది విబుధులు విప్రవేషంబులతోఁ దన్ను యాచింపఁగా మీ తండ్రి విరోచనుండు తన యాయువును బ్రసాదించెను. ఈ జగంబున నీవును సామాన్యుఁడవు గావు.

## పూర్వగాథ

విరోచనుఁడు ప్రహ్లాదుని కుమారుఁడు. బలిసార్వభౌమునకుఁ దండ్రి. అతఁడు దానశౌండిమమున దశదిక్కులయందును బేరుమ్రోఁగినవాఁడు. ఒకప్పుడు పురుహూతాది విబుధులాతని వితరణ సామర్థ్యమునుఁ బరీక్షించుటకై వ్యాధిగ్రస్తులైన బ్రాహ్మణ వేషంబులను ధరించి వంచనతో విరోచనుని మందిరంబునకుంజనిరి. బ్రాహ్మణ వేషధారులైన పురుహూతాదులను గాంచి విరోచనుండు ప్రత్యుత్థానంబు సలిపి గౌరవించి వారు వచ్చిన కార్యంబును నివేదింప

మని వేఁడుకొనియెను. అంతట భూసురులా వితరణ ముఖరుని యాయువును ప్రసాదింపమని యాచించిరి. విరోచనుం డా భూసురుల వంచన నెఱింగియు సంకోచింపక, యడిగినదే తడవుగా స్వార్థరహితుండై తన యాయువునందుఁ గొంతభాగమును వారికిఁ బ్రసాదించెను. అంతట దేవకార్యంబు సాధింపవచ్చిన పురుహూతాదులా వితరణ ముఖరుని సామర్థ్యంబును వేనోళ్లఁ గొనియాడుచు గృహోన్ముఖులైరి.

18. మూఁడు+జగములన్ = ముల్లోకములను (స్వర్గ మర్త్య పాతాళంబులు); ఏలితివి = పరిపాలించితివి; ఇంద్ర+ఆది+సురలన్ = దేవేంద్రుఁడు మొదలుగాఁగల దేవతలను; తోలితివి = వెన్నంటి నడిపించితివి; దాన గుణములన్ = దానధర్మముల నొనరించు స్వభావమునందు; తొల్లిటివారిన్ = మీ పూర్వులను (మీ పెద్దలను); పోలితివి = సరిపోలితివి (ఒప్పితివి); పిశాచ రాక్షసులన్ = పిశాచములైనరాక్షసులను; రక్షింపన్ = రక్షించుటకు; సోలితివి = చొక్కితివి.

తా. నీవు ముల్లోకంబుల నేలితివి. ఇంద్రాది విబుధులఁ దఱిమితివి. దానధర్మంబుల మీ పెద్దలను సరిపోలితివి. రాక్షసుల నుద్ధరించితివి.

20. రాజ్యంబు+కలిగెన్+ఏనిన్ = రాజునకు రాజ్యాధిపత్యము గలిగియున్నచో; పూజ్యులకును = పూజింపఁదగిన వారికిని (ఉత్తములకును); యాచకులకున్ = యాచించువారికిని (అడిగెడువారికిని); భూమిసురులకున్ = బ్రాహ్మణులకును; భాజ్యముగన్ = పంచిపెట్టవలసిన విధానముగాఁ బంచిపెట్టునట్లు (యుక్తముగా పంచిపెట్టుచు); బ్రదుకఁడు+ఏనిన్ = జీవనము సాగింపని యెడల; వాని = ఆ రాజుయొక్క; జన్మ+ధన+గేహంబుల్ = పుట్టుకయును; సంపదయును, గృహంబును; త్యాజ్యంబులు = విడువఁదగినవి (వ్యర్థములని భావము.)

తా. రాజు రాజ్యమును గలిగియున్నప్పుడు పూజ్యులకును, యాచకులకును, బ్రాహ్మణులకును సమానముగాఁ బంచిపెట్టడేని, వాని పుట్టుకయు సంపదయును గృహంబును వ్యర్థంబులగును.

21. వదాన్యులన్ = గొప్పదానములఁ జేయువారిని, గొప్ప యీవికాండ్రను; ఎన్నెడుచోన్ = గణించు సందర్భమున (లెక్కించు సందర్భమున); నిన్ను = బలిసార్వభౌముండవైన నిన్ను; త్రిభువన+ఈశుండు+అనుచున్ = ముజ్జగంబులకు ప్రభువని యనుకొనుచు; మున్ను = మొట్టమొదట; ఎన్నుదురు = లెక్కింతురు; ఇన్ని దినంబులన్+ఉండియున్ = ఇన్నాళ్ళనుండియు; ఎన్నడున్ = ఎప్పుడును; నినున్ = నిన్ను; పెట్టుము+అనుచున్ = దానము చేయమని (పెట్టవలసినదని); ఈంద్రము+చేయన్ = పీడించి యెఱుఁగను.

తా. సార్వభౌమా! ముల్లోకంబులకునధిపుండవని, గొప్పయీవికాండ్రను లెక్కించు సందర్భమున మొట్టమొదట నిన్ను గణింతురు. ఇన్నినాళ్లనుండియు నేను దానంబునకై యాచించి నిన్ను పీడించి యెఱుఁగను.

వ్యా. వి. త్రిభువన + ఈశుండు = త్రిభువనేశుండు (గుణసంధి)

సూ. "అ" కారమునకు ఇ, ఉ, ఋ వర్ణములు పరమగునేని ఏ, ఓ, అర్ వర్ణము లేకాదేశములగును. (ఏ, ఓ, అర్ వర్ణములకు గుణమని సంజ్ఞ.)

22. ఒంటివాఁడన్ = ఏకాకిని; ఒకటి రెండడుగుల మేర=ఒకటి రెండడుగుల ప్రమాణము (మేర = ప్రమాణము, కొలంది, ఎల్ల. ఇచ్చట ఒకటి రెండడుగుల ప్రమాణముగల నేలయని భావము.) సొమ్ము=ధనము, అధీనవస్తువు; బ్రహ్మకూఁకటి = బ్రహ్మయొక్క జుట్టుముడిని; ముట్టెదన్=తాఁకెదను (సత్యలోకము వఱకు నాక్రమించుకొనియెదనని భావము); దానకుతుకసాంద్ర = దానము చేయుటయం దధికమైన యుత్సాహముగలవాఁడ (దానము చేయుటయందుఁ దమితీరనివాఁడా); దానవ + ఇంద్ర = రాక్షసేంద్రా.

తా. దానవేంద్రా! నే నేకాకిని. ఒకటి రెండడుగుల మేరతో సంతోషింతును. నిన్నెక్కువ సొమ్మర్థింపను. కోరెక్కుదీరునట్లుగా బ్రహ్మలోకపర్యంతము నాక్రమించుకొనియెదను.

వ్యా. వి. దానవ + ఇంద్ర = దానవేంద్ర (గుణసంధి.)

23. పరమయాచకునకు = పవిత్రమైన యాచకునకు; ప్రదాత = గొప్పయీవికాఁడు (దానకర్త).

24. ఉన్నమాటలు + ఎల్లన్ = నీ యందున్న మాటలన్నియుఁ (ఇప్పుడు నీవు పలికిన పలుకులన్నియు); ఒప్పున్=ఒప్పిదముగా నుండును; విప్రుండు + అ= బ్రాహ్మణుఁడ; సత్యగతులు = సత్యమార్గము ననుసరించునవి; వృద్ధసమ్మతములు= విజ్ఞానవేత్త లంగీకరించునవి (పెద్దల యంగీకారమును బొందునవి); ఓ + చెల్ల = (అవ్యయము, సంతాపమును దెలిపెడి సందర్భమున వాడుదురు); దాత = ఇచ్చువాఁడు (ఈవికాఁడు); పెంపున్ = ఆధిక్యమును, గౌరవమును; సొంపున్=సమృద్ధిని; తలఁపవలదె= తలంచి చూడవలద.

తా. బ్రాహ్మణ నందనా! నీ పలుకులు సూనృతంబులును వృద్ధ సమ్మతంబును నైయున్నవి. మాటవరుసకు గొంచెపు భూమినడిగితివి గాని దానము చేయువారి యాధిక్యమును సమృద్ధిని గమనింపవైతివిగద.

26. వసుధాఖండమున్ = భూభాగమును; వేఁడితో = కోరితివా; జగములన్ = లోకములను; వాంఛించితో = కోరితివా; వాజులన్ = అశ్వంబులను; వెసన్ + ఉహించితో = వెంటనే యభిలషించితివా; కోరితో=కోరితివా; యువతులన్ = ప్రాయముగల స్త్రీలను (పదియాఱేండ్లు మొదలు ముప్పదియేండ్ల

వఱకు వయస్సుగల స్త్రీలు యువతులు); వీక్షించి = చూచి; కాంక్షించితో = కోరుకొంటివా; పసిబాలుండవు = చిన్నవాడవు (బాలిశమతివి); ఈవు = నీవు; అడుగన్ + నేరవు = అడిగిపుచ్చుకొనుటకు నేరనివాఁడవు; నీ భాగ్యంబులు = నీ యదృష్టము; ఈ + పాటి + కాక = ఇంతమాత్రమే యగునుగాక; పదత్రయంబు = మూఁడడుగులకు జాలినమాత్రము; అడుగన్ = అడుగఁగా; అసుర + ఇంద్రుండు = రాక్షసేశ్వరుఁడు; ఈ + అల్పంబున్ = ఈ కొంచెపు భూమిని; ఈ నేర్చునే = ఇయ్యగలఁడా.

తా. భూభాగంబును వేఁడుకొంటివా. లోకంబులను గోరుకొంటివా. అశ్వంబుల నభిలషించితివా. ప్రాయముగల స్త్రీలను గాంక్షించితివా. బాలుండవు బాలిశమతియుఁ గావున నడిగి పుచ్చుకొనుటకు నేరవైతివి. నీ యదృష్టంబింత మాత్రమే యగును గాక లేనియెడల దానవేశ్వరుండనైన నన్ను పదత్రయమాత్రంబైన భూమిని యాచించెదవేల. ఈ కొంచెపు భూమి నియ్యగలనా?

వ్యా. వి. వేడితివి + ఓ = వేడితి + ఓ = వేడితో.

సూ. లిఙ్లోట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు (వేడితి + ఓ). మధ్యమ పురుషక్రియలయం దిత్తునకు సంధియగును. (వేడితి + ఓ = వేడితో.)

27. మొగంబునన్ = ముఖమునందు; చిఱునగవు = మొలకనవ్వు, లేఁతనవ్వు; మొలకలు + ఒత్తన్ = అంకురింపఁగా; గృహమేధికి = యజమానికి (గృహస్థునకు); మేధావి = ధారణాశక్తిగలవాఁడు (బ్రహ్మచారి).

28. గొడుగో = ఛత్రమో (ఆతపత్రము); జన్నిదమో = యజ్ఞోపవీతమో; కమండలువో = (సన్న్యాసులు జలంబునుంచుకొనియెడి మట్టిపాత్రమో); నాకున్; ముంజియో = మొలత్రాడో, (బ్రహ్మచారి కట్టికొనెడి దర్భలతోఁ పేనఁబడిన మొలనూలో); దండమో = పూజాదండమో (యోగదండమో); (ఇట్టి వస్తువుల నడిగి పుచ్చుకొనుటకు యోగ్యతగలవాఁడనని భావము.) వడుగు + ఏన్ + ఎక్కడ = బ్రహ్మచారినైన నే నెక్కడ; భూములు + ఎక్కడ = భూములను యాచించు టెక్కడయని భావము) కరుల్ + ఏనుఁగులు; వామ + అక్షులు = స్త్రీలు; అశ్వంబులు = గుఱ్ఱములు; ఎక్కడ; నిత్య + ఉచితకర్మము + ఎక్కడ = నిత్యము చేయఁదగు కర్మ మెక్కడ. (నిత్య నైమిత్తికాదిషట్కర్మములు: యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము.) మత్ + ఆకాంక్షా + మితంబు + ఐన = నా యొక్క కోరికకుఁ బరిమితమైన; మూఁడు + అడుగుల్ + మేర + అ = పదత్రయమాత్రంబైన భూమి; త్రోవక = త్రోసివేయక; ఇచ్చుట = ప్రసాదించుట; అది = అట్టి కృత్యము; నా పాలికిన్ = నా పక్షమునందు; బ్రహ్మాండంబు = బ్రహ్మాండముగాఁ బరిగణింపఁబడును.

తా. గొడుగునో, జన్నిదమునో, కమండలువునో మొలనూలునో, పూజా దండమునో యాచించి ప్రతిగ్రహించుటకు యోగ్యతగలిగిన బ్రహ్మచారిని నే నెక్కడ భూములు కరులు హయంబులు వామాక్షులు నెక్కడ. నా కోరికకుఁ బరిమితమైన మూఁడడుగుల కొలంది భూమినే నేను బ్రహ్మాండంబని భావింతును నా కోరికను త్రోసిపుచ్చక ప్రసాదింపుము.

అలంకారము:— విషమాలంకారము.

లక్షణము :— అనురూపములుగాని రెండు వస్తువుల నొకచో వర్ణించిన విషమాలంకారమగును.

ఇచట ననుగుణములగు జన్నిదాదులకును భూములు కరులు వామాక్షులు మొదలగువానికిని ఘటన కూర్పఁబడియున్నది. కావున విషమాలంకార మగుచున్నది.

వ్యా. వి. వామ+అక్షులు = వామాక్షులు (సవర్ణదీర్ఘసంధి); నిత్య+ఉచితకర్మము = నిత్యోచితకర్మము (గుణసంధి).

30. వ్యాప్తిన్+పొందక = ప్రసిద్ధికై పాటుపడక; వగవక = కొఱతపడక (ఆలోచింపక); ప్రాప్తంబు+అగు = లభ్యమైన; లేశంబు+ఐనన్ = కొంచెమైనను; పదివేలు+అనుచున్ = (అదియే యెక్కువయని భావించుచు); తృప్తిన్+చెందని = తనివి నెందని; మనుజుఁడు = మానవుఁడు; సప్తద్వీపసములన్+అయినన్ = సప్తద్వీప సంభృతమయిన భూమండలంబు లభించినను; చక్కంబడునే = సరిపడునా (తనివి నెందఁడని భావము).

తా. మిక్కిలి యాచించి ప్రసిద్ధికై పాటుపడక ప్రాప్తంబైన లేశంబైనను బదివేలని తనివి నెందని మానవుఁడు సప్తద్వీప సభృతంబైన భూమండలంబు చేతనైనను దృప్తిని బొందఁడు.

31. రాజేంద్ర; ఆశాపాశము = ఆశయనెడి త్రాడు; తాన్ = తాను; కడున్ = మిక్కిలి; నిడుపు = దీర్ఘమైనది (నిడివైనది); లేదు+అంతంబు = ఆశాపాశమున కంతములేదు(ఆశాపాశమునకుఁ దుదిగన్పింపదనిభావము); వారాశి ప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు = సముద్రములచేఁ గప్పఁబడిన భూమండలమనెడి సామ్రాజ్యము; చేకూడియున్ = సంప్రాప్తించియు (కలిగియు); మునుపు = పూర్వము; వైన్యగయ భూకాంత+ఆదులు = సప్తద్వీపపతులైన పృథునృగాదినృపతులును; గాసిన్+పొందిరి+కాక=శ్రమపడిరిగాక (బాధపడిరి గాక); అర్థకామ+ఆశన్+పాయగన్+నేర్చిరే = అర్థకామములఁ దృష్ణను బోఁగొట్టుకొనినారా? (అరకామాదులఁ దృష్ణకుఁ దుదిఁ గానరైరని భావము); నిజ = తమయొక్క; ఆశ+అంతంబులన్ = ఆశలకు నంతంబులను; చూచిరే = కనుఁగొనఁగల్గిరా (చూడలేదని భావము).

తా. రాజేంద్రా! ఆశాపాశము గడు దీర్ఘమైనది. అది యనంతమైనది. పృథున్నృగాదిన్నృపాలురు సముద్రంబులచేఁ గప్పఁబడిన భూమండలంబు సర్వంబును బరిపాలించియు శ్రమనుబొందిరి గాని యర్థకామాదులఁ దృష్ణకుఁ దుదిఁ గానరైరి.

వ్యా. వి. భూకాంత+ఆదులు = భూకాంతాదులు (సవర్ణదీర్ఘసంధి) భూకాంతాదులున్ + అర్థకామాశన్ = భూకాంతాదులున్నర్థకామాశన్.

సూ. కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి (ప్రౌఢవ్యాకరణము - సంధి 3)

32. సంతుష్టుఁడు = సంతోషమును బొందినవాఁడు; మూఁడు+జగములన్ = ముల్లోకంబులయందును; పూజ్యుండు = పూజింపఁదగినవాఁడు; సంతోషికిన్ = సంతోషమును బొందిన వానికి; ఎప్పుడున్ = ఎల్లప్పుడు; సుఖము = సౌఖ్యము; జరుగున్=కలుగును; సంతోషి + కాకుంటన్=సంతోషించినవాఁడు గాకపోవుటచే; సంసారహేతువు = సంసారంబున మునుఁగుటకుఁ గారణము; సంతసంబునన్ = సంతోషముచే; ముక్తిసతియున్ = ముక్తియనెడుగాంత; దొరకున్ = లభించును; పూఁట పూఁటకున్ = ఏ పూఁట కా పూఁట; జగంబులన్ = లోకములందు; యదృచ్ఛాలాభతుష్టిని=దొరికినదానితోఁ దృప్తివహించి హర్షించుటచే (యదృచ్ఛాలబ్ధమునకు సంతసిల్లుటచేత); తేజంబు = ప్రకాశము, ప్రతాపము; తోన పెరుఁగున్ = వెంటనే వర్ధిల్లును; పరితోషహీనతన్ = సంతోషము లేకపోవుటచేత (తృప్తివహింపనిచో); జలధారన్ = నీటిధారచే; అనలంబు = అగ్ని; సమయునట్లు = సమసిపోవునట్లు (నశించిపోవునట్లు); ప్రభ = ప్రకాశము, వెలుఁగు; చెడిపోవును = నశించిపోవును (ఉపమాలంకారము); నీవు; రాజవు+అనుచున్ = అధిపతివని భావించి; నిఖిలంబున్ = సర్వస్వమును; అడుగుట = యాచించుట; తగవు+కాదు = యుక్తముగాదు (న్యాయముగాదు); నాకున్; తగినకొలఁది = యోగ్యతకుఁ దగినట్లు (కావలసినమాత్రము); నేను; వేఁడుకొనిన = ప్రార్థించిన; పదత్రయమును=మూఁడడుగుల మాత్రంబైన నేలను; చాలదు+అనక = సరిపోదని చెప్పక; ఇమ్ము; చాలున్+చాలు = అదియేనాకు సరిపోవును.

తా. సంతుష్టుఁడు ముల్లోకంబులందును బూజింపఁబడి సౌఖ్యమును బొందుచుండును. సంతోషహీనుఁడు సంసారసాగరంబున మునిఁగి తేలుచుండును. యదృచ్ఛాలబ్ధమునకు సంతసిల్లు మానవునకుఁ దేజంబు వర్ధిల్లుచుండును. సంతోషంబునకుఁ దనియుటయే ముక్తికారణము. అసంతుష్టుని తేజము జలంబున నగ్నింబలెం బ్రతిహతంబై నశించును. నీ వధిపుండవని యధికం బడుగుట యుక్తంబుగాదు. కావున నాకు యుక్తంబైన పదత్రయపరిమితంబైన నేలను లేదనక ప్రసాదింపుము. అదియే నాకుఁ బదివేలు.

అలంకారము—ఉపమాలంకారము :

"పరితోషహీనతఁ బ్రభ సెడి పోవును జలధార ననలంబు సమయునట్లు"

లక్షణము :— ఉపమానోపమేయములకు సొగసైన సామ్యమును స్పష్టముగ నిరూపించుట యుపమాలంకార మగును.

ప్రభ :— ఉపమేయము.

అనలము :— ఉపమానము.

చెడిపోవుట, సమయుట :— ఉభయసాధారణ ధర్మము.

అట్లు :— ఉపమావాచకము.

ఉపమాసామాగ్రియగు పదార్థ చతుష్టయము వాచ్యముగా నున్నది కావున పూర్ణోపమ యగుచున్నది.

వ్యా. వి. నీవు + రాజవు (నీవు + రాజు + వు)

సూ. ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున — వును—లును బహుత్వంబున—రము— లును నంతాగమంబులు ప్రాయికంబుగా నగును. (నీవు + రాజు + వు)

సూ. ఈ యాగమంబులు పరంబగునపు డుత్వంబున కత్వంబగు (నీవు + రాజ + వు = నీవు రాజవు.)

వ్యా. వి. పూటఁకున్ + పూఁటకున్ = పూఁటపూఁటకున్.

సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగును.

33. ఖర్వునకు = పొట్టివానికి (వామనునకు); ఉర్వీదానము = భూ దానము; కరకలిత సలిలకలశుండు = హస్తమునందు పొందఁబడిన జలభాజనము గలవాఁడు; ఆ + వితరణ ముఖరునిన్=దానగుణమునందు విఖ్యాతివహించినవానిని (దానగుణమునందుఁ బేరుమ్రోఁగినవాఁడని భావము); నిజవిచార యుక్తదనుజ రాజ్యచక్రుండు = తన యాలోచనతోఁ గూడియున్న రాక్షస సామ్రాజ్యము గలవాఁడు (రాక్షసరాజ్యము శుక్రుని యాలోచనతో నిలిచియున్నదని భావము); శుక్రుండు = శుక్రాచార్యులు (రాక్షసులకు గురువు); ఇట్లు + అనియెన్ = ఈ క్రింది విధముగా ననియెను.

తా. అట్లు పలుకుచున్న వామనునకు భూదానంబుసేయ నుపక్రమించి హస్తమున జలభాజనంబు ధరించియున్న బలిదానవేంద్రునకుఁ దన యాలోచనా బలముతోఁ గూడిన రాజ్యముగల శుక్రాచార్యుఁ డిట్లనియెను.

వ్యా. వి. ఆ + వితరణముఖరునిన్ = అవ్వితరణ ముఖరునిన్.

సూ. ఆ, ఈ, ఏ, యను సర్వనామంబులు త్రికంబునాఁబడు. త్రికంబు మీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. (ఉ॥ ఆ + విత

రణ) ద్విరుక్తంబగు హల్లుపరంబగునపుడా చ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. (ఉ॥ అవ్వితరణ.)

34. దనుజ+ఇంద్ర = రాక్షసేంద్రా! (బలికి సంబోధనము, గుణసంధి); ధరణీసురుఁడు+కాఁడు = బ్రాహ్మణుఁడు గాడు; దేవకార్యంబుఁ = దేవతల యొక్క కార్యమును; సాధించు కొఱకు = నెరవేర్చుట కొఱకు; అవ్యయుఁడు = విష్ణుమూర్తి; అదితి గర్భంబునఁ = దేవమాతయైన యదితి గర్భవాసమున; కశ్యపసూనుఁడు+ఐ = కశ్యపుఁడనెడి బ్రహ్మర్షికిఁ బుత్రుఁడై; దైత్యసంతతికి = రాక్షసకులమునకు; ఉపద్రవము = ప్రమాదము (విప్లవము); లక్ష్మిఁ = సిరిని; తేజంబుఁ = ప్రకాశమును (ప్రతిభను); నెలవుఁ = స్థానమును, నివాసమును; ఐశ్వర్యంబుఁ = సంపదను; వంచించి = మోసగించి; వాసవునకుఁ = ఇంద్రునకు; మొనసి = పూనుకొని; జగములు+ఎల్లఁ = లోకములనన్నింటిని; అఖిలకాయుఁడు+అగుచుఁ = అంతటను వ్యాపించిన శరీరము గలవాఁడై (విశ్వకాయుఁడై); విష్ణుసంసర్జనము+చేసి = విష్ణుమూర్తి పరమొనర్చి (విష్ణువశముఁజేసి); బడుగు=అశక్తుఁడు (శవమనియు నర్థాంతరము); పగిది=మాడ్కి, వోలె; ఎట్లు = ఏ విధముగా; బ్రతికెదు = జీవింతువు.

తా. దానవేంద్రా! ఈతఁడు సాధారణమైన భూసురుఁడుగాఁడు. దేవకార్యంబు నెరవేర్చుటకై యేతెంచిన సాక్షాద్విష్ణుమూర్తి. అదితి గర్భవాసమునఁ గశ్యపపుత్రుండై జన్మించెను. తెలియక దానమిచ్చెదనంటివి. నీవిచ్చెడి దానంబున దైత్యసంతతికి నెంతయే నష్టము వాటిల్లఁగలదు. ఇతండు నీ లక్ష్మిని తేజంబును స్థానంబును హరించి దేవేంద్రున కిచ్చును. మఱియు నితండు విశ్వకాయుఁడై పదత్రయమాత్రము గల్గిన నేల నెపంబున ముల్లోకంబుల నాక్రమించును. నీ సర్వస్వంబును విష్ణుపరంబుజేసి బడుగువోలె నెట్లు జీవింపఁగలవు.

వ్యా. వి. దనుజ+ఇంద్ర = దనుజేంద్ర (గుణసంధి).

సూ. 'అ' కారమునకు ఇ, ఉ, ఋ వర్ణములు పరమగునేని క్రమముగా ఏ, ఓ, అర్, వర్ణము లేకాదేశము లగును.

(ఏ, ఓ, అర్ వర్ణములకు గుణమని సంజ్ఞ).

35. ఒక్క పదంబునఁ+భూమియుఁ = ఒక్కయడుగున భూమండలంబును; ఒక్కటఁ+త్రిదివంబుఁ = మఱియొక యడుగున స్వర్గంబును; త్రొక్కి = పాదములతో నణఁగఁ ద్రొక్కి; ఉన్నతమూర్తిఁ = గొప్ప యాకారములో; దిక్కులు = దెసలు; గగనము = ఆకాశము; తాను+ఐ = సర్వత్ర తానై (విశ్వమంతయు నిండి); వెక్కసము+ఐ+ఉన్నఁ = అధికమై యుండఁగాఁ (దుస్సహమైయుండఁగా); ఎందు వెడలెదు=ఎచ్చటికిఁ బోయెదవు; చెపుము+అ = చెప్పుము.

తా. ఇతఁడొక్క యడుగున సర్వభూమండలంబును మఱియొక్కట స్వర్గంబును నాక్రమించి సర్వత్ర తానై నిండియుండఁగా నీ వెచ్చటకుఁ బోయెదవో చెప్పుమ.

వ్యా. వి. చెపుము + ఆ = చెపుమా.

సూ. సంప్రార్థనంబుల ముజ్జునకదాదులు విభాషనను ప్రయుక్తంబులగు (అఆ, ఇఈ, ఉఊ, అమ్మ, అయ్య, ఇత్యాదు లదాగులు)

36. ఇచ్చెదను + అని + పల్కి = తొలుత నిచ్చెదనని చెప్పి; ఈక + ఉన్నన్ = ఇయ్యకుండినచో; నరకంబునన్ = నరకవాసంబున; త్రోవన్ = త్రోపువడుటకు; (త్రోయఁబడుటకు); సమర్థుఁడవు + కాన = తగినవాఁడవయ్యెదవు కావున (నరకలోకనివాసమునకు యోగ్యుఁడ వయ్యెదవు గావున); ఏదానమునన్ = ఎట్టి దానముచే; నాశము + ఏతెంచున్ = నాశనము సంభవించునో; అదియును = అట్టి దానంబును; తత్త్వవిదులు = విజ్ఞానవేత్తలు (పెద్దలు); దానంబు + కాదు + అండ్రు = ఉచితమైన దానమని చెప్పరు; దానంబు = దానమును; యజ్ఞంబు = యజ్ఞమును; తపము=తపస్సు; కర్మంబు=(యజనయాజనాది షట్కర్మంబులును, వివాహాది షోడశకర్మంబులును); తాన్ = తాను (పైన వివరింపఁబడిన విషయములను నిర్వహించువాఁడు); విత్తవంతుఁడు + ఐ = ధనవంతుఁడై; తలఁపవలయున్ = తలపోయవలయును (ఆలోచింపవలయును, విచారింపవలయును); తన + ఇంటన్ + కల = తన గృహమందుఁగల; సర్వధనమును= విత్తమునంతటిని; ఐదుభాగములుగా విభజించి = ఐదుపాళ్లుజేసి; కామమునకు= పురుషార్థములలో నొకటియగు కామమునకు, ఇది స్త్రీవిషయకము; అర్థమునకు= పురుషప్రయోజనమునకు (కామముతప్ప సర్వలౌకిక ప్రయోజనములకు); ధర్మయశములకు = ధర్మమునకును, కీర్తికిని; ఆశ్రిత బృందములకు = ఆశ్రయించిన వారి సమూహమునకు (స్వజనులకు); సమతన్ = సమానముగా; పెట్టునట్టి = పంచియిచ్చునట్టి; పురుషుఁడు = మనుష్యుఁడు; ఇందున్ = ఇచ్చట (ఇహలోకములో); అందున్ = అచ్చట (పరలోకములో); పూర్ణుఁడై = పరిపూర్ణుఁడై (నిండినవాఁడై, శక్తిగలవాఁడై); మోదించున్ = సంతోషించును; తన్నుమాని చేఁత = తనకు హితముగాని కార్యముచేయుట; తగవు + కాదు = ఉచితముగాదు, న్యాయమైనదిగాదు (తనకుఁ జేటుతెచ్చెడి దానము యుక్తమైనది గాదని భావము. వృత్తికిఁ జేటును సమకూర్చెడి దానమును పెద్దలుగూడ మెచ్చుకొనరు. ఇదియొక సామెత. తనకుమాలిన ధర్మము మొదలుచెడిన బేరమగునని వ్యవహరింతురు. అలంకార మర్థాంతర న్యాస మగును.)

తా. ఇచ్చెదనని వాగ్దానముఁ జేసి యియ్యకుండినచో నీవు నరకలోకనివాసమునకుఁ దగినవాఁడ వయ్యెదవు. (నరకవాసంబు సంప్రాప్తంబగునని భావము); ఎట్టిదానంబున యజమానునకుఁ జేటు సంభవించునో యట్టిదానంబును

బెద్దలు మెచ్చుకొనరు. దాన యజ్ఞ తపఃకర్మంబులుచేయుట కుపక్రమించు వాఁడు ధనవంతుఁడై యుండవలయును. తనకుఁ గల విత్తమంతయుఁ గామము నకు నర్థమునకుఁ గీర్తికి స్వజనంబులకు సమముగాఁ బంచిపెట్టిన మానవుఁడు భయ లోకంబులలోను సుఖంబుండును. తనకు హితముగాని ధర్మము జేయుట యుక్త మైన కార్యముగాదు.

అలంకారము :— అర్థాంతరన్యాసము.

లక్షణము :— సామాన్యము విశేషము శబ్దములచే నిరూపింపఁబడి యున్నచో నర్థాంతరన్యాస మగును. అం దొకటి ప్రస్తుతము, వేఱొకటి యప్ర స్తుతము నగుచుండును. విశేషము ప్రస్తుతమై సామాన్య మప్రస్తుతమైనచో సామాన్యమున విశేష సమర్థనరూపభేదమగును. సామాన్యము ప్రస్తుతమై విశేషము ప్రస్తుతేతరమైనచో విశేషమున సామాన్య సమర్థన రూపభేదమగును.

లక్ష్యము :— "ఏ దానమున నాశ మే తెంచు నదియును దానంబుగా దం్రడు తత్త్వవిదులు" ఇత్యాది వాక్యంబులలోని భావము విశేష భావము. (ప్రస్తుతము) "తన్ను మానిచేత దగవుగాదు." ఈ భావము సామాన్యభావము. (అప్రస్తుతము) ఇట్లు విశేషభావము సామాన్యభావముచే సమర్థింపఁబడినది. కావున నిందలి యలంకార మర్థాంతరన్యాస మైనది.

వ్యా. వి. త్రోచక = త్రోవక

సూ. అగమాన్యచకారంబులక ద్విరుక్తంబులకు మత్తు పరంబగునపుడు —పవ—లగు.

37. బహ్వృచగీత + అర్థంబు = బహ్వృచగీతంబైన ధర్మంబును బోధిం చెడి యర్థము. (బహ్వృచగీత ఋగ్వేదములో నొకశాఖ); స + అవధా నుండవు + ఐ = ఎచ్చరికతోఁ గూడినవాఁడవై; బహుభంగి = వివిధము (అనేక విధములు గలది); ఆకర్ణింపుము = వినుము.

తా. మఱియు నీ విషయంబున ననేక విధంబులైన ధర్మంబులతోఁ గూడిన బహ్వృచగీతార్థంబును జెప్పెద వినుము.

వ్యా. వి. అదియును + క + కాక = అదియునుంగాక.

సూ. కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. ('అది యును') అనుదాని తుది నువర్ణము ద్రుతము. దానికిఁ బరముగా ద్రుతమే కలిగి ద్రుతకార్యములచేఁ బూర్ణబిందువు వచ్చి 'అదియునుం గాక' యను రూప మేర్ప డినది.

38. అధిప = రాజా! (బలిచక్రవర్తికి సంబోధనము); అంగీకరించినక = ఒప్పుకొనినయెడల (దానమిచ్చెదనని యంగీకరించినచో); అఖిలంబుక = తనకుఁ

గల సర్వస్వమును; పోవుచోన్ = పోవుచున్నయెడల; లేదు+అనినన్ = లేదని చెప్పినయెడల (మాటతప్పినయెడల); అనృతంబు+కాదు = అసత్యము గాదు; ఆత్మవృక్షంబు = జీవాత్మయనెడి వృక్షముయొక్క; మూలము = బోదె, (చెట్టుమొదలు); అనృతంబు = అసత్యము (అసత్యమనునది యాత్మవృక్షము యొక్క బోదెగా రూపింపఁబడినది); నిశ్చయము=ఇదినిజము; అనృతమూలము+ కల్గన్ = అసత్యమనెడి మూలముండినయెడల; ఆత్మ+చెడదు=జీవాత్మయనెడి వృక్షము నశింపదు (అసత్యమెల్లప్పుడును బ్రకాశించుచుండును గావున నసత్యము మూలముగా నుండవలయునని భావము); ఆత్మభూజంబునకు = జీవాత్మయనెడి వృక్షమునకు; సత్యము = సూనృతము; పుష్పఫలములు = పుష్పములు ఫలములుగాఁ బరిగణింపఁబడును; ఆ బ్రాను = ఆ యాత్మయనెడి వృక్షము; బ్రదుకమి = జీవింపమి; అదియున్ = ఫలపుష్పరూపమైన సత్యము; చెడును = నశించిపోవును (అసత్యమాధారముగాలేని సత్యము ప్రకాశింపదని భావము); ఫలపుష్పములులేక = ఫలపుష్పములు లేకపోయినను; పస+చెడి = నీరసించి; వృక్షంబు = ఆత్మయనెడి వృక్షము; మూలంబుతోన్ = అసత్యరూపంబైన బోదెతో; వృద్ధిన్+పొందున్+కాదె = వర్ధిల్లుచుండునుగదా; చేటున్=వినాశమును; కొఱఁతయున్ = లోటు; లఘిమయున్ = హీనత్వమును (లఘుత్వమును); చెందకుండన్ = ఏర్పడకుండ; ఇచ్చు = ఇచ్చునట్టి; పురుషుండు = మానవుఁడు; చెడకుండున్ = చెడిపోకుండును (నశించిపోఁడు); ఇద్ధచరిత=పరిశుద్ధమైన చరిత్రగలవాఁడా! (బలికి సంబోధనము). కాక=అట్లుకాక; అంచిత= ఒప్పిదమైన, యుక్తమైన; సత్య = సత్యముయొక్క; సంగతిన్ = గమనమును; అటంచున్ = అనుకొనుచు; నిజధనంబున్ = తన విత్తమునంతటిని; అర్థికిన్ = యాచించిన వానికి; ఇచ్చినన్ = ఇచ్చినయెడల; నీకు లేదు = (నీకు శూన్యమని భావము).

తా. దానమిచ్చెదనని యంగీకరించి సర్వంబును గోల్పోయెడి సందర్భమున లేదని మాట దప్పినచో దోషంబు గానేరదు. (అసత్యముగాఁ బరిగణింపఁబడదని భావము.) ఎట్లనఁగా జీవాత్మయనెడి వృక్షమునకు మూల మనృతము. సత్యము ఫలపుష్పములు. అసత్యముతోఁ గూడని సత్యము ప్రకాశింపవలయునన్న నసత్యము మూలమై యుండవలయును. అసత్యమాధారముగాలేని సత్యము ప్రకాశింపదు. సత్యరూపంబైన ఫలపుష్పములు లేకపోయినను నసత్యరూపంబైన మూలముతోఁ జెట్టు వృద్ధిపొందుచుండును గద! కావునఁ దనకు వినాశము, లఘుత్వము, లోటును, గలుగకుండ దానము చేయుట యుక్తంబు. అట్టి వాఁడు నశింపఁడు. అట్లుగాక సత్యమును నిలుపుటకై తనకుఁగల సర్వస్వమును నర్థికి ధారవోయునతం డీ లోకంబున శూన్యుండగును. (అసత్యమే

యజ్ఞానము. (ఇది లౌకికసంబంధమైనది.) సత్యము జ్ఞానస్వరూపము. (ఇది అలౌకిక సంబంధమైనది.) జీవి జననమరణప్రవాహంబును నజ్ఞానమూలంబునునగు ప్రపంచమున జన్మించి లౌకిక సంబంధమైన జన్మమును మూలముగాఁ జేసికొని జ్ఞానియై పరమాత్మస్వరూపమును దెలిసికొనును. జీవికి జ్ఞానోదయము గావలయునన్న నజ్ఞానప్రభవంబైన లౌకిక ప్రపంచము మూలముగా నుండవలయును. లౌకికంబైన జన్మములేనిదే యలౌకికమైన సత్యస్వరూపమును గనుగొనఁజాలఁడు. కావున నీకుఁగల సర్వస్వమును గోల్పోయి మూలమునకుసైతము చేటు దెచ్చుకొనినయెడల నీవు రిక్తుండవు నాధారరహితుండవునై సాధింపఁదలఁచుకొన్న సత్యమార్గమునకు దూరుండ వయ్యెదవని భావము.) ఇది ప్రపంచ న్యాయము గనుక సత్యవాక్యుఁడవైన నీ వసత్యము నాశ్రయించి యైనను నీ సంపదను గాపాడుకొనుమని శుక్రాచార్యుఁడు బలిసార్వభౌమునకు బహ్వృచగీతార్థంబును జెప్పెను.

అలంకారము-రూపకము.

లక్షణము:— ఉపమానోపమేయముల కభేదమును గల్పించుటగాని, ఉపమేయమునం దుపమానతాద్రూప్యమును చెప్పుటగాని రూపకాలంకారమగును. విషయ ముపమేయము (ప్రస్తుతము) విషయి యుపమానము (అప్రస్తుతము).

లక్ష్యము:— ఆత్మయనెడి వృక్షము, మూలమనెడి యసత్యము, ఫలపుష్పములనెడి సత్యము. ఉపమానోపమేయముల కభేదము చెప్పఁబడినది.

ఆత్మ, అసత్యము, సత్యము:— ఉపమేయములు (ప్రస్తుతములు).

వృక్షము, మూలము, ఫలపుష్పములు:— ఉపమానములు (అప్రస్తుతములు)

ఈ పద్యమునం దుపమేయంబులైన యాత్మాదులకును నుపమానంబులైన వృక్షాదులకును భేదములేనట్లు వర్ణింపఁబడినది కావున రూపకాలంకారమైనది.

వ్యా. వి. పస+చెడి = పససెడి.

సూ. ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగును.

39. సర్వమయినచోటన్ = అంగీకారాత్మకమైన సందర్భమున (తనకు మించిన ధర్మము గానప్పుడు); సర్వధనంబులు = యాచించిన సర్వవిషయంబులను; అడుగ లేదు+అటంచున్ = అడుగ లేదని చెప్పుచు; అనృతము+ఆడు+చెనటిన్ = అబద్ధముచెప్పు మూర్ఖుని; పందన్ = పిఱికివానిని; ఏమి+చెప్పన్= ఏమని చెప్పవలయును; వాఁడు = అట్టి మూర్ఖుఁడు; ప్రాణముతోడి శవము = జీవన్మృతుఁడు (జీవచ్ఛవము); వానిజన్మము+ఏల=అట్టి చెనటిజీవితము నిరర్థకమని భావము,

తా. సాధ్యంబయ్యు నంగీకారాత్మకంబైన సత్యంబును మఱుగు పఱచి లేదని చెప్పు మూర్ఖుఁడు జీవచ్ఛవముగాఁ బరిగణింపఁబడును. (కావున దేశకాలాదులఁ బరికించి పైఁజెప్పిన రెండు ధర్మములను యుక్తరీతి ననుసరించుట మంచిదని శుక్రుఁడు బలికెఁ జెప్పెను).

41. అధిప = (రాజా యని సంబోధనము); వారిజ + అక్షుల + అందున్ = స్త్రీలవిషయమునందు; వైవాహికముల + అందున్ = వివాహకార్యములయందు (వివాహ ప్రసంగములయందు); ప్రాణవిత్తమానభంగము + అందున్ = ప్రాణ సంకటమునందును, ధనరక్షణమందును, మానభంగమునందును; చకిత = భయ పడిన; గోకుల + అగ్రజన్మరక్షణము + అందున్ = గోబ్రాహ్మణ రక్షణార్థంబునను; బొంకన్ + వచ్చున్ = అసత్యము జెప్పవచ్చును; అఘమున్ + పొందఁడు = పాప మును బొందఁడు.

తా. మఱియు స్త్రీలవిషయంబునను, వివాహప్రసంగంబులయందును, ప్రాణసంకటము గల్గినప్పుడు, ధనరక్షణ సందర్భమున మానభంగ మేర్పడి నప్పుడు, గోబ్రాహ్మణ రక్షణార్థంబునను బొంకవచ్చును. అట్టి సందర్భములలో బొంకినప్పటికిని దోషంబుగాఁ బరిగణింపఁబడదు.

42. వదాన్య + ఉత్తమా! = గొప్ప యీవికాండ్రలో శ్రేష్ఠుఁడైనవాఁడా! కులమున్ = వంశమును; రాజ్యమున్ = ప్రభుత్వంబును; తేజమున్ = ప్రకాశ మును (కీర్తిని, ప్రతాపమును); నిలుపుము = నిలుపుకొనుము; ఈ + కుబ్జుండు = ఈ వామనుఁడు (పొట్టివాఁడు, మఱుగుజ్జు); విశ్వంభరుండు = విశ్వమునంతటిని భరించినవాఁడు; అలఁతిన్ + పోవఁడు = సులభముగాఁ బోవువాఁడు కాఁడు; త్రివిక్రమస్ఫురణవాఁడు + ఐ = మూఁడులోకములను మూఁడడుగులలో నాక్ర మించినవాఁడుగాఁ దోఁచి; నిండు బ్రహ్మాండమున్ = సంపూర్ణంబైన విశ్వంబు నంతటిని; మాన్పన్ + ఒకండు = మాన్పింపఁగలవాఁ డొక్కఁడు; కలఁడే = ఉన్నాఁడా? జననమరణ ప్రవాహరూపంబైన సర్వజగత్తును రూపుమాపఁగలఁ డని భావము.) నా పలుకులు = నా మాటలు; కర్ణంబులన్ = వీనులతో; ఆలకింపుము = వినుము; దానము + దానము = దానము గీనము = ఈ విధమైన దానము; వలదు = అవసరములేదు; వర్ణిన్ = బ్రహ్మచారిని; పనుపుము + అ = పంపి వేయుమా.

తా. నీ వంశమును, రాజ్యమును, కీర్తిని రక్షించుకొనుము. ఈ వామనుఁడు సామాన్యుఁడు గాఁడు. విశ్వరూపుఁడై ముల్లోకంబులను మూఁడడుగులతో నాక్రమించువాఁడుగాఁ దోఁచి యీ విశ్వంబునంతటిని మాన్పఁగలఁడు. కావున నా పలుకుల నాలకించి యిట్టి దానమును మానుకొని బ్రహ్మచారిని సాగనంపుమని శుక్రుఁడు చెప్పెను.

వ్యా. వి. దానము + దానము = దానము గీనము.

సూ. నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వ దీర్ఘంబులకు గిగిలగు.

వ్యా. వి. వదాన్య + ఉత్తమా = వదాన్యోత్తమా (గుణసంధి).

43. హితంబు = ప్రియము; కుల + ఆచార్యునకు = కులగురువగు శుక్రాచార్యునకు; క్షణమాత్ర నిమీలితలోచనుండు + ఐ=క్షణమాత్రము మూయఁబడిన నేత్రములు గలవాఁడై (క్షణమాత్రం బవధానమున నాలోచించినవాఁడై); యశస్వి = కీర్తిగలవాఁడు (బలిచక్రవర్తి).

వా. వి. కుల + ఆచార్యుఁడు = కులాచార్యుఁడు (సవర్ణ దీర్ఘసంధి).

44. నిజముల్ = సత్యమును; ఆనతిచ్చితి = సెలవిచ్చితివి; నీవు; మహాత్మక = గొప్పవాఁడా!, పూజ్యుఁడా! (శుక్రాచార్యునకు సంబోధనము); మహిని = భూమిలో; గృహస్థధర్మంబు = గృహస్థుఁడు పాటింపవలసిన యాచారము; ఇది + ఆ = ఇదియే (నీవు చెప్పినదియే యని భావము); అర్థంబుల్ + కామంబుల్ = చతుర్విధ పురుషార్థంబులలోఁ జేరిన యర్థకామాదులను; యశమును=కీర్తిని; వృత్తియుల్ = జీవనోపాయమును, వ్యాపారమును; (ఇది చతుర్విధము:—కృషి, పాశుపాల్యము, వాణిజ్యము, సేవ); ఏ + అది = ఎట్టిదానినైనను (యడాగమము - త్రికసంధి); ప్రార్థింపన్ = వేఁడుకొనఁగా; ఇత్తున్ + అనియున్ = ఇచ్చెదనని చెప్పియును; అర్థలోభంబునన్ = ధనమునందుఁగల లోభితనముచే: అర్థిన్ = వేఁడుకొనువానిని; యాచించువానిని; పొమ్మనుట + ఎట్లు = వెళ్లి పొమ్మనుట యెట్లు పొసఁగును; పలికి + లేదు + అనుట + కంటెన్ = ఇచ్చెదనని మాటయిచ్చి లేదని చెప్పుటకంటె; పాపము + ఎద్ది = పాపమేది (మఱొకపాపము లేదని భావము); ఎట్టి + దుష్కర్మునిన్ = ఎట్టి పాపాత్మునైనను; ఏన్ = నేను; భరించెదన్ + కాని = భరింతునుగాని (మోసెదనుగాని); సత్యహీనుని=అనృతవాదిని; మోవన్ + చాలన్ = మోయఁజాలను; అనుచున్ = అనిచెప్పుచు; తొల్లి = పూర్వము; భూదేవి; బ్రహ్మతోడన్; పలుకదే = పలికియుండలేదా, సమరమునన్ + ఉండి = యుద్ధభూమినుండి; తిరుగక = వెన్నిచ్చి పాఱిపోక; చచ్చుకంటెన్ = మరణించుటకన్న; పలికి బొంకక=ఇచ్చెదనని మాటనిచ్చి తప్పిపోక; నిజమునన్=సత్యవాక్యముతో; పరఁగుకంటె = ప్రవర్తించుకొనుటకంటె; మానధనులకున్ = మానమే ధనముగాఁ గలవారికి; భద్రంబు = క్షేమంబు; మఱియున్ + కలదె = మఱొకటి గలదా యని భావము.

తా. మహాత్మా! నీవు సత్యంబును జెప్పితివి. నీవు వక్కాణించినది పవిత్రంబైన గృహస్థధర్మము. అర్థకామ యశోవృత్తులలో నెయ్యది యర్థించినను నిత్తునని యిచ్చి డర్థలోభంబున నెట్లు గాదందును. తొలుత నిత్తునని మాట

నిచ్చి బొంకుటకంటె పాపము మఱొకటి లేదుగద. అనృతవాది నొక్కనిదక్క నెట్టి దుష్కర్మునైనను భరించెదనని బ్రహ్మతో భూదేవి మొఱపెట్టుకొనినది గద! మఱియు నభిమానధనులకు యుద్ధభూమినుండి వెన్నిచ్చి పాఱిపోక మరణించుటయు, పలికి బొంకక నిజమాడుటయుఁ బవిత్రంబైన ధర్మంబులును యశస్కరంబులును నగును.

వ్యా. వి. 1. అనతిచ్చితివి = అనతిచ్చితి.

సూ. భూతతద్ధర్మక్రియల మధ్యమపురుష వకారమునకు లోపంబు విభాషనగును.

వ్యా. వి. 2. ఇచ్చుదును = ఇత్తును.

సూ. చువర్ణంబుతోడి దుగ్ధకారంబునకుఁ దకారంబగు.

45. ధాత్రిని = భూమియందు; హాలికునకును = మడఁక దున్నువానికి, కృషీవలునకు (హాలికుఁడు రూపాంతరము); సుక్షేత్రమున్ = సారవంతమైన భూమియు (వరిమడి); బీజములున్ = విత్తనములు; ఒకటన్=ఒకటిగా; చేకుఱు భంగిన్ = లభ్యమైన మాడ్కి (హాలికునకు సారవంతమైన భూమియు మంచి విత్తనములు లభ్యమైన విధముగానని భావము); చిత్రముగన్=ఆశ్చర్యకరముగా; దాతకున్ = దానముసేయువానికి (దానకర్తకు); ఈవియున్ = త్యాగము; పాత్రమున్ = యోగ్యతయు; సమకూరునట్టి = కలుగునట్టి; భాగ్యము+కలదు +ఏ = అదృష్టముగలదా (అంతకన్న నదృష్టము మఱొకటి లేదని భావము); (ఉపమాలంకారము).

తా. లోకములో హాలికునకు సారవంతమైన భూమియు మంచి విత్తనములు లభ్యమైనమాడ్కి దానకర్త కీవియు నీవికిఁ దగిన యోగ్యతయు రెండును సమకూరినయెడల నాతని కంతకంటె యదృష్టము మఱొకటి యుండఁబోదు.

<u>అలంకారము:</u>—ఉపమాలంకారము;—దాత: ఉపమేయము, హాలికుఁడు: ఉపమానము. ఉపమానోపమేయములకు సొగసైన సామ్యము స్పష్టముగా నిరూపింపఁబడినది.

వ్యా. వి. దాతకున్ + ఈవియు = దాతకీవియు; దాతకునీవియు.

సూ. ప్రథమేతరవిభక్తి శత్రర్థక చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును.

46. భార్గవా! = (శుక్రాచార్యునకు సంబోధనము); కారే+రాజులు = రాజులుగాలేదా? (ఎందఱెందఱో దేశములకు రాజులైరని భావము); రాజ్యముల్+కలుగవే = రాజ్యములు గలిగియుండినవిగదా! (ఆ రాజులందఱు

రాజ్యములను గలిగియుండిరని భావము); గర్వ+ఉన్నతిన్=గర్వాతిశయమును; పొందరే = పొందియుండిరిగదా; వారు = అట్టిరాజులు; ఏరీ = ఎచ్చట నున్నారు? (ఇప్పు డెచ్చట నున్నారని భావము); సిరిన్ = సంపదను; మూట గట్టికొని = గుడ్డలో ముడివేసికొని; పోవన్+చాలిరి+ఏ = పోఁగల్గినారా; పోయినారా; భూమిపైన్ = ఈ భూమిమీఁద (లోకములో); పేరు+ఐనన్ = వారి పేరైనను; కలదు+ఏ=ఉన్నదా? (వారి నామములైనను మిగిలియుండ లేదని భావము); శిబిప్రముఖులున్=శిబిప్రభృతి ముఖ్యులు; ప్రీతిన్=ప్రియముతో; యశఃకాములై = కీర్తినాసించి; కోర్కులు = ఈప్సితములు; ఈరే = ఇయ్య లేదా; వారలన్ = అట్టి శిబిప్రభృతులను; ఈ+కాలమున్ = ఇక్కాలమునన్= ఈ కాలమునందైనను, మఱచిరి+ఏ = విస్మరించినారా? (మఱచిపోలేదని భావము).

తా. పూర్వమెందఱెందఱో రాజులై యుద్ధతితో రాజ్యాధిపత్యమును వహించి పరిపాలించిరి. వారి భోగంబులిప్పుడు కాలగ్రస్తంబులయ్యెను. వారు గతించునప్పుడు గడించిన సిరిసంపదలను మూటగట్టికొని పోఁగల్గిరా? లోకములో వారిపేరైనను నిలచియున్నదా? కాని శిబిప్రభృతులైన సాధుమూర్తులు తమ ప్రాణంబులను సైతము లెక్కసేయక ప్రాణులకు సమర్పించి మేలును గూర్చిరి కదా! అట్టి పుణ్యాత్ముల నీకాలంబునందైనను మఱచినారా?

వ్యా. వి. 1. గర్వ+ఉన్నతిన్ = గర్వోన్నతిన్ (గుణసంధి). ఈ+కాలమున్ = ఇక్కాలమున్ (త్రికసంధి).

వ్యా. వి. 2. న+అపాయము = నాపాయము (మయూరవ్యంసకాది గణములోఁ జేరిన సమాసవిశేషము.)

సూ. అజాది సుబంతము పరమగునేని 'నఞ్'యొక్క 'న'కారము 'అన్'గాను, హలాది సుబంతము పరమగునేని 'అ'గాను మాఱును. (నఞ్+ఏకము = అనేకము; నఞ్+మంగళము = అమంగళము ఇత్యాదులు) కాని— నఞ్ర్థకమగు నవ్యయమైన 'న'శబ్ద మొకటి గలదు. అదియును సుబంతముతో సమసించును. 'న'శబ్దము 'నఞ్' కాదు కావున 'అన్' 'అ' ఆదేశములు రావు. (న+ఏకము = నైకము, ఇత్యాదులు) కావున 'న'శబ్దముతోఁ జేయఁబడు సమాసము మయూరవ్యంసకాంతర్గత మగును. (నైకము, నైకధా, నాతిదూర మిత్యాదులు) ప్రస్తుత ప్రయోగము "నాపాయము" గూడ మయూరవ్యంసక గణములోఁ జేరినది.

47. ఉడుగని = ఎడతెగని; క్రతువులన్ = యజ్ఞములచేతను; వ్రతములన్ = ఉపవాసాది పుణ్యకర్మములచేత (నోములచేత); పొడగనన్+చన నట్టి= తేటి చూడరానట్టి; పొడవు=మేటి, గొప్పవాడు (ఉత్కృష్టుఁడనియు);

పొడవునన్ = రూపముచే, ఆకృతిచే; కుఱుచ + ఐ = మఱుగుజ్జుగా (బొడకట్టి (వామనుఁడై); అడిగెడిన్ + అఁట = యాచించుచున్నాఁడు గావున; నను బోఁటికిన్ = నాయంటి వానికి; ఇష్ట + అర్థంబుల్ = ప్రియమైన వస్తువులు; ఇడన్ + రాదు + ఎ = ఇచ్చుట యుక్తము గదా!

తా. మహాత్మా! ఎడతెగని యజ్ఞముల చేతను; తెలిపిలేని వ్రత నియమంబుల చేతను, దేవ చూడరానట్టి యీ యున్నతమూర్తి రూపంబుచేత కుబ్జుండై యాచించుచున్నప్పు డతనికిఁ బ్రియమైన వస్తువులను బ్రసాదించుట నాబోఁటి వానికి యుక్తంబు గదా!

వ్యా. వి. ఇష్ట + అర్థంబుల్ = ఇష్టార్థంబుల్ (సవర్ణదీర్ఘ సంధి).

48. ఆదిన్ = మొట్టమొదట, ప్రారంభ దశలో (లక్ష్మీదేవిని ప్రణయ కలహమువలన విముఖినిగాఁ జేయునట్టి సందర్భమునకు మొట్టమొదట యని భావము); శ్రీసతి = లక్ష్మీదేవియొక్క; కొప్పుపైన్ = ధమ్మిల్లముపై; తనువుపైన్ = లక్ష్మి శరీరముపై; అంస + ఉత్తరీయంబుపైన్ = లక్ష్మి పైఁటపై; పాద + అబ్జంబులపై = అడుగుఁదమ్ములపై; కపోల తటిపై = చెక్కిళ్లపై; పాలిండ్లపై = స్తనములపై; నూత్న మర్యాదన్ + చెందు + కరంబు = నూత్న గౌరవమును బొందిన శ్రీ మహావిష్ణు హస్తంబు; క్రింది + అగుటన్ = అడుగున నుండుటయు; మీఁదై = పైభాగమున నుండినదై; నా కరంబు = నా హస్తము; ఉంటన్ = ఉండుటయు; మేల్ + కాదు + ఏ = మంచిది గదా! (అతిశయమైనది గదా యని భావము) రాజ్యముద్ + రాజ్యముద్ = రాజ్యము గీజ్యము = (ఈ తృణప్రాయమైన రాజ్యమని నింద); సతతమే = శాశ్వతమైనదా! స్థిరమైనదా; కాయంబు = శరీరము; నాపాయమె = అపాయములేనిదాని? (నిత్యమైనది కాదని భావము.)

తా. శ్రీ మహావిష్ణువు ప్రణయ కుపితయగు లక్ష్మి ననునయించుటయందు నామె ధమ్మిల్లమును నిమిరినాఁడు. శరీరమును స్పృశించినాఁడు. స్తన స్పర్శన లాలసత్వముచేఁ బైఁటను దొలఁగించినాఁడు. అప్పటికిని లక్ష్మి సుముఖి గాలేదు. ఇఁక ప్రయోజనము లేదని నిస్పృహతోఁ బాదముల బట్టుకొని నాఁడు. హరి పాదములంటఁగా నితఁడు నా నాథుఁడే గదా యని ప్రియంబుతో భర్త పాదంబులంటఁగా సుముఖిని గాకుండుట యుచితము గాదని లక్ష్మి యించుక ప్రసన్నయైనట్లు హావ భావ ముఖ వికారాదులచేత నానుకూల్యమును బ్రకటించినది. అట్లు లక్ష్మి సుముఖియైన వైఖరని హరి గ్రహించి చెక్కిళ్లను గోట మీటెను. నాయిక యిప్పుడు ప్రసన్నగాన నాతనిని వారింపలేదు. ఇఁక మిగిలిన కార్యము సుకరమని హరి పాలిండ్ల నంటినాఁడు. అట్టి విశిష్టమైన శ్రీ హరి కరంబు నా కరంబునకుఁ గ్రిందై యుండుట నా భాగ్యంబు గదా! తృణ

ప్రాయంబైన యీ రాజ్యము శాశ్వతమైనది కాదు. శరీరంబు నిత్యమైనది గాదని బలి సార్వభౌముం డాచార్యునకు విన్నవించు కొనియెను.

(నూత్న శబ్ద సారస్యము:— లక్ష్మి ప్రణయ కుపిత. ప్రతికూల. అట్టిది ప్రసన్నయై తనకు బాహ్య శృంగారమునకు గౌరవ గల్గించినది కావున నేటి మర్యాద పూర్వ మర్యాదకంటె నూత్నమైనదని భావము. దానంజేసి "నూత్న మర్యాదం జెందు కరం" బని పోతన ప్రయోగించియుండనోపును.)

వ్యా. వి. అంస+ఉత్తరీయంబు = అంసోత్తరీయంబు (గుణ సంధి.) రాజ్యము+రాజ్యము = రాజ్యముగీజ్యము

సూ. నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వ దీర్ఘంబులకు గి గీ లగు.

49. నిరయంబు+ఐనన్ = నరకంబు సంప్రాప్తించినను; నిబంధము+ఐనన్ = బంధన మేర్పడినను; ధరణీ నిర్మూలనంబు+ఐనన్ = భూమియంతయు నశించిపోయినను; దుర్మరణంబు+ఐనన్ = ఘోరమైన మరణము సంప్రాప్తించినను; కుల+అంతము+ఐనన్ = వంశంబంతరించిపోయినను; నిజము+రానిమ్ము+పోనిమ్ము = సత్యము దక్కినను దక్కక పోయినను; హరుఁడు+ఐనన్ = శివుఁడైనను; హరి+ఐనన్ = విష్ణువైనను; నీరజభవుండు= కమలోద్భవుఁడు, బ్రహ్మ; అభ్యాగతుండు+ఐనన్ = సమయమునకు వచ్చి యాచించిన వాఁడైనను; నాదు జిహ్వ = నా నాలుక; తిరుగన్+నేరదు = తిరుగదు (మాట తప్పదని భావము); వినుమా; ధీవర్య = బుద్ధిమంతుడా! వేయేటికిన్ = వేయేల;

తా. మహాత్మా! నే నొనర్చెడు దానంబు వలన నరకంబు సంప్రాప్తించినను, బంధనం బేర్పడినను, దుర్మరణంబు గల్గినను, వంశంబు సమూలంబుగ నంతరించినను, సత్యంబు దక్కినను దక్కకపోయినను, త్రిమూర్తులడ్డంబైనను నే నాడి తప్పువాఁడను గాను.

వ్యా. వి. అభి+ఆగతుఁడు = అభ్యాగతుఁడు (యణాదేశసంధి).

**సూ.** ఇ, ఉ, ఋ, ౡ వర్ణములకు సవర్ణములుగాని యచ్చులు పరమైన యెడల య, వ, ర, ల వర్ణములు క్రమముగా వచ్చును. (దీనిని సంస్కృత వ్యాకరణజ్ఞులు యణాదేశసంధి యందురు).

వ్యా. వి. కుల+అంతంబు = కులాంతంబు (సవర్ణదీర్ఘ సంధి).

50. విమలచరిత = నిర్మలమైన చరిత్రగలవాఁడా! (శుక్రునకు సంబోధనము); నొడివిన+అంత+పట్టు = చెప్పినంత స్థానము; నుసలక = ఆలస్యము

చేయక; ఇచ్చుచోన్ = ఇచ్చిన యెడల; ఏల = ఎందులకు; కట్టున్ = కట్టి వేయును, బంధించును; విష్ణుఁడు; ఏటిమాట = ఇదెక్కడిమాట; కట్టెన్ + ఏని = ఒకవేళ బంధించినచో; తాన = ఆ శ్రీహరియే; కరుణించి = కనికరించి; విడుచును = విడిచిపెట్టును; విముక్తుని జేయును; విడువక + ఉండెన్ + ఇమ్ము= ఒకవేళ విడువక పోనిమ్ము. (బలి నిశ్చితాభిప్రాయమునకు వచ్చుచున్నాఁడు.)

తా. పూజ్యుఁడా! అడిగిన దానంబును శీఘ్రమే యిచ్చిన యెడల హరి నన్నేల బంధించును? ఇదెక్కడి విషయము. ఒకవేళ నన్ను బంధించినను శ్రీ హరియే కనికరించి విడిచిపెట్టును. విడువకున్నచో నాకేమియుఁ జింత లేదు.

51. మేరువు = మేరుపర్వతము; తలక్రిందు + ఐనను = తిరుగఁబడినను; పారావారంబులు = సముద్రములు; ఇంకెన్ + పాఱినన్ = ఇంకిపోయినప్పటి కిని; లోలోన్ = లోలోపల; ధారుణి = భూమి; రజము + ఐ + పోయినన్ = ధూళియైపోయినను; తార + అధ్వము = ఆకాశము; బద్ధము + ఐనన్ = బంధింపఁ బడినను; తప్పక = ఆడినమాటను దప్పక; ఇత్తున్ = ఇచ్చెదను.

తా. మేరుపర్వతము తిరుగఁబడినను, సముద్రంబు లింకిఁ బాఱినను, భూమి లోలోపల ధూళియైనను, ఆకసము బంధింపఁబడినను, మాటఁదప్పక దానము నిచ్చెదనని బలిసార్వభౌముఁడు శుక్రాచార్యునకు నొక్కి వక్కాణించెను.

వ్యా. వి. తార + అధ్వము = తారాధ్వము (సవర్ణదీర్ఘసంధి).

వ్యా. వి. ఇచ్చుదున్ = ఇత్తును.

సూ. చువర్ణంబుతోడి దుగ్ధకారంబునకుఁ దకారంబగు.

52. సత్తమా! = మంచిమనస్సు గలవాఁడా! పూజ్యుఁడా! (శుక్రాచార్యునకు సంబోధనము); ఎన్నఁడున్ = ఎప్పుడును; పరున్ = ఇతరుని; వేఁడన్ + పోఁడు + అఁట = యాచింపఁ బోఁడఁట; ఏకలుండు + అఁట = ఒంటరివాఁడఁట (ఏకాకియఁట); కన్నవారు=తల్లిదండ్రులు; అన్నదమ్ములున్ + ఐనన్=సోదరు లైనను; లేరు + అఁట; అన్నివిద్యల = సర్వవిద్యలయొక్క; మూలగోష్ఠిన్ = మూలమైన తత్త్వమును, మూలమైన సారమును; ఎఱింగిన = తెలిసికొనిన; ప్రోడ = ప్రగల్భుఁడైన, నిపుణుఁడైన, వివేకియైన; గుజ్జు + అఁట = పొట్టివాఁడఁట; చేతులు + ఒగ్గి=చేతులుసాఁచి; వసింపన్ = ఉండగా; ఈ చిన్ని పాపనిన్ = ఈ పసిబిడ్డను; త్రోసిపుచ్చఁగన్=త్రోసివేయుటకు; చిత్తము=మనస్సు; ఒల్లదు = అంగీకరింపదు.

తా. పూజ్యుఁడా! ఈ బాలుఁ డితరులను యాచింపఁబోఁడఁట; దగ్గఱి బంధువులు లేరఁట. ఒంటరివాఁడఁట. సర్వవిద్యల సారమెఱింగిన నిపుణుఁ

డంట. ఇట్టి కుబ్జుండు చేతులొగ్గి నన్ను వేడుకొనఁగా నెట్లు త్రోసిపుచ్చఁ గలను.

వ్యా. వి. మూలగోష్ఠిక్ + ఎఱింగి = మూలగోష్ఠి న్నెఱింగి.

సూ. కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి. (ప్రౌఢవ్యాకరణము - సంధి 3.)

(బాలవ్యాకరణమునఁ గొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడి యెడి నని నిమిత్తమేమియును నుడువకయే చిన్నయసూరి సూత్రించెను గావున నచ్చు పరంబగుచున్నను హల్లు పరంబగుచున్నను నకారద్వయముండవచ్చునని తేలుచున్నది. కనుక నీ ప్రయోగము బాలవ్యాకరణ సూత్రము చేతనే గతార్థ మగును. కవిత్రయేతర ప్రయోగంబులలో నిట్టి ప్రయోగంబులు గన్పించుచున్నవి. ప్రస్తుత పాఠ్యభాగమున నిట్టి ప్రయోగము లవిరళముగా నున్నవి.

వ్యా. వి. 2 అన్నదమ్ములు = అన్నయును దమ్ముఁడును.

సూ. ఉభయపదార్థప్రధానంబు ద్వంద్వంబు నాఁబడు. ద్వంద్వంబునం బదంబుపయి పరుషంబులకు గసడదవ లగును.

(ఉ॥ అన్న + తమ్ములు = అన్నదమ్ములు)

## ఛందస్సు

మత్తకోకిలము:— 'రస జజ భర' గణములు గల్గిన నాలుగు పాదము లుండును. ప్రథమగణ ప్రథమాక్షరమునకును పదునొకండవ యక్షరమునకును యతిచెల్లును. ప్రాసనియమముగా నుండును.

| ∪ | । | ∪ | । | । | ∪ | । | ∪ | । | । | ∪ | । | ∪ | । | । | ∪ | । | ∪ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఎ | న్న | డుం | బ | రు | వేఁ | డఁ | బోఁ | డఁ | ట | యే | క | లుం | డఁ | ట | క | న్న | వా |

| | |
|---|---|
| ∪ । ∪ | రగణము. |
| । । ∪ | సగణము. |
| । ∪ । | జగణము. |
| । ∪ । | జగణము. |
| ∪ । । | భగణము. |
| ∪ । ∪ | రగణము. |

53. సత్యపదవీప్రమాణ తత్పరుండును = సత్యమార్గముయొక్క ప్రమాణమునం దాసక్తిగలవాఁడును; వితరణ కుతూహల సత్వరుండును = దానము చేయుటయందుఁగల యుత్సాహముచేతఁ ద్వరపెట్టఁబడిన వాఁడును; విమలయశస్కుఁడును = నిర్మలమైన కీర్తితోఁ గూడుకొనినవాఁడును; దృఢమనస్కుండును = స్థిరమైన చిత్తముగలవాఁడును; నియత సత్యసంధుడును = నియమము

గల సత్యవ్రతము ననుసరించువాఁడును; అర్థిజనకమల బంధుండును=యాచకులకు సూర్యునివంటి వాఁడును (యాచకుల నెడి కమలములకు సూర్యునివంటివాఁడని భావము); మదీయ=నాయొక్క; శాసనంబును=ఆజ్ఞను; అతిక్రమించితివి=మీఱితివి; ఉల్లంఘించితివి; శీఘ్రకాలంబునన్ = అచిరకాలములో; పదభ్రష్టుండవు=స్థానభ్రష్టుఁడవు; గురుశాపతప్తుండు + అయ్యు = గురువు పెట్టిన శాపముచేఁ దపింపఁజేయఁబడిన వాఁడయ్యు; అనృతమార్గంబునకు = అసత్యమార్గమునకు; అభిముఖుండు + కాక + ఉండెన్ = సుముఖుఁడుగాక యుండెను.

54. బ్రదుకఁ వచ్చున్ + కాక = జీవింపవచ్చును గాక; బహుబంధనములు + ఐనన్ = అనేక విధంబులైన నిర్బంధములైనను; వచ్చున్ + కాక = ఏర్పడవచ్చును గాక; లేమి = దారిద్ర్యము; వచ్చున్ + కాక = సంభవించును గాక; జీవ ధనములు = ప్రాణమును, ధనమును (ద్వంద్వ సమాసము); ఐనన్= ఐనప్పటికిని; చెడున్ + కాక=నశించును గాక; పడున్ + కాక=పతనమైపోవును గాక; మానధనులు = మానమే ధనముగాఁ గలవారు; మాటన్ + తిరుగ లేరు= ఆడిన మాటను దప్ప లేరు.

తా. నిర్బంధము లేర్పడినను, దారిద్ర్యము సంభవించినను జీవింప వచ్చును. ప్రాణమును గోల్పోవుటకును ధనమును బోగొట్టుకొనుటకును నంగీకరింతురు గాని మానధను లసత్యమాడుట కంగీకరింపరు.

56. దనుజలోక నాథు = రాక్షస రాజైన బలిసార్వభౌముని యొక్క; దయిత =భార్యయైన; వింధ్యావళి; రాజవదన=చంద్రునివంటి ముఖముగలదియు (చంద్రముఖి); మదమరాళ గమన=మదించినహంస గమనముగలదియు; వటుని = బ్రహ్మచారియొక్క; కాళ్ళు గడుగన్ = పాదములను గడుగుటకు; భర్త = నాథునియొక్క; సన్నన్ = సైగను (హస్తాదులతోఁ జేయు సంజ్ఞను) ఎఱిఁగి = గ్రహించి, తెలిసికొని; వర = శ్రేష్ఠమైన; హేమ ఘటమునన్ = బంగారు చెంబుతో; జలము + తెచ్చెన్ = ఉదకమును దెచ్చెను.

తా. దానవ సార్వభౌముఁడైన బలిచక్రవర్తి ధర్మపత్ని భర్త నిర్ణయం బెఱింగి బ్రహ్మచారి పాదంబులఁ గడుగుటకు సలిల పూర్ణంబైన హేమ ఘటమును దెచ్చెను.

57. ఆ + అవసరంబున = ఆయ్యవసరంబున= ఆ సమయమున (యడాగమము - త్రికసంధి) కపట వటునకు = కృత్రిమ బ్రహ్మచారికి; ఆ + దానవ + ఇంద్రుండు = అద్దానవేంద్రుండు=ఆ రాక్షసరాజు (బలిసార్వభౌముడు); ఇట్లు + అనియెన్ = ఈక్రింది విధముగాఁ జెప్పెను;

వ్యా. వి. ఆ+దానవేంద్రునకు = అద్దానవేంద్రునకు (త్రికసంధి); దానవ+ఇంద్రునకు = దానవేంద్రునకు (గుణసంధి)

58. మాణవక+ఉత్తమా = బాలకోత్తమా! (వామనునకు సంబోధనము); రమ్ము+ఆ = రమ్మా = ఇటు రమ్ము; లెమ్ము+ఆ = లెమ్మా = పైకి లెమ్ము; నీ వాంఛితంబుఁ = నీ కోరికను; లేదు+అనక = లేదని చెప్పక; ఇత్తుఁ = ఇచ్చెదను; అడుగులఁ = పాదములను; తెమ్ము+ఆ = తెమ్మా = ఇటు తెమ్ము; ఇటు+రాఁ+ఇమ్ము = దగ్గరకు రానిమ్ము; కడుగంగఁ+వలయుఁ = జలముచే బాదములను గడుగవలయును; ఏటికిఁ = ఎందులకు; తడయకఁ = ఆలస్యము చేయవలయును (ఆలస్య మెందులకని భావము).

తా. ఓ బాలకోత్తమా, ఆలస్యమేల? ఇటు రమ్ము. నీ కోరిక నీడేర్చెదను. జలంబుతోఁ గడుగవలయును గాన నీ పాదంబుల నిటు తెమ్మని బలి సార్వభౌముఁడు వామను పాదంబులఁ గడుగ నుపక్రమించెను.

మాణవక+ఉత్తమ = మాణవకోత్తమ (గుణసంధి) ఇచ్చెదుఁ = ఇత్తుఁ = (చు దు - త).

60. బలి దైత్య+ఇంద్ర = రాక్షస రాజైన బలి సార్వభౌమునియొక్క; కరద్వయీ = చేతులయొక్క జంటచేత; కృత = చేయఁబడిన; జల = జలముతో; ప్రక్షాళన = కడుగుట యనెడి వ్యాపారముయొక్క; వ్యాప్తికిఁ = వ్యాపించిన జలప్రసరణమునకు; జలజాత+అక్షుఁడు = కమలనేత్రుడు (విష్ణుమూర్తి); యోగి = యోగులచేతను; సుమనస్ = దేవతలచేతను; సంప్రార్థిత = కోరఁబడినదియైన; శ్రీదముఁ = ఐశ్వర్యము నిచ్చునదియును; కలిత = ఒప్పుచున్న; ఆనమ్ర = వంచఁబడిన; రమా = లక్ష్మీదేవియొక్క; లలాటపదవీ = ఫాలభాగము నందు (నుదుటియందు); కస్తూరికాశాదముఁ = కస్తూరీ పంకముగలది (లక్ష్మి తన నుదుటనున్న కస్తూరిబొట్టు బాగుగా నంటుకొనునట్లు హరి పాదములకు నమస్కరించుచుండునని భావము. (ఇచ్చట:- కస్తూరికా = కస్తూరికా తిలకముయొక్క, ఆశా = కోరికను; దమున్ = ఇచ్చునదియునని చెప్పవచ్చును.) నలిన+ఆమోదము = కమలములయొక్క సువాసన గలది, రత్ననూపురిత=రత్ననూపురములుగాఁ జేయఁబడిన (రత్న పుటందియలుగా జేయఁబడిన); నానా వేదముఁ = అనేక వేదములు గలది (వేదములు శ్రీహరిపాదములకు రత్న పుటందియలుగా నున్నవని భావము); పాదముఁ = అట్టి విశిష్టమైన శ్రీహరి పాదమును; చాఁచెఁ = చాఁచెను

తా. దానవ సార్వభౌముండైన బలి రెండు హస్తములతోఁ బాదములఁ గడుగుట కుపక్రమింపఁగా, విష్ణువు యోగులకును దేవతలకును నైశ్వర్యమును బ్రసా-

దించునట్టిదియు, లక్ష్మీదేవియొక్క నుదుటి కస్తూరీ పంకమును గల్గినట్టిదియు, రత్నపుటందియలుగాఁ జేయఁబడిన వేదములు గలిగినట్టిదియు నలినామోదంబును నైన పాదంబును జాఁచెను.

వ్యా. వి. దైత్య+ఇంద్ర = దైత్యేంద్ర (గుణసంధి); జలజాత+అక్షుఁడు = జలజాతాక్షుఁడు (సవర్ణదీర్ఘసంధి).

61. సురలోక సముద్ధరణము = దేవలోకము నుద్ధరించునట్టిదియు; నిరత శ్రీకరణము = ఎల్లప్పుడును నైశ్వర్యమును బ్రసాదించునదియు; అఖిలనిగమ+అంత+అలంకరణము = అఖిల వేదాంతములను నలంకరించినదియు; భవసంహరణము = సంసారంబును ఛేదించునదియును; హరిచరణముల్ = విష్ణుపాదంబును; అసుర+ఉత్తముఁడు = రాక్షసోత్తముఁడు (బలి); నీటన్ = జలంబులతో; కడిగెన్ = కడిగెను.

తా. దేవలోకము నుద్ధరించునట్టిదియు, నెల్లప్పుడు నైశ్వర్యములను గలిగించునదియు, నఖిల వేదాంతంబులచే నలంకరింపఁబడినదియు, సంసారసాగరంబునుండి విముక్తిని బ్రసాదించునట్టిదియు నగు శ్రీహరి పాదంబులను రాక్షసేశ్వరుఁడు జలంబులతోఁ గడిగెను.

వ్యా. వి. అసుర+ఉత్తముఁడు = అసురోత్తముఁడు (గుణసంధి); నిగమ+అంత+అలంకరణము = నిగమాంతాలంకరణము (సవర్ణదీర్ఘసంధి).

62. ధరణీసుర = బ్రాహ్మణునియొక్క; దక్షిణచరణ ప్రక్షాళనంబు+చేసి = కుడికాలును గడిగి; వామపాదంబు = ఎడమకాలు; తత్ = అట్లుకడిగిన పావన జలంబు = పవిత్రంబైన యుదకంబు; వార్చి = ఆచమనముఁజేసి; దేశ కాల+ఆది పరిగణనంబు+చేసి = దేశము, కాలము మొదలగువానియొక్క గణననుజేసి (సంకల్పముఁ జెప్పుకొనియని భావము.)

తా. బ్రాహ్మణోత్తముండైన విష్ణుపాదంబులను గడిగి యా నీటిని నెత్తిమీఁదఁ జల్లుకొని, యాచమనముఁ జేసి, సంకల్పముఁ జెప్పుకొని, దానము **చేయుట** కుద్యుక్తుఁ డయ్యెను.

63. దనుజ+ఈశ్వరుండు = దనుజేశ్వరుండు = రాక్షసప్రభువు (బలి); క్రియాక్షిప్రుండు+ఐ = దానక్రియచేత వేగిరింపఁబడినవాఁడై (దానమును జరుపుటలోఁ ద్వరకలవాఁడై); విప్రాయ = బ్రాహ్మణునికొఱకు; ప్రకటవ్రతాయ = ప్రకటింపఁబడిన వ్రతము గలిగినవానికి (స్పష్టమైన నియమముగలవానికిని; విష్ణుస్వరూపాయ = విష్ణుస్వరూపుండైన వానికిని; వేదప్రామాణ్యవిదే = **వేదములయొక్క** ప్రమాణమును దెలిసికొన్నవానికిని; భవతే = నీకొఱకు;

త్రిపాద ధరణిన్ = మూఁడడుగుల ప్రమాణము గలిగిన భూమిని; దాస్యామి = ఇచ్చుచున్నాను; అంచున్ = అనిచెప్పుచు; వడుగున్ = బ్రహ్మచారిని; చే సాఁచి = చేతులుచాఁపి; పూజించి = అర్చించి; బ్రహ్మప్రీతమ్మని = బ్రహ్మార్పణంబని (బ్రహ్మస్వరూపియగు భగవంతుని కిది తృప్తిని కలిగించునదియగుఁ గాక యని); భువనంబు = లోకంబు; ఆశ్చర్యమును బొందునట్లు; ధార + పోసెన్ = దానమును జేసెను.

తా. బ్రాహ్మణుఁడవును, స్పష్టమైన వ్రతనియమము గలవాఁడవును, విష్ణుస్వరూపుఁడవును, వేదప్రామాణ్యమును దెలిసినవాఁడవును నగు నీకొఱకు (నీకు) మూఁడడుగుల ప్రమాణముగల భూమిని యిచ్చుచున్నానని బలిసార్వభౌముఁడు బ్రహ్మార్పణమని పదత్రయమాత్రంబైన భూమిని వామనునకు ధారవోసెను.

వ్యా. వి. దనుజ + ఈశ్వరుఁడు = దనుజేశ్వరుఁడు (గుణసంధి).

65. నీరధారన్ = నీటిచాలును; పడఁగన్ + ఈక = పడనియ్యక (కలశరంధ్రమునుండి నీటిని పడనియ్యక); కలశరంధ్రమున్ = జారీకొమ్ము యొక్క రంధ్రమును; అఁపఁగాను = అటంకపఱచఁగా: తెలిసి = ఆ విషయమును దెలిసికొని; హరియున్ = విష్ణువు (వామనుడు): కావ్య = శుక్రాచార్యుని యొక్క; నేత్రమున్ = కంటిని; అఁటన్ = ఆ కలశరంధ్రమున, కుశ + అగ్రంబునన్ = దర్భ చివరిభాగముతో (కొనతో); అడువన్ = తాడింపఁగా (అణపఁగా, పొడువఁగా); అతఁడు = శుక్రాచార్యుఁడు; ఏకనేత్రుఁడు + అయ్యెను = ఒక నేత్రము గలవాఁ డయ్యెను.

తా. వామనునకు బలిదానవేంద్రుఁడు దానముఁ జేయు సందర్భమున శుక్రుండు సూక్ష్మాకృతిని వహించి ఘటంబున నావేశించి రంధ్రంబు నాటంకపఱచెను. హరియు నదియెఱింగి కుశాగ్రంబున నఁటఁ బొడువఁగా శుక్రుండేక నేత్రుండయ్యెను.

వ్యా. వి. కుశ + అగ్రంబున = కుశాగ్రంబున (సవర్ణదీర్ఘ సంధి).

67. కమలా = లక్ష్మికి; అధీశ్వరుఁడు = ప్రభువగు వామనుఁడు; అమర + అరాతి = దేవతలకు శత్రువైన బలియొక్క; కర = చేతినుండి; అక్షత = అక్షతలతో; ఉత్సృష్ట = విడువఁబడిన; పవిత్ర = పవిత్రమైన; అంభః కణ = నీటిబొట్లయొక్క; శ్రేణికి = మొత్తమునకు (సమూహమునకు); ఖండిత = నఱుకఁబడిన, ఖండింపఁబడిన; దివౌకః = స్వర్గము నివాసస్థానముగాఁ గల దేవతలయొక్క; స్వామి = ప్రభువగు ఇంద్రుని; జిత్ = జయించినవానియొక్క మస్తమున్ = మస్తకములు గలది, శిరస్సులు గలది (ఇంద్రశత్రువులైన రాక్షసుల శిరంబులఁ బగులఁగొట్టిన దన్నమాట; (హరిహస్తమున కిది విశేషణము);

కమలా = లక్ష్మీదేవిని; ఆకర్షణ = శృంగారక్రీడలయందు లాగుటచేత; సుప్రశస్తము=మిక్కిలి విశిష్టమైనది పొగడఁదగినది; రమాకాంతా=లక్ష్మీదేవియొక్క- కుచ = స్తనములను: ఉపాస్తమున్ = ఉపాసించునది (లక్ష్మీదేవి యొక్క- స్తనములందుండునదని భావము): విమల = నిర్మలములైన: శ్రీకచ = లక్ష్మీదేవి యొక్క- వెంట్రుకలయందును (ధమ్మిల్లమునందు); శాత = వాడియైన: చూచుకతటీ = చనుమొనలయొక్క- ప్రాంతమునందును; విన్యస్తమున్ = ఉంచఁబడినదియు నగు: హస్తమున్ = హస్తమును: ఒడ్డెన్=చాఁచెను.

తా, రాక్షసేశ్వరుఁ డగు బలియొక్క- చేతినుండి విడువఁబడిన దానధారకు లక్ష్మీనాథుఁడగు వామనుఁడు తన హస్తమును జాఁచెను. ఆ హస్తమింద్ర శత్రువులైన రాక్షసుల శిరంబులను బగులఁగొట్టినది. శృంగారాది క్రీడలయందు లక్ష్మిచే నాకర్షింపఁబడినది. లక్ష్మీదేవి కచచూచుకములను నఖక్షతాది శృంగార చేష్టలచేత పరామర్శించునది.

వ్యా. వి. అమర+అరాతి = అమరారాతి (సవర్ణదీర్ఘసంధి).
కమల+అధీశ్వరుఁడు = కమలాధీశ్వరుఁడు (సవర్ణదీర్ఘసంధి).

68. వనజ+అక్షుఁడు = పద్మాక్షుఁడగు విష్ణువు (వామనుడు): మునిజన = మహర్షులయొక్క-: నియమ = తపోనుష్ఠానములకు: ఆధారను = ఆధారమైనదియు: జనిత = పుట్టింపఁబడిన; అసురయువతి = రాక్షసస్త్రీలయొక్క-: నేత్ర = నేత్రములయందలి: జలకణ = నీటిబొట్లయొక్క-; ధారన్ = చాలును గలిగినదియు; (రాక్షసస్త్రీలయొక్క- ప్రవాహరూపంబైన యశ్రుబిందువు ధారలు గలది); దనుజ+ఇంద్ర = రాక్షసేశ్వరుఁడగు బలికి; నిరాధారను=ఆధారము లేకుండఁ జేసినదియునగు; బలివివర్జిత = బలిచేత విడువఁబడిన (బలిచేత వదలఁబడిన); ధారన్ = నీటిధారను (దానధారనని భావము); కొనియెన్ = గ్రహించెను.

తా. మహర్షులయొక్క- తపోనుష్ఠానముల కాధారమైనట్టిదియు, పుట్టింపబడిన రాక్షస స్త్రీలయొక్క- యశ్రుబిందువు ధారలుగల్గినట్టిదియు, రాక్షసేశ్వరుఁడగు బలిసార్వభౌమున కాధారములేకుండఁ జేసినట్టిదియు నగు బలిచే వదలఁబడిన నీటిధారను వనజాక్షుండైన వామనుండు ప్రతిగ్రహించెను. (రాక్షసులింతకుఁ బూర్వము మునులను నియమములు సాగించుకొనకుండ బాధించుచు వచ్చిరి. ఇఁక నట్టి యాటంకములులేక వారి నియమములు సాగునని యభిప్రాయము. రాక్షసకాంతలకుఁ దమరాజ్యము పోయినదని విచారముతోఁ గన్నీటిధార కారుచుండుటచే విచారించుచుండిరి. బలిచక్రవర్తి నిరాధారుఁ డయ్యెను. ఇత్యాది విశేషణము లభిప్రాయగర్భితముగా నున్నవి.)

69. కమలనాభుఁ = విష్ణువును; ఎఱిఁగియున్ = తెలిసికొనియు (ఇతఁడు సాక్షాద్విష్ణుదేవుఁడే యని తెలిసికొనియు); కాలంబుఁ + దేశంబుఁ + ఎఱిఁగి = దేశకాలపాత్రంబుల నెఱిఁగియు; శుక్రుమాటలు + ఎఱిఁగి = శుక్రాచార్యుని మాటలలోని రహస్యము నెఱిఁగియు; నాశము + ఎఱిఁగి = వినాశము సంప్రాప్తించునని తెలిసికొనియు; బలి = బలిసార్వభౌముఁడు; పాత్రము + అనుచుఁ = యోగ్యమనుచు; దానముఁ = మూఁడడుగుల దానమును; ఇచ్చెఁ = ఇచ్చెను; మహిఁ = లోకములో; వదాన్యుఁడు = దానకర్త (ప్రదాత); ఒరుఁడు = మఱియొకఁడు; మఱియుఁ + కలఁడె = మఱొకఁడు లేఁడని భావము.

తా. ఇతఁడు సాక్షాద్విష్ణుమూర్తి యని స్పష్టముగాఁ దెలిసికొనియు, దేశకాలపాత్రంబుల బాగుగా నెఱింగియు, శుక్రాచార్యుని మాటల నాలకించియు తనకు సంభవింపఁబోవు వినాశము నెఱింగియు బలిసార్వభౌముఁడు పాత్రమనుచు వామనునకు దానముఁ జేసెను. లోకములో నిట్టి వదాన్యుఁడు మఱొకఁడున్నాఁడా?

70. అనఘా = పాపరహితుఁడా! బలి = బలిచక్రవర్తి; చేసిన = కావించిన; దానమునకు; నలిన + అక్షుఁడు = పద్మాక్షుఁడు (విష్ణువు); నిఖిలభూత నాయకుఁడు + అగుటఁ = సర్వప్రాణులకు నాయకుఁ డగుటచే; కలకలమని = ధ్వన్యనుకరణముఁ (గుంపునఁ బుట్టిన పెద్దమోత, అలబలము); దశదిక్కులు = పదిదిశలును; బళిబళియని = ఆశ్చర్యార్థకమైన ధ్వని; భూతపంచకము = పంచభూతములు (పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము - ఇవి పంచభూతములు); పొగడెఁ = శ్లాఘించెను.

తా. పాపరహితుఁడా! బలిసార్వభౌముండు నిఖిలభూత నాయకుం డగు హరికిఁ గావించిన దానమునకు దశదిక్కులు కలకలారావములతో నిండిపోయెను. పంచభూతంబులు బళిబళియని శ్లాఘించినవి. (బలిచక్రవర్తి దానముచేసినవాఁడనుటచేత 'బలి బలి' యని ప్రశంసించినవని చెప్పవచ్చును. లికి ళికి ని భేద మేమియును లేదు.)

71. క్షితిదానము = భూదానము; ఇచ్చునతఁడుఁ = ఇచ్చునట్టి వాఁడును; అతికాంక్ష = మిక్కిలి కోరికతో; పరిగ్రహించునతఁడును = ప్రియముతోఁ బుచ్చుకొనువాఁడును; దురితచ్యుతులు + ఐ = పాపరహితులై; శతవత్సరములు = నూఱు సంవత్సరములు; శతమఖలోకమునఁ = ఇంద్ర లోకమున; ఎలమిఁ = సంతోషముతో; క్రీడ సలుపుదురు = విహరింతురు (క్రీడింతురు).

తా. లోకములో భూదానముఁ జేయువాఁడును బరిగ్రహించువాఁడును బాపరహితులై నూఱు వత్సరము లింద్రలోకమున నివసింతురని భావము.

వ్యా. వి. శతవత్సరములు (ద్విగుసమాసము).
దురితచ్యుతులు (పంచమీతత్పురుషము).

72. అట్లు + కావునన్ = అంతటి మహిమ కలదియగుటచే; ఏ దానంబును = ఎట్టి దానమైనను; భూదానంబునకు; సదృశంబు + కానేరదు = సమానముగాఁ బరిగణింపఁ బడదు; వసుంధరా దానము = భూదానము; ఉభయలోకంబులన్ = రెండు లోకములయందును (ఇహలోకము, పరలోకము); కీర్తి = యశస్సును; సుకృతము = పుణ్యమును; పడయుము=పొందుము; ఆ + మాయావటుండు = అమ్మాయావటుండు = ఆ కృత్రిమబ్రహ్మచారి (త్రికసంధి); ఇట్లు + అనియెన్ = ఈ క్రింది విధముగాఁ జెప్పెను.

తా. లోకములో మిగిలిన దానము లేవియును భూదానమునకు సాటి రావు. నీవు భూదానమును జేసితివి కావున మన యుభయులకును స్వర్గము సంప్రాప్తమగును. నీ విహపరంబులలోను గీర్తిని బడయుమని పలికెను.

వ్యా. వి. కీర్తిసుకృతములు (ద్వంద్వసమాసము).

73. ఇది + ఏమి = ఏల యిట్టిదానమును; వేఁడితి + అని = వేఁడుకొంటివని; నీ మదిన్ = నీ మనస్సునందు; వగవక =ఆలోచింపక; ధార + పోయుము + ఆ = (దత్తము చేయుమా, చేతనీళ్లుపోసికొని దత్తము చేయుము); సత్యము పెంపు+ ఒదవఁగన్ = సత్యము సమృద్ధిని బొందఁగా; కోరిన = వేఁడుకొనిన, కాంక్షించిన; అర్థంబు = దానమనెడి ప్రయోజనము; ఇది + ఇచ్చుట = ఇట్టి యర్థంబు నిచ్చుట; మూఁడు + జగములు = ముజ్జగములు = మూఁడు లోకములు; ఇచ్చుట మాకున్ = మా కిచ్చుట యగును (ముల్లోకంబుల నిచ్చినట్లుగా భావింతుమని భావము).

తా. సార్వభౌమా! ఈ విధమైన దానము నేల కోరుకొంటివని సంకోచింపకుము. ఇయ్యదలఁచుకొన్న దానమును వెంటనే ధారవోయుము. సత్య సమృద్ధితో యాచించిన దానంబును దత్తము సేయుట, నా పాలిటికి మూఁడు లోకంబుల నిచ్చుటయే యగును.

వ్యా. వి. 1 మూఁడు + జగంబులు = ముజ్జగంబులు.

సూ. సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడుశబ్దము డువర్ణంబునకు లోపంబునుమీఁది హల్లునకు ద్విత్వంబునగును. (ఉ॥ మూ + జ్జగములు)

సూ. ద్విరుక్తంబగు హల్లు పరంబగు నపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. (ఉ॥ ముజ్జగములు).

వ్యా. వి. 2. వేఁడితివి + అని = వేఁడితని.

సూ. లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు. (వేఁడితి+అని) మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధియగును. (వేఁడితని)

74. వటుని = బ్రహ్మచారియొక్క; పలుకులకు = మాటలకు; హర్షనిర్భర చేతస్కుఁడు+ఐ = సంతోషాతిశయముతో నిండిన హృదయముగలవాఁడై; వైరోచనుండు = విరోచనాత్మజుండైన బలిసార్వభౌముఁడు.

75. చిట్టి బుద్ధులు = చిన్నారి గుణములు (మనోజ్ఞమైన బుద్ధులు); మనోజ్ఞమైన గుణములు; పుట్టి = జన్మించి (పుట్టినతర్వాత); నేర్చుకొనెనో = అభ్యసించుకొనెనో; పుట్టక = జన్మింపక (జన్మింపక పూర్వమే); నేర్చెనో = నేర్చుకొనెనో; ఇట్టి = ఇట్టిగుణములు నేర్చిన; పొట్టివడుగు = పొట్టివాఁడైన బ్రహ్మచారి (వామనుఁడు); పొట్టన్ = గర్భమునందు; ఉన్నవి+ఎల్ల = ఉన్న గుణములన్నియు; బూమెలున్ = మాయలు; అని = అనుకొని; నవ్వి = నవ్వినవాఁడై; ఎలమిన్ = సంతోషముతో (ప్రీతితో); అపుడు = ఆ సమయమున; ధరణి దానమిచ్చెన్ = భూదానము నిచ్చెను.

తా. ఈ వామనుండిట్టి చిన్నారి గుణములను, బుట్టిన తర్వాత నేర్చుకొనెనో, పుట్టకపూర్వమే నేర్చుకొనెనో, కాని యీ బ్రహ్మచారి గర్భమునందుఁ గల గుణములన్నియు మాయలని నవ్వి, బలిసార్వభౌముండు భూదానముఁ జేసెను.

వ్యా. వి. చిట్టిబుద్ధులు (కర్మధారయము; పొట్టివడుగు (కర్మధారయము)

— —:0:— —

# శ్రీమదాంధ్ర భాగవతము

## ప్రశ్నోత్తరములు

1. మాయాభిక్షుకుఁడగు వామనుఁడు బలిచక్రవర్తిని శ్లాఘించిన విధానము నభివర్ణించునది?

భార్గవయాజితాశ్వమేధంబుల బలి బలియుం డయ్యెనని విని, యొక శుభముహూర్తమున బలియజ్ఞశాలకు వామనుఁడు భిక్షంబు నెపమున బయలుదేరి యజ్ఞవాటమునకుంజని, రక్షోవల్లభుండైన బలిసార్వభౌమునిజూచి, యాశీర్వదింపఁదలచినవాఁడై దర్భలతోను బవిత్రంబులైన యక్షతలతోను గూడిన దక్షిణహస్తంబును జాఁచి యిట్లని దీవించెను. ముల్లోకంబుల నాజ్ఞపెట్టువాఁడవును, జిఱునగవు మాత్రంబుననే దేవేంద్రుని జయించినవాఁడవును, నున్నతస్థానమును బొందినవాఁడవును, విశిష్టమైన యజ్ఞయాగాదుల నిర్వహించిన వాఁడవును, దేవకాంతల సౌడలయందలి మంగళసూత్రములఁ దెగఁ జూచువాఁడవును నగు నీకు స్వస్తియగుఁగాతమని యాశీర్వదించెను. పిమ్మట బలిచే సత్కరింపఁబడి యిట్లని శ్లాఘింపఁదొడఁగెను. సార్వభౌమా! నీ పలుకు లత్యంత ధర్మయుక్తంబులైనవి. వంశమునకుఁ గీర్తిని దెచ్చునవి. మీ వంశములో దయగలవారు తత్త్వమూర్తులేగాని యితరులు జన్మింపరు. యుద్ధమన్న బెదరెడివారుగాని మీ వంశంబున గలుగరు. యాచకులాశ్రయించిన లేదనక యిత్తురు. మీ కులంబునందు జన్మించిన ప్రహ్లాదుఁడాకాశమునఁ జంద్రునిమాడ్కి ప్రకాశించుచున్నాఁడు. మీ వంశము సముద్రమువలెఁ బెద్ద కీర్తితోఁ బ్రకాశించుచుండును. మీ మూఁడవతాత యగు హిరణ్యాక్షుండు సర్వజగంబుల జయించి గదాయుధుండై లోకములోఁ దన కెదురు లేక సంచరించెను. అప్పుడు విష్ణువు వరహావతారమున నతనిని సంహరించెను. ఆ సంగతి యతని తమ్ముఁడగు హిరణ్యకశిపుఁ డెఱిఁగి, విష్ణువును జయింపలేని తన పరాక్రమము నేవగించుకొని వెంటనే విష్ణువు మీఁదికిదండెత్తెను.

శూలాయుధంబును ధరించి యమునివోలె వెంటాడుచున్న హిరణ్యకశిపుం జూచి, విష్ణువు వీని నెదిరించి జయించుట కష్టమని తలఁచి సూక్ష్మరూపంబుతో వాని నిశ్వాసరంధ్రమునఁ బ్రవేశించెను. అంత హిరణ్యకశిపుఁ డా రహస్యంబు నెఱుఁగక విష్ణువును దల్లోకంబున వెదకి వెదకి విసిగి వేసారి, యాకసంబును దివంబును నరసి, దెసలు, పాతాళంబు, సముద్రంబులు మున్నగు-చోట్లు శోధించి, హరింగానక, మరణించియుండనోపునని భావించి, మరణించిన శత్రువుపైఁ బగ సాధించుట యుచితంబుగాదని యూరకుండెను. అట్టి పరాక్రమ శాలియైన హిరణ్యకశిపుండు నీకుఁ బ్రపితామహుఁడు. అతని గుణము లనేకములు నీకుఁ గలవు. అది యటుండనిమ్ము. దేవేంద్రాది విబుధులు కృత్రిమ విప్రవేషంబులతోఁ దన్ను యాచింప మీ తండ్రి విరోచనుం డవ్వంచన నెఱింగియు సంకోచింపక తన యాయువును బ్రసాదించెను. నీవును నట్టివాఁడవే. ముల్లోకంబుల నేలితివి. ఇంద్రాదిసురల నోడించితివి. పూర్వులవలె దానశౌండిమమున వన్నెగడించితివి. పిశాచ రాక్షసులఁ గాపాడితివి. లోకములో దాతలను లెక్కించు సందర్భమున మొట్టమొదట నిన్ను లెక్కింతురు. నీవు త్రిభువనేశ్వరుఁడవు. నిన్నెన్నడును నిన్ని దినంబులనుండియు యాచించి యెఱుఁగను. నాకొకటి రెండడుగుల మేరగల నేల నిమ్మని యనేక విధంబులుగా శ్లాఘించెను.

2. వామనునకు దానముఁ జేయ నుపక్రమించిన బలిసార్వభౌముని శుక్రుఁడు వారించిన విధానము నభివర్ణించునది?

వామనమూర్తికి భూదానముఁ జేయ నుపక్రమింపనున్న బలిసార్వభౌముని శుక్రుం డిట్లని వారించెను. దానవేంద్రా! ఈ వచ్చినవాఁడు సామాన్య బ్రాహ్మణుఁడు గాఁడు. దేవకార్యమును నెఱవేర్చుటకై వచ్చిన సాక్షాద్విష్ణుమూర్తి. అదితి కశ్యపులకుఁ బుత్రుండై జన్మించినవాఁడు. అది తెలియక దానమిచ్చెదనంటివి. నీ వితనికి దానమిచ్చినచో నీ వంశమున కంతటికి వినాశము సంభవించును. నీ సర్వరాజ్యమును బ్రతాపమును నైశ్వర్యమును నీ

కుబ్జుండు వంచించి దేవేంద్రున కిచ్చివేయును. విశ్వకాయుండై ముల్లోకంబుల మూఁడడుగుల నాక్రమించి మాన్పఁగలఁడు. సర్వము గోల్పోయి బడుగుపగిది నెట్లు జీవింపఁగలవు. మఱియు నిచ్చెదనని చెప్పి యీకున్నచో నరకంబు సంప్రాప్తించును. తనకు హితముగాని దానంబును పెద్దలు హర్షింపరు. దానము, తపము యజ్ఞము, కర్మము చేయునపుడు తనకున్న ధనంబును మేరగా నుంచుకొని చేయవలసియుండును. తనకున్న ధనమునంతటి నైదు భాగములుగా విభజించి, ధర్మమునకు, నర్థమునకుఁ, గామమునకుఁ బ్రతిష్ఠకు, స్వజనులకు నొక్కొక్కదాని కొక్కొక్క భాగము చొప్పున వినియోగింపవలయును. అట్లుచేసిన వాఁడి హపర లోకంబుల రెండింటను సుఖంబుండును. తన్నుమాలిన ధర్మమెందును యుక్తముగాదు. అదియునుఁగాక బహ్వృచగీతార్థంబును జెప్పెద వినుము. దాన మిత్తునని యంగీకరించి సర్వంబును గోల్పోయెడి సందర్భమున లేదని మాటఁదప్పినచో దోషంబుగాదు. జీవాత్మయనెడి వృక్షమునకు మూలమనృతము. సత్యము ఫల పుష్పములు. సత్యము ప్రకాశింపవలయునన్న నసత్యము మూలమై యుండవలయును. అసత్య మాధారముగా లేని సత్యము ప్రకాశింపదు. సత్యరూపంబైన ఫలపుష్పములు లేకపోయినను నసత్యరూపంబైన మూలముతోఁ జెట్టు వృద్ధిపొందును. కావున దాతకు వినాశము, లఘుత్వము, లోటు గలుగకుండ దానముచేయుట యుక్తము. అట్టివాఁడు నశింపఁడు. అట్లుగాక సత్యవాక్యపరిపాలనార్థమై తనకుఁగల సర్వస్వమును నర్థికి ధారవోయునతం డీలోకమున శూన్యుఁడగును. ఇది ప్రపంచ న్యాయము. గనుక సత్యవాక్కువైన నీ వసత్యము నాశ్రయించియైనను నీ సంపదను గాపాడుకొనుము. మఱియు స్త్రీల విషయంబునను, వివాహప్రసంగముల యందును, ప్రాణవిత్తమానములకు భంగము వాటిల్లునప్పుడును గోబ్రాహ్మణ రక్షణార్థంబునను నసత్యమాడిన దోషంబుగాఁ బరిగణింపఁబడదు. కావున నీ వంశమును, రాజ్యమును, బ్రతాపమును నిలఁబెట్టుకొనుము. ఈ వామనుఁడు సామాన్యుఁడుగాఁడు.

మూఁడడుగులతో బ్రహ్మాండమునంతటిని మూన్పఁగల జగజెట్టి. నా పలుకుల నాలకించి యిట్టి దానమును మానుకొని బ్రహ్మచారిని లేదని సాగనంపుము.

3. హితోపదేశము సేయునట్టి శుక్రాచార్యునికి బలి యొఱిఁగించిన నిశ్చయంబు నభివర్ణించునది?

వామనునకు దానము సేయవలదని హితం బుపదేశించుచున్న శుక్రాచార్యునకు బలిసార్వభౌముం డిట్లనియెను.

గురూత్తమా! నీవు సత్యంబును బలికితివి. నీవు వక్కాణించినది పవిత్రంబైన గృహస్థధర్మము. అర్థకామయశోవృత్తులలో నెయ్యది యర్థించినను నిత్తునని యిప్పు డర్థలోభంబున నెట్లు లేదందును. పలికి లేదనుటకంటె మఱొక పాపమున్నదా? అనృతవాది నొక్కనిదక్క నెట్టి దుష్కర్మునైనను భరించెదనని భూదేవి బ్రహ్మతోఁ జెప్పియుండలేదా? దాతకు దానము సేయు యోగ్యత సత్పాత్రుఁడు లభించుట, హలికునకు మంచివిత్తనములు, చక్కని భూమియు దొరికిన విధముగదా! అంతకన్న భాగ్యమున్నదా? పూర్వ మెందఱో రాజు లుండిరిగదా! ఎన్నిరాజ్యములను బాలింపలేదు! వారిలో నొక్కరైనను నైశ్వర్యమును మూటఁ గట్టుకొని పోయినారా? పోనిమ్ము! ఈ భూమిలో వారిపేరైనను నిలువలేదు గద! శిబిప్రముఖులైన చక్రవర్తులు యశఃకాములై ప్రాణంబులను సైతము సమర్పించి ప్రాణులకు మేలును గూర్చిరి. అట్టి సాధుమూర్తుల నీ కాలంబుననైనను మఱచినారా?

యజ్ఞయాగాదులను దపోదానాదులను నెడతెగక జేసినట్టి కర్మఠుఁడు వామనుఁడు నన్ను యాచింపఁగా నా బోటివాని కిష్టార్థంబులఁ బ్రసాదించుట యుక్తంబుగదా! లక్ష్మీదేవిని, పాదాదిశిరఃపర్యంతము నాయా యవయవముల నిమురుచుఁ బరామర్శించిన విశిష్టమైన హరికరంబుక్రిందై నా కరంబుమీఁదైయుండు భాగ్యంబు కన్న నా కేమి కావలయును? శరీరమపాయము లేనిదా? ఇంత యేల

నేనొనర్చెడు దానంబునఁ గులాంతమైనను, దుర్మరణంబు సంప్రాప్తించినను, నరకంబు సంభవించినను, బంధన మేర్పడినను, హరిహరబ్రహ్మాదు లాటంకమైనను నా జిహ్వ తిరుగనేరదు. దానమిచ్చి తీఱుదును. అడిగినది యిచ్చుచుండ నాతఁడు హరియేయైనను నన్నేల కట్టఁగలఁడు? ఎన్నటికి నట్లు జరుగదు. కాదని యొకవేళ కట్టివేసినఁ గట్టివేయనిమ్ము. మేరుపర్వతము తల్లక్రిందులైనను, నంబుధు లింకఁబాఱినను, నాకాశము స్తంభించిపోయినను నేనియ్యఁ దలచుకొన్న దానము నిచ్చి తీఱుదును.

ఇతఁ డొంటివాఁడట. ఇతరులను వేఁడఁబోఁడఁట. తల్లిదండ్రులుగాని, యన్నదమ్ములుగాని యెవ్వరునులేని యేకాకియఁట సర్వవిద్యల సారమెఱిఁగిన సమర్థుఁడఁట. ఇట్టి కుబ్జుఁడు చేతులొగ్గి వేఁడుకొనఁగాఁ ద్రోసిపుచ్చుట న్యాయంబుగాదు. కావున నీ బ్రహ్మచారి యాచించిన దానం బిచ్చెదనని బలి శుక్రాచార్యునితో నొక్కి వక్కాణించెను.

4. బలి శుక్రుల సంభాషణవలన వెలువడిన భాగవతధర్మము నభివర్ణించునది?

బలిసార్వభౌముఁడు దానవచక్రవర్తి. శుక్రాచార్యుఁ డొక నీతిశాస్త్రజ్ఞుఁడు. యజ్ఞశాలఁ బ్రవేశించిన యతిథి యెవ్వఁడో మొట్టమొదట నిర్వురును దెలియరైరి. సాధారణమైన యతిథుల వలెనే బలిసార్వభౌముఁ డితనికిఁ బ్రత్యుత్థానంబు సలిపి కోరుకొమ్మని వేఁడుకొనెను. వామనుఁడు మూఁడడుగుల నేలనిమ్మని యాచించెను. అందులకు బలి స్వల్పంబును గోరితివేమి? దాత పెంపు సొంపు దలఁపవలదా? యని గర్వించెను. వామనుఁడును గృత్రిమ వినయము నభినయించి, యాతని యైశ్వర్యమును సర్వస్వంబును వంచించి వాసవునకిచ్చు దలంపు గలవాఁడై సార్వభౌమా! చాల దనక యిమ్ము. దానబ్రహ్మకూకటి ముట్టెద. దానకుతుకసాంద్ర! దానవేంద్రా! యని శ్లాఘించుచు గంభీరముగాఁ బలికెను. నీతిశాస్త్రజ్ఞుఁడును, విజ్ఞానవేత్తయునగు శుక్రాచార్యుఁడు బలి శుక్రుల

సంభాషణమును జాగ్రత్తగా వినుచుండెను. సర్వజ్ఞుఁడైన శుక్రుండు క్రమముగా నీతండు సామాన్యవటువు గాఁడని గ్రహించెను. దానవ సామ్రాజ్యమునకు రాఁబోవు హానిని భావించినవాఁ డయ్యెను. రాక్షసరాజ్య భవిష్యమీతని గన్నులకుఁ గట్టినట్లయ్యెను. వీని తాతముత్తాతలనుండి దానవరాజ్యమును గాపాడుచువచ్చిన గురు మూర్తియగుటచే శుక్రునకు రాజ్యము పోవుచున్నదను నావేదన యతిశయించెను. బలిసార్వభౌముని "వలదీదానము గీనముం బనుపుమావర్ణికా వదాన్యోత్తమా" 'తన్నుమానిచేతదగవుగాదు' అనిచెప్పి హెచ్చరించినాఁడు. అందులకుఁ దగిన బహ్వృచగీతాది యుపపత్తుల నెన్నింటినో జెప్పి ధర్మప్రబోధము గావించినాఁడు.

శుక్రుఁడుగావించిన యుపదేశములను విని క్షణమాత్రనిమీలిత లోచనుఁడై సర్వవిషయంబుల నవధానంబున నాలోచించుకొని దానముఁ జేయుటకే నిశ్చయించుకొనెను. శుక్రుఁడెంత ధర్మబద్ధముగాఁ బ్రబోధించినను నసత్యదోషము తప్పదని భావించుకొనెను. వచ్చినవాఁడు హరియే యైనచో నంతటివానికి దానమిచ్చుటకంటె వేఱుతరుణోపాయము లేదని నిశ్చయించుకొనెను. తనకుఁ బ్రమాదముఁ గల్గించునేమోయని "ఏలకట్టు? కట్టెనేని దాన కరుణించి విడుచునని వితర్కించుకొనెను. తుదకు మేరువు తల్లక్రిందులైనను, సముద్రంబు లింకఁ బాఱినను, ధారుణి రజమైపోయినను, నాకసంబు బ్రద్దలైనను దప్పక యిత్తునని నిశ్చయించుకొనెను.

కులాచార్యుండైన శుక్రుం డెంత నిర్బంధించినను దుదకు శపించినను వినక దానమిచ్చుటకే కట్టుఁబడెను. సత్యవాక్యపరిపాలనార్థము ప్రాణమునైనను లెక్కబెట్టలేదు. వంశనాశనమునకు వెనుదీయలేదు. సర్వదా సత్యమును నిలుపుటయే ముఖ్యమైన ధర్మమని నిర్ధరించుకొనెను. అట్టి సత్యమును గాపాడుకొనుటకు మార్గాంతరముల నన్వేషించి కృత్రిమ ధర్మము ననుసరించుట యుక్తమైన మార్గముగాదని నిర్ణయించుకొనెను. కమలనాభుఁ డని యెఱిఁగియు, దేశకాలపాత్రంబుల నెఱింగియు, శుక్రుమాటల నాల

కించియుఁ దనకుఁ గీడుమూడునని తెలిసికొనియు, నిష్కపటముగా వామనునకు దానము సేయుటయే యుచితమనియు సత్యసంరక్షణమే యుత్తమధర్మమనియు, సత్యముకొఱకు సర్వస్వమును త్యజింపవచ్చు ననియు నిర్ణయించుకొని త్యాగమూర్తి హరికిఁ బదత్రయ భూమిని దానంబు సేసెను.

పైవిషయములను బరిశీలించినచో సత్యవాక్యపరిపాలనార్థము సర్వస్వమును గోల్పోవచ్చునను భాగవతధర్మ మీ పాఠ్యభాగమునఁ బ్రతిఫలించుచున్నది. మీదుమిక్కిలి గురుశిష్యులకుఁ గల సంబంధము, గురువచనముల ధిక్కరించిన భ్రష్టుఁడగునను నీతియు నీపాఠ్య భాగమునఁ బ్రతిఫలించుచున్నది.

మఱియు భూదానము సేయువాఁడును, బరిగ్రహించు వాఁడును నుభయులును బాపరహితులై నూఱు సంవత్సరములవఱకు నింద్రలోక సుఖముల ననుభవింతురు. ఏ దానము నిచ్చినను నిచ్చిన వానికొక్కనికే పరలోకసుఖంబేర్పడునుగాని, యిరువురకుఁ గలుగదు. భూదానమునందు మాత్రమే యుభయులకును బరలోక సుఖము గలుగును గాన భూదానంబునకు సదృశమైన యితర దానంబులు లేవను భాగవత ధర్మముగూడ నిందు వ్యక్తమగుచున్నది.

5. అసత్యమాడినచో దోషము సంభవింపదన్న యుపపత్తి యెట్లు నిరూపింపఁబడినదో మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని నిర్ణయించునది ?

ఈ విషయమును వామనునకు దానముసేయ నుపక్రమింప నున్న బలిసార్వభౌమునకు శుక్రుండు వాక్రుచ్చెను. దానవేంద్రా! దానమిచ్చెదనని యంగీకరించి సర్వస్వంబును గోల్పోయెడి సందర్భమున లేదని మాటఁదప్పినచో దోషంబు గానేరదు. ఇచ్చెదనని చెప్పి యీకున్నచో నరకము వచ్చునట నిజమే కాని యేదానమున సమస్తమునకు వినాశము సంభవించునో యట్టి దానమును పెద్దలు

దానముగాదందురు. తనకుఁగల ధనమునంతటిని నైదు భాగము లుగాఁ జేసి ధర్మార్థకామములకుఁ గీర్తికి, నాశ్రితజనపోషణమునకు సమానముగా వ్యయము చేయవలెను. తనకుమాలిన ధర్మము మొదలుచెడ్డ బేరమని పెద్దలు వాకొందురు. మఱియు బహ్వృచ గీతార్థముగూడ తనకుఁగల సర్వస్వము తానుజేయు దానమువలన నశించుచున్నయెడల నట్టిదానము నిచ్చెదనని చెప్పి యీకున్నచో దోషంబు గానేరదని చెప్పుచున్నది. అట్టి ధర్మమును జెప్పెదను సావధానచిత్తుఁడవై వినుమని శుక్రుడిట్లు చెప్పఁదొడఁగెను.

జీవాత్మయనెడి వృక్షమునకు మూల మనృతము. సత్యము ఫలపుష్పములు. కేవలము సత్యము ప్రకాశింపవలయునన్న నస త్యము మూలమై యుండవలయును. అసత్య మాధారముగాలేని సత్యము ప్రకాశింపదు. సత్యరూపంబైన ఫలపుష్పములు లేకపో యినను నసత్యరూపంబైన మూలముతోఁ జెట్టు నీరసించియైనను వృద్ధిపొందుచుండును. కావునఁ దనకు వినాశము, లఘుత్వము, లోటును గలుగకుండ దానముచేయుట యుక్తము. అట్లుగాక సత్యవాక్య పరిపాలనార్థమని తనకుఁగల సర్వస్వమును నర్థికి ధార వోయునతం డీ లోకంబున రిక్తుండగును. కావున మూలమునకు నైతము చేటు సంభవించెడి దానంబు నొనరించిన నీవాధార రహి తుండవై సాధింపఁదలఁచుకొన్న సత్యమార్గమునకు దూరుండవయ్యె దవు. ఇది ప్రపంచన్యాయము. కనుక సత్యవాక్కువైన నీ వస త్యము నాశ్రయించియైనను నీ సంపదను గాపాడుకొనుము. అట్లని సాధ్యంబయ్యు నంగీకారాత్మకంబైన సత్యంబును మఱుఁగుపఱచి లేదనిచెప్పు మూర్ఖుఁడు జీవచ్ఛవముగాఁ బరిగణింపఁబడును. కావున దేశకాలాదులఁ బరికించి పైఁజెప్పిన రెండు ధర్మములను యుక్తరీతి ననుసరించుట మంచిది. మఱియు స్త్రీల విషయంబునను, వివా హాది సందర్భములయందు, ప్రాణమునకుఁగాని, ధనమునకుఁగాని, గౌరవమునకుఁగాని మూలనాశన మేర్పడునప్పుడును, గోబ్రాహ్మణ రక్షణంబునను నసత్యమాడినప్పటికిని దోషంబుగాఁ బరిగణింపఁ

బడదు. ఇట్లనేక విధంబులుగా శుక్రుండు బలిసార్వభౌమునకు హితోపదేశముఁజేసి యే సందర్భములలో నసత్యమాడవచ్చునో నిరూపించెను.

## ముఖ్య ప్రశ్నలు

(1) ఆంధ్రభాగవతమును రచించిన కవియెవరు? కవికాలాదులను, బిరుదములను దెల్పి, తెలుఁగు భాగవతమునకు మూలగ్రంథ మేదో వివరించునది ?

(2) మాయాభిక్షుకుఁడగు వామనుఁడు రక్షోవల్లభుని జూచి ప్రశంసించిన విధానమును గూర్చి వ్రాయుఁడు ?

(3) వామనుఁడు బలిని యాచించిన విధానమును బలియొసంగిన సమాధానమునుగూర్చి వ్రాయునది?

(4) దానముసేయ నుపక్రమించిన వామనుని శుక్రుఁ డేమని వారించెను ?

(5) హితోపదేశముఁజేయు శుక్రునకు బలి యెఱిఁగించిన నిశ్చయమును వివరించునది ?

(6) అసత్యమాడినచో దోషము గానేరదనుటకు శుక్రుఁ డెఱిఁగించిన యుపపత్తులను సోదాహరణముగా వివరించునది ?

(7) శుక్రుఁడు బలిసార్వభౌము నేల శపించెను? దానికి పర్యవసాన మేమి ?

(8) ఏ దానము భూదానమునకు సాటిగాదనెడి విషయమును మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని వివరించునది ?

(9) మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని బలిశుక్రుల సంభాషణమువలన వెలువడిన భాగవతధర్మమును వివరించునది ?

(10) వామన బలిఘట్టమును బురస్కరించుకొని పోతనకవి కవితా ప్రాగల్భ్యమును నభివర్ణించునది ?

ఈ క్రింది వాక్యములకు సందర్భసహిత వ్యాఖ్య వ్రాయుఁడు :—

(1) ఏ జలము గిరీశుఁ డిందు జూటుఁడు దేవదేవుఁ డుద్వహించె. 3

(2) ఎన్నఁడు నిను బెట్టుమనుచు నింద్రము సేయఁడు. 21

(3) చాలదనక యిమ్ము చాలుఁజాలు. 32

(4) తన్నుమానిచేత దగవు గాదు. 36

(5) దాత పెంపు సొంపుఁ దలఁపవలదె. 24

(6) పసిబాలుండవు నేరవీవడుగ నీ భాగ్యంబు లీ పాటిగా. 26

(7) వైన్యగయ భూకాంతాదు లున్నర్థకామాంశం బాయఁగ నేర్చి రే. 31

(8) పూఁటపూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ తుష్టిని తేజంబు దోఁనపెరుఁగుఁ. 32

(9) నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట దగవుగాదు. 32

(10) బడుగు వగిది నెట్లుఁ బ్రదికె దీవు. 34

(11) ఏ దానమున నాశమే తెంచునదియును దానంబు గాదంద్రు తత్త్వవిదులు. 36

(12) చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ జెందకుండనిచ్చు పురుషుఁడు సెడకుండున్. 38

(13) వారేరీ సిరిమూటగట్టికొని పోవంజాలి రే? 46

(14) రాజ్యము నిజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే? 48

(15) మాటఁ దిరుగలేరు మానఘనులు. 54

(16) కావునసే దానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు 72

ఈ క్రింది పద్యముల కర్థతాత్పర్యములను వ్రాయునది :—

(1) "స్వస్తి జగత్త్రయీభువన శాసనకర్తకు హాసమాత్రవి" 1

(2) "ఎదురై పోర జయింపరా దితనిఁ గాకెంతేని నిం బోవ భీ" 13

(3) "కులమున్ రాజ్యముఁ దేజమున్ నిలుపు మీ కుజ్జుండు విశ్వంభరుం" 42

(4) "కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే" 46

(5) "ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపైనం బోత్తరీయంబుపైఁ" 48

(6) "నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైనను" 49

(7) "బలిదైత్యేంద్ర కరద్వయీకృతజల ప్రక్షాళనవ్యాప్తికిన్" 60

(8) "విప్రాయప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయవే" 64

(9) "అమరారాతి కరాక్షతోక్షిత పవిత్రాంభః కణశ్రేణికిం" 67

ఈ క్రింది పద్యములలోని యలంకారములను బేర్కొని లక్ష్యలక్షణ సమన్వయముఁ జేయునది :—

(1) "మీ కులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు మింటిచంద్రుమాడ్కి మేలిరుచులన్" 10

(2) "ప్రథితకీర్తితోడ భవదీయవంశంబు నీరరాశిభంగి నెగడుచుండు" 10

(3) "శూలాయుధహస్తుండై కాలాకృతివచ్చుఁ దనుజుఁగని." 12

(4) "భీప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియంబై వచ్చునంచున్" 13

(5) "పరితోషహీనతఁ బ్రభ సెడిపోవును జలధారననలంబు సమయునట్లు." 32

(6) "తన్ను మానిచేత దగవుగాదు" 36

(7) "ఆత్మవృక్షము మూలమనృతంబు......పుష్పఫలము లాత్మభూజంబునకు సత్యము......" 38

(8) "మనోహరవదన చంద్రమండలుండు" 2

## వ్యాకరణ విశేషములు

బహ్వృచులు = బహు + ఋచులు (యణాదేశసంధి)

సూ. ఇ, ఉ, ఋ, ౡ వర్ణములకు సవర్ణములుగాని యచ్చులు పరమైనయెడల య, వ, ర, ల వర్ణములు క్రమముగా వచ్చును. (దీనిని సంస్కృతవ్యాకరణజ్ఞులు యణాదేశసంధి యందురు).

అనృతము = న + ఋతము (నఞ్ తత్పురుషము)

సూ. అజాది సుబంతము పరమగునేని నఞ్ యొక్క 'న' కారము 'అన్' గాను, హలాది సుబంతము పరమగునేని 'అ' గాను మాఱును.

బ్రహ్మప్రీతమ్మని = బ్రహ్మప్రీతమ్ + అని.

సూ. అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు.

నాపాయము = న + అపాయము (మయూర వ్యంసకాదిసమాసము)

సూ. నఞర్థకమగు నవ్యయమైన 'న' శబ్ద మొకటి గలదు. అదియును సుబంతముతో సమసించును. 'న' శబ్దము 'నఞ్' కాదు కావున 'అన్' 'అ' ఆదేశములు రావు. (నైకము, నైకథా, నాతి దూర మిత్యాదులు) ప్రస్తుత ప్రయోగము 'నాపాయము' గూడ నిట్టిదియే యని గ్రహింపనగును. ఇట్టి సమాసములన్నియు మయూర వ్యంసకాది గణములోఁ జేరినవి.

ధాత్రీసురేంద్రోత్తమ = ధాత్రీసుర + ఇంద్ర + ఉత్తమ (గుణసంధి)

సూ. 'అ' కారమునకు ఇ, ఉ, ఋ వర్ణములు పరమగునేని క్రమముగా ఏ, ఓ, అర్ వర్ణము లేకాదేశములగును. (ఏ, ఓ, అర్ వర్ణములకు గుణమని సంజ్ఞ.)

గిరీశుఁడు = గిరి + ఈశుఁడు = (సవర్ణదీర్ఘసంధి)

సూ. సంస్కృతశబ్దంబులకు సంహిత యున్నప్పుడు అ, ఇ, ఉ, ఋ కారములకుఁ గ్రమముగా అ, ఇ, ఉ, ఋ వర్ణములు పర

మగునేని దీర్ఘ మేకాదేశముగా వచ్చును. (హ్రస్వాచ్చులకుఁ జెప్పిన కార్యములు దీర్ఘాచ్చులకును వచ్చును)

దేవౌకస్సు = దేవ+ఓకస్సు (వృద్ధిసంధి)

సూ. 'అ'కారమునకు ఏ, ఐ, వర్ణములును – ఓ, ఔ వర్ణములును బరమగునేని ఐ, ఔ వర్ణములు క్రమముగా నేకాదేశముగా వచ్చును. (ఆ, ఐ, ఔ, ఆర్ వర్ణములకు వృద్ధియని సంజ్ఞ)

వడుగుం గొమరుఁడు = వడుగు+ను+కొమరుఁడు.

సూ. సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుపసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. (ఉ॥ వడుగు+ను+కొమరుఁడు) ద్రుతప్రకృతికముమీఁది పరుష ములకు సరళములగు. (ఉ॥ వడుగు+ను+గొమరుఁడు) ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషంబులు విభాష నగు (ఉ॥ వడుగుం గొమరుఁడు).

ముప్పోకలు = మూఁడు+పోకలు.

సూ. సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడుశబ్దము డువర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగును. (ఉ॥ మూఁడు+పోకలు = మూ+ప్పోకలు)

సూ. ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. (ఉ॥ ముప్పోకలు)

వక్కాణింతున్ = వక్కాణించుదున్.

సూ. చువర్ణంబుతోడి దుగ్ధకారంబునకుఁ దకారంబగు.

గోష్ఠిన్నెఱింగి = గోష్ఠిన్+ఎఱింగి.

సూ. కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి.

(ప్రౌఢవ్యాకరణము, సంధి 8)

పూఁటపూఁటకున్ = పూఁటకున్ + పూఁటకున్.

సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగును.

చెపుమా = చెపుము + ఆ.

సూ. సంప్రార్థనంబుల ముజ్జున కదాదులు విభాషనను ప్రయుక్తంబులగు. (అఆ, ఇఈ, ఉఊ, అమ్మ, అయ్య, ఇత్యాదులదాదులు)

దానముగీనము = దానము + దానము.

సూ. నిందయం దామ్రేడితంబు నాద్యక్షరంబులకు హ్రస్వదీర్ఘంబులకు గిగీలగు.

ఇక్కాలమున్ = ఈ + కాలమున్.

సూ. ఆ, ఈ, ఏ యను సర్వనామంబులు త్రికంబునాఁబడు. త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగును. (ఉ॥ ఈ + క్కాలమున్) ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. (ఉ॥ ఇక్కాలమున్)

త్రోవన్ - త్రోచన్.

సూ. ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు-ప వ-లగు.

సూ. జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు.

ఈ క్రింది వ్యాకరణ విశేషములను వ్రాయునది:—

1. కరచరణాద్యవయవంబులు; 2. గిరీశుఁడు; 3. ధాత్రీసురేంద్రోత్తమా; 4. వక్కాణింతున్; 5. ముప్పోకలు; 6. వడుగుం గొమరుఁడు; 7. వేఁడిత్రో; 8. భూకాంతాదు లున్నగ్గకామాశన్; 8. పూఁటపూఁటకున్; 9. నీవు రాజవనుచు; 10. త్రోవన్; 11. ముజ్జగములు; 12. బహ్వాశ్చగీత; 13. నాపాయము.

వ్యుత్పత్త్యర్థములు వ్రాయుఁడు :

నిర్జరులు = ముసలితనము లేనివారు (దేవతలు.)

నీరరాశి = నీటికి రాశివంటిది (సముద్రము.)

దనుజమర్దనుఁడు = రాక్షసులను జంపినవాఁడు (విష్ణుమూర్తి.)

దైత్యవల్లభుఁడు = దితిసంతతివారైన రాక్షసులకు రాజు (హిరణ్యకశిపుఁడు.)

అబ్జాక్షుఁడు = పద్మములవంటి కన్నులు గలవాఁడు (విష్ణువు.)

ధరణీసురుఁడు = భూమిపై దేవతవంటివాఁడు (బ్రాహ్మణుఁడు.)

దేహధరులు = శరీరమును ధరించినవారు (మనుష్యులు.)

త్రిదివము = మూఁడవదగు లోకము (స్వర్గము.)

ప్రపితామహుఁడు = పితామహుని తండ్రి (ముత్తాత.)

వారిజాక్షులు = తామరపువ్వులవంటి కన్నులు గలవారు. (స్త్రీలు.)

పురుహూతుఁడు = యజ్ఞములందు మొట్టమొదటఁ బిలువఁబడువాఁడు (ఇంద్రుఁడు)

వామాక్షులు = అందమైన నేత్రములు గలవారు (స్త్రీలు.)

బహు + ఋచులు = బహ్వృచులు = అనేకములగు ఋఙ్మంత్రములు తెలిసినవారు.

వారాశి = నీటికి రాశివంటిది (సముద్రము.)

వైన్యుఁడు = వేనునివంశములోనివాఁడగు పృథుచక్రవర్తి.

భూజము = భూమినుండి పుట్టినది (చెట్టు.)

అబ్జము = నీటియందుఁ బుట్టినది (పద్మము.)

త్రివిక్రముఁడు = మూఁడు పదన్యాసములు గలవాఁడు (హరి)

హాలికుఁడు = నాగలితో భూమిని దున్నువాఁడు (వ్యవసాయదారుఁడు.)

కమలనాభుఁడు = పద్మము నాభియందుఁ గలవాఁడు (విష్ణువు)

నీరజభవుఁడు = పద్మమునుండి బుట్టినవాఁడు (బ్రహ్మ.)

కమలబంధుఁడు = పద్మములకు మిత్రుఁడు (సూర్యుఁడు.)

నిగమాంతములు = వేదములయొక్క యంతములు (ఉపనిషత్తులు మొ.)

నళినాక్షుఁడు = తామరపువ్వువంటి కన్నులు గలవాఁడు (విష్ణువు.)

శతమఖుఁడు = నూఱుయజ్ఞములు చేసినవాఁడు (ఇంద్రుఁడు)

తారాధ్వము = నక్షత్రములయొక్క మార్గము (ఆకాశము)

దివౌకసులు = స్వర్గము నివాసముగాఁ గలవారు (దేవతలు)

వసుంధర = బంగారు, రత్నములు, ధనము మొదలుగాఁగల వానిని ధరించినది (భూమి)

ప్రకృతి వికృతులను వ్రాయుఁడు :

| ప్రకృతి | | వికృతి | ప్రకృతి | | వికృతి |
|---|---|---|---|---|---|
| రత్నము | – | రతనము | విద్య | – | విద్దె |
| దిశ | – | దెస | జిహ్వా | – | జిమ్మ |
| భిక్షము | – | బిచ్చము | విష్ణువు | – | వెన్నుఁడు |
| సముద్రము | – | సంద్రము | ముక్తి | – | ముత్తి |
| వటుఁడు | – | వడుగు | మృత్యువు | – | మిత్తి |
| అల్పము | – | అలుపము | సంజ్ఞ | – | సన్న |
| లక్ష్మి | – | లచ్చి | ముఖము | – | మొగము |
| ఆజ్ఞప్తి | – | ఆనతి | యజ్ఞోపవీతము | | జన్నిదము |
| క్షేమము | – | సేమము | యజ్ఞము | – | జన్నము |

| ప్రకృతి | | వికృతి | ప్రకృతి | | వికృతి |
|---|---|---|---|---|---|
| శ్రీ | - | సిరి | ద్వీపము | - | దీవి |
| కులము | - | కొలము | హృదయము | - | ఎద |
| గృహస్థుఁడు | - | గేస్తు | ఆశ | - | ఆస |
| | | | ఆశ్చర్యము | - | అచ్చెరువు |

## పూర్వగాథలు

1. "ఏ జలము గిరీశుఁ డిందు జూటుఁడు దేవదేవు డుద్వహించె ధృతిశిరమునన్."

గంగ హరిపాదములనుండి పుట్టినదనియు నీశ్వరుఁ డామెను తలపైఁ దాల్చెననియుఁ బురాణములు ఘోషించుచున్నవి. సముద్రుని కూఁతురగు లక్ష్మీదేవిని విష్ణుమూర్తి పెండ్లిచేసికొనెను. సముద్రుని భార్యయగు గంగకు లక్ష్మి కూఁతురగును. గంగను శివుఁడు పరిగ్రహించి తలపైఁ దాల్చుటచే నా లక్ష్మి శివునకును గూఁతురగును. కూతురగు లక్ష్మిని విష్ణువునకిచ్చు సందర్భమున నాతని కాళ్లుగడిగి శివుఁడు గూడ నా పవిత్రజలమును శిరమున ధరించినాఁడనియుఁ జమత్కారముగాఁ జెప్పవచ్చును. ఇచ్చట విష్ణుమూర్తిపాదములను గడిగిన యీ గంగయు విష్ణుపాదోదకమే కావున శివుఁడు తన జటాజూటమున గంగను ధరించెనని వర్ణింపఁబడినది.

2. "ఆతురభూసురగతిఁ బురుహూతాదులు దన్ను వేఁడ నొగిఁగొండనుచున్ మీ తండ్రి యిచ్చెనాయువు."

విరోచనుఁడు ప్రహ్లాదుని కుమారుఁడు. బలిసార్వభౌమునకుఁ దండ్రి. అతఁడు దానశౌండిమమున దశదిక్కులందుఁ పేరు మ్రోఁగినవాఁడు. ఒకప్పుడు పురుహూతాది దేవతలాతని వితరణ సామర్థ్యమును బరీక్షించుటకై, వ్యాధిగ్రస్తులైన విప్రవేషంబుల ధరించి వంచనతో విరోచనుని మందిరంబునకుం జనిరి. బ్రాహ్మణులన్న

గౌరవభావముగల విరోచనుఁడు బ్రాహ్మణ వేషధారులైన యింద్రాదులను గాంచి ప్రత్యుత్థానంబుసేసి గౌరవించి వారు వచ్చిన కార్యంబును నివేదింపమని వేఁడుకొనియెను. అంతట భూసురులా విరోచనుని యాయువు నిమ్మని ప్రార్థించిరి. విరోచనుఁడా భూసురులవంచన నెఱింగియు సంకోచింపక బ్రాహ్మణుల యెడగల గౌరవ భావముచే నడిగిన దే తడవుగా స్వార్థరహితుఁడై తన యాయువునందుఁ గొంత భాగమును వారికిఁ బ్రసాదించెను. అంతట దేవకార్యంబు సాధింప వచ్చిన యింద్రాదు లా వితరణముఖురుండైన విరోచనుని వేనోళ్లఁ గొనియాడుచు వెడలిపోయిరి.

[పైన పేర్కొ-నఁబడిన ప్రశ్నలకుఁ దగిన సమాధానముల నాయా పద్యములయొక్క- యర్థతాత్పర్యాదులనుండియు నితర వ్యాసములనుండియు గ్రహింపఁదగును.]

—:0:—

# శ్రీ కాళహస్తి మాహాత్మ్యము

(ధూర్జటి)

## నత్కీరోపాఖ్యానము

### కవి విషయాదికము

శ్రీ కాళహస్తి మాహాత్మ్యమును ధూర్జటికవి రచించెను. ఇతఁడు శివభక్తాగ్రేసరుఁడు. భారద్వాజ సగోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. పాకనాటి యార్వేలనియోగి బ్రాహ్మణుఁడు. క్రీ.శ. 1520 సం॥ ప్రాంతమున శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునం దష్టదిగ్గజములలో నొకఁడై వన్నె కెక్కియుండెను. ఇతని సంతతి వారికి కాళహస్తి పుణ్యక్షేత్రము నివాసస్థానముగా నుండెను. ఇప్పటికిని కాళహస్తి రాజుగారి దర్బారులో ధూర్జటివారిదని యొక యాసనము కవిస్థానములలో నేర్పడియున్నది. ఈ ధూర్జటికవి శ్రీకృష్ణరాయలవంటి ప్రభువు కాలమునఁ దాను రచించిన శ్రీ కాళహస్తి మాహాత్మ్యమును నరాంకితము సేయక కాళహస్తీశ్వరునకే యంకితమిచ్చెను. దీనినిబట్టి యిట్టి శివభక్తుండైన మహాకవి విష్ణుసేవాపరుడైన కృష్ణదేవరాయల యాదరాభిమానములకుఁ బాత్రుఁడై యుండుట శ్రీకృష్ణరాయల సర్వమత సహిష్ణుతకుఁ దార్కాణమై యున్నది. పై విషయములఁ బరామర్శించినచో ధూర్జటికవి శివభక్తుఁడనియు, స్వతంత్రుడనియుఁ దెలియవచ్చుచున్నది.

ఈ కవీశ్వరుని పౌత్రుఁడు కుమారధూర్జటి. అతఁడు కృష్ణరాయ విజయమను గ్రంథమును రచించెను. ఆ గ్రంథమున నతఁడు ధూర్జటికవికి బౌత్రుఁడనని చెప్పికొనియున్నాఁడు. మీఁదుమిక్కిలి యా గ్రంథమున "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో యతులిత మాధురీమహిమ" "నామును మీ పెదతాత చాల సన్నుతిఁ గనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభ" ననుచుఁ జెప్పెను. కావున ధూర్జటికవి శ్రీకృష్ణదేవరాయల యాస్థానము నలంకరించి

యుండి రాజుగారి యాదరాభిమానములకుఁ బాత్రుఁడైయుండెనను టకు సందేహముండదు. మఱికొందఱీ పద్యమును బురస్కరించు కొని ధూర్జటికవి వేశ్యాలోలుఁడని తూలనాడిరి. ఒకనాటి సభలో నీ సమస్యను బూరించుటకుఁ దక్కినవారందఱు మిన్నకయుండఁగాఁ దెనాలి రామకృష్ణకవి మాత్రము లేచి యాశువుగా నిట్లు పూరించెనఁట.

చ॥ స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో
యతులిత మాధురీమహిమ హా తెలిసెన్, భువనైక మోహనో
ద్ధతసుకుమార వారవనితాజనతాఘన తాపహారి సం
తతమధురాధరోదిత సుధారసధారలు గ్రోలుటం జుమీ.

అని పూర్తిజేసి ధూర్జటికవికి వేశ్యారతుఁడని యొకనింద నాపా దించిరి. ఈతనికి నిజముగనో అబద్ధముగనో యట్టినింద వచ్చి యుండనోపును గాని యీ గ్రంథము నామూలాగ్రముగఁ జదివిన వారికీతని భక్తివైచిత్ర్యంబు గోచరింపకపోదు. మహాకవులకు వార వనితాసక్తి నారోపించుట మన వాఙ్మయమునఁ గ్రొత్తవిషయము గాదు. శ్రీనాథుఁడు, పినవీరభద్రుఁడు మొదలగువారిట్టి యారో పణలకు గుఱియైరి.

ధూర్జటికవి శివభక్తి సామాన్యమైనది కాదు. 'శివాత్పరతరం నాస్తి' యని దృఢముగా నిర్భయముగా నమ్మిన భక్తుఁడు. ఇతని పౌత్రుండైన కుమారధూర్జటి పుత్రుఁడు లింగరాజుకవియను నతఁ డొక కాళహస్తి మాహాత్మ్యమును వ్రాసెను. పరిమాణమున ధూర్జటి మునిమనుమని పొత్తంబు మిన్నయై యున్నది. ఈ రెండు గ్రంథము లకును మూలములు వేఱుగా నున్నవి. సంస్కృతముననున్న కాళ హస్తి మాహాత్మ్యమను నారధ్యాయముల గ్రంథ మీ ధూర్జటికవి గ్రంథమునకును, శివరహస్యమను శైవగ్రంథ మీ లింగరాజకవి గ్రంథమునకును మాతృకలై యున్నవి. ఈ రెండు గ్రంథము లలోఁ గథాక్రమంబు భేదించుచున్నది. నత్కీరుని చరిత్ర మీ

లింగరాజు గ్రంథమున లేదు. ధూర్జటికవి శ్రీ కాళహస్తి మాహాత్మ్యమునే గాక కాళహస్తి శతకమును గూడ వ్రాసెనని కొంద అందురు. కాని యా శతకకవిత్వ మీతని కవిత్వముతో సామ్యమును బొందకుండుటచే నది యీతని కృతమైనది కాదందురు.

-: కవిత్వము :-

స్థలపురాణములకెల్ల మూలకందమైన స్కాంధపురాణంబున నున్న కాళహస్తి క్షేత్రమాహాత్మ్యమను కథయే యీ ప్రబంధమందలి యితివృత్తము. ఆ కథను మూలాధారముగాఁ జేసికొని మఱికొన్ని కథలను జేర్చి ధూర్జటి యీ ప్రబంధమును నాల్గాశ్వాసములతో సంతరించెను. స్తుతమతియైన ధూర్జటి కవిత్వ మతులిత మాధురీమహిమతో నొప్పుచున్నదనిన నతిశయోక్తి కానేరదు. ''నవ్యభాషాశతధానిగుంభన రసస్థితి''నుండునని గ్రంథారంభముననే చెప్పెను. ప్రపౌత్రుఁడు లింగరాజు తన గ్రంథమున ''సారసుధాసార సరసోక్తి గుంఫన'' మని వర్ణించెను. ఇంతయేల కృష్ణరాయలె యతులితమాధురీమహిమను గల్గియున్నదని యుగ్గడించెను. ఈ కవియందు శృంగారవేదాంతములు సమన్వయంబును బొందినవి. ఈ గ్రంథమును భక్తిరసప్రధానంబైన నొక మహాకావ్యముగ రచించి, యద్దాని కుండవలసిన లక్షణములను, నాయా రసములను, నాయా సందర్భముల సమయోచితముగా వర్ణించి, నాటి కవులలో వన్నెకెక్కెను. ఈతని కవిత్వమందు సంస్కృతాంధ్రపదంబు లించుమించుగా సమానముగా నుండును. జాతీయములగు నుడికారముల మేలిమి కీతఁడు పెన్నిధి. ఇతఁడు వాడిన లోకోక్తులు లెక్కకు మిక్కుటములు. ఇందలి భావములు భాషయుఁ దూకముగల్గి సమాన గౌరవమును బొందియున్నవి. గీర్వాణాంధ్రములు రెండును నీతనికి నామూలాగ్రముగా వాచోవిధేయములు. ఇతని వక్తృత్వమహిమకు హద్దులేదు. శైలి రసభూయిష్టమై స్వాభావికవర్ణనములతోఁ బ్రవాహరూపమును బొందియుండును. శైలియందు మాధుర్యముతో నోజస్సును, సౌలభ్యముతోఁ బుష్టియు, వేగముతో గాంభీర్యమును

జతపడియున్నవి. కొన్ని వ్యాకరణవిరుద్ధములైన నిరంకుశ ప్రయోగము లీతని నిరంకుశ పదప్రయోగాభిమానమును జాటుచున్నవి. అట్టి నిరంకుశపదములు చంద్రబింబమునఁ గళంకమువోలెఁ బరిహరింపఁదగినవి.

[వీరనృసింహ యాదవభూపతి యీ పుణ్యక్షేత్రమునకు శ్రీ కాళహస్తి యనునామ మెట్లు వచ్చినదని యడుగఁగాఁ గైతవ జంగమ మునివేషమున నున్న శివుం డిట్లని చెప్పెను.]

## శ్రీ కాళహస్తి

శ్రీ యనఁగా సాలెపురుగు. కాళ మనఁగా సర్పము; హస్తి యనఁగా నేనుఁగు. ఈ మూఁడును ముక్తినందిన స్థలము గావున నద్దానికి 'శ్రీకాళహస్తి' యనిపేరు వచ్చినది. అట్టి పుణ్యక్షేత్ర మాహాత్మ్యమును వర్ణించు గ్రంథము గావున దీనికి శ్రీ కాళహస్తి మాహాత్మ్యమను నామము సార్థకముగా నున్నది.

కృతయుగమున నొక సాలెపురుగు జన్మాంతర వాసన నా దేవదేవుని బూజింపఁగోరి, సువర్ణముఖియందు జలకమాడి, తన నోటినుండి వెలువడిన దారముతో నా దేవదేవునకు నాతని పరివారమునకుఁ బ్రాకారములు, గోపురములుమున్నగునవి నిర్మించుచు, గాలికిఁ దెగిన పోగులను జాఱిపోయిన పోగులను దిరుగ నల్లుకొనుచు నిరంతరముఁ దీరిక లేకయే సేవించుచుండెను. ఒకనాఁ డా దేవదేవుఁ డా పురుగుభక్తిని పరీక్షింపఁగోరి, తన యావాసముననున్న దీప శిఖలచే నూర్ణనాభము నిర్మించుకొన్న గోపురాదుల నన్నింటిని దగ్ధములగునట్లు గావించెను. తాను శ్రమపడి నిర్మించిన గోపురాదులన్నియు నొక్కక్షణంబులో దగ్ధంబులగుటకు మిక్కిలి చింతించి, తన జీవితంబునఁగల మోహంబును విడిచిపెట్టి, యందులకుఁ గారణమైన దీపంబుపైఁ గినుక వహించి, యొక్కపెట్టున నా దీపమును మ్రింగఁబోయెను. శివుఁడా సాలెపురుగు భక్తిని మెచ్చుకొని ప్రత్యక్షమై ముక్తిం బ్రసాదించెను.

త్రేతాయుగంబున నొక కాళంబు ప్రత్యహంబును బాతాళంబునుండి వచ్చి నవరత్నంబులతో శంభులింగంబు నర్చించి పోవుచుండెను. ఇట్లుండ ద్వాపరయుగం బారంభమయ్యెను. ఒక యేనుఁగా దేవదేవుని బూజించుటకు వచ్చి కాళంబు సమర్పించి పోయిన రత్నంబులం దొలగించి, తాను దెచ్చిన నానావిధ ఫల పుష్పాదులైన పూజాద్రవ్యంబులతోఁ బూజించుచుఁ దనతొండంబున బీల్చియున్న నీరంబులతో నా లింగంబున కభిషేకముఁ జేయుచుండెను. ఇట్లు కాళంబును హస్తియు వేర్వేఱు వేళలలో వచ్చి, తొలినాటి తమ పూజాద్రవ్యంబులం గానక మిక్కిలి వంత జెందుచుండెడివి. ఇట్లు కొంతకాలంబు జరుగఁగా, వీరిద్దరికి స్పర్ధలు వృద్ధియై పరస్పర వైషమ్యము మెండుకొనియెను. తుదకు నాగంబులు రెండును దమ పూజాద్రవ్యంబులఁ బాడుచేయువానిని వధింపవలెనని నిశ్చయించుకొనినవి. మఱునాఁ డరుణోదయంబున వ్యాళంబాలయంబున కరుగుదెంచి, తొలినాఁడు తా నర్పించిన పూజామణులు లేమిఁ గడువగచి, విఘ్నకర్తను గఱచుటకు నిశ్చయించుకొని, సూక్ష్మ రూపంబునఁ బూజాద్రవ్యంబుల మధ్య దాగియుండెను. అంత హస్తియు నరుదెంచి, తొలినాటి తన పూజాద్రవ్యములు చెదరి పోకుండుటకు మిక్కిలి సంతసించి వెంటనే కాన కేగి నూతనంబులైన ఫలపుష్పాదులఁ గొని తెచ్చి యచ్చట నుంచుటకుఁ దొండంబు సాఁచెను. అంత నఁట దాగియున్న నాగంబు వెల్లగా దాని నాసారంధ్రంబునుండి కుంభకుహరము దూరి, మూర్ధంబున కెగఁబ్రాకెను. ఆ బాధను భరింపలేక దంతావళంబా దక్షిణ కైలాసంబును వధ్యశిలగాఁ గావించుకొని, తద్గిరిసానువులను గ్రుద్దుకొనుచుఁ బరుగిడ సాగెను. తుట్టతుదకు బాధ మిక్కుటమగుటంజేసి శివునిదిక్కు మొగంబై కుంభము బ్రద్దలగునట్లు గ్రుద్దుకొనెను. వెంటనే కుంభము పగిలి నాగంబులు రెండును మరణించెను. మృతినొందుటయే తడవుగా హస్తియు, కాళంబును ప్రమథగణ రూపంబులు దాల్చినవి. పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై యా రెంటికిని ముక్తిని ప్రసాదించిరి. అట్లు ముగ్గురును ముక్తినొందిన పుణ్యా

క్షేత్రము గావున నీ పుణ్య స్థలంబునకు శ్రీ కాళహస్తి యను పేరు సార్థకమైనది. అట్టి పుణ్యక్షేత్ర మాహాత్మ్యమును బ్రకటించునది గావున నీ కావ్యమునకు శ్రీ కాళహస్తి మాహాత్మ్యమను నామము సమంజసముగా నున్నది.

## పూ ర్వ క థ

శ్రీలకు నాలవాలంబైన మధురానగరంబున నత్కీరుండను ద్రావిడ మహాకవి యొకఁడు నివసించుచుండెను. అతఁడా నగరాధీశ్వరుఁడైన పాండ్యభూపాలుని యాస్థానకవిగా నుండెను. పాండ్యభూపాలుని యాస్థానకవీశ్వరులలో నత్కీరుఁ డగ్రగణ్యుఁడు. కొండొక కాలంబున నాదేశంబు దురంతంబగు ననావృష్టి మూలమున దుర్భిక్షకు లోనయ్యెను. క్షామపీడనంబునఁ బ్రజానీకంబు స్వదేశంబు విడిచి పరదేశంబులకు వలస బోవుచుండిరి. అన్నగరంబునఁ గల హరద్విజుండైన పూజారి యొకఁడు క్షామంబునకు వెఱచి యెందేనిం బోవ నుద్యుక్తుఁ డగుచుండెను. అంత నంతకాంతకుండైన శివుండు ప్రత్యక్షమై, యాతని యుద్యమంబును నిరోధించి, యా నగరం బేలుచున్న పాండ్యభూపాలునిపై నఱవబాసలో హృద్యంబులైన పద్యంబుల వ్రాసియిచ్చి, యీ పద్యంబులను జదివినచో పాండ్యభూపాలుండు వేయిమాడలు ముడుపిచ్చునని చెప్పి యంతర్హితుండయ్యెను. హరద్విజుండును హర్షంబున నా పద్యంబులఁ గైకొని రాజాస్థానమునకుం జని, రాజునకుఁ జూపెట్టెను. తదాస్థానమున నున్న నత్కీరుఁడా పద్యంబునందున్న వర్ణనము నాక్షేపించెను:—"సింధుర రాజగమనా ధమ్మిల్ల బంధంబు సహజగంధం" బని యుండుటంజేసి నత్కీరుఁడు నవ్వి "లోకము నగదే పూనుకొని సహజగంధము వేనలికిం గలదటన్న వేయు తెఱగుల" నని పరిహసించి "తప్పిది చెప్పరాదు కవితాసమయంబున కొప్పుగా" దని యాక్షేపించెను. అందులకు హరద్విజుండు ఖిన్నుండై నత్కీరుని యాక్షేపంబునకుఁ దగిన సమాధానంబు జెప్పుటకుఁ దగిన యోగ్యత లేమికిఁ జింతించుచుఁ గడుచిన్నవోయి గృహోన్ముఖుం

డయ్యెను. మఱలిపోయి యీ పద్యము నప్పరమేశ్వరునకే యిచ్చి తాను రాజసభలోఁ బొందిన యవమానమును బూసగ్రుచ్చినట్లు వక్కాణించి, యెందేఁబోయి జీవించెదనని చెప్పి వెళ్లిపోయెను. ఈశ్వరుండా వృత్తాంతంబును విని కుపితుండై పాండ్యనరేశ్వరుని నగరంబునకుఁ జని రాజసభకుఁ బోయి నత్కీరునితోఁ దన వాదంబును దెల్పి యాతని వాదంబును ఖండించి నత్కీరుని మాత్సర్యంబును దూలనాడి కుష్ఠవ్యాధిం దపియింపుమని శపించెను.

అంత నత్కీరుండు తానొనరించిన యపరాధమునకుఁ బశ్చాత్తప్తుఁడై వంతనొందుచుండ, శివుండు గరుణించి కైలాస శైలంబుఁ గన్న రుజ మానునని శాపావధిఁ దెలియఁ జేసెను. అంత నతండు చింతాక్రాంతుఁడై తీర్థయాత్రకు బయలు వెడలెను. మధ్యేమార్గంబున ననేక పుణ్యక్షేత్రంబులనుదర్శించి, పుణ్యనదులలోఁ గ్రుంకుచుఁ గతిపయ పయనంబులు జఱిపి నడువనోపిక లేక బడలి శరీరమునఁ జీము నెత్తురు జిప్పిలగా, నీగలు ఝుమ్మనరేఁగి యీడ నిర్మానుష్యంబైన కానన మధ్యంబునఁ జిక్కి దిక్కుఁగానక యొక్కెడ తమ్మికొలను గాంచెను.

## కథాసంగ్రహము

అది యొక తమ్మికొలను. ఆకొలను తీరంబున నొక వట వృక్ష ముండెను. ఆ వటవృక్షచ్ఛాయను నత్కీరుఁడు విశ్రమించెను. ఆ వృక్షం శాకసంబు నొరయుచుండెను. తదీయ పలాశంబులు భూదేవి ధరించిన పట్టుపుట్టముయొక్క మేలు కట్టుగా నుండెను. ఊర్ధ్వశాఖలు దేవతలకు మరకతములు పొదిపిన హర్మ్యములుగా నుండెను. వ్రేలాడు కొమ్మలు మునిజనంబులకుఁ బర్ణశాలాకలాపములుగా నుండెను. దిగంతములవఱకు వ్యాపించిన నీడ చక్రవాళ పర్వతమునందలి హరిణములకుఁ బచ్చికబయలుగా నుండెను. గయయందుఁ బ్రసిద్ధివహించు నక్షయవటంబు చందంబుననున్నయట్టి మఱ్ఱిచెట్టుక్రిందఁ దదీయశాఖాశైత్యంబున కత్యంత సంతోషాంతరంగుఁడై నత్కీరుండు కూర్చుండియుండెను.

ఆ వృక్షమునుండి రాలిన పండుటాకులు, బయటఁబడినవి విహంగములుగాను, జలంబులఁ బడినవి మీనంబులుగాను మాఱి పోవుచుండెను. అందొక్క పండుటాకు జలాశయంబున సగంబును, దటప్రదేశమున సగంబునుబడి మీనపక్షిత్వంబులఁ బొంది, లోపలి కిన్నేలు పలికిం దిరుగు విచిత్రంబును నత్కీరుండు చూచి యాశ్చర్య చకితుం డయ్యెను. ఆ సమయంబున నా భూజంబునుండి భయంకర మైన భూతం బొకటి వికటాకృతితో వెలువడి యాతని మ్రింగి వేయుటకుఁ దార్కొనెను. నత్కీరుండు భయకంపితుఁడైయుండ భూతంబు వికటాట్టహాసంబు జేయుచు నత్కీరుని నోటఁగఱచుకొని తన గుహలోనికిఁ దీసికొనిపోయెను. పూర్వంబా భూతంబు వాతఁ బడిన మనుజు లనేకు లా గుహలో నిర్బంధింపఁబడియుండిరి. నత్కీరుండును నచటనే నిర్బంధింపఁబడెను. అట్లు నిర్బంధించినవారి నందఱ నొకేపర్యాయం బాహారంబుగాఁ గొనఁదలఁచి, బిల ద్వారంబు నొక పెద్దరాయితో మూసివైచి, తమ్మికొలనియం దుదకమాడఁబోయెను. అయ్యదనుఁ బురస్కరించుకొని యచటఁ బూర్వము బంధింపఁబడియున్న మనుజు లీ విధముగాఁ జెప్పిరి. "అయ్యా! ఈ భూతంబీ నాటికి నూఱ్వుర బంధించినది. ఈ నూఱ్వుర నీనాఁడే కాహారముగా మ్రింగివేయును. ఆ పరమేశ్వరుం డేమి సేయునో చూచెదముగాక" యని పలికిన పలుకుల నాలకించి నత్కీరుండు సభక్తికముగాఁ దారకదమనుండైన సుబ్రహ్మణ్య స్వామి ననేకవిధంబుల స్తోత్రముఁ జేసెను. షడాననుం డనుకంపాత రంగితాపాంగుండై నత్కీరుని మొఱాలకించి సాక్షాత్కరించెను. కుమారుండు సర్వంబును నెఱింగి భూతంబును సంహరించి బిల ద్వారంబునఁ గల రాతిని దిగిచివైచి, యచటఁ గలవారి నందఱిని వెడలిపొండని యనుగ్రహించెను. వా రానందంబున నిందు శేఖరు నందనుని సందర్శించి వందనం బాచరించి యెందేనియుం జనిరి.

నత్కీరుండును బునఃప్రణామం బాచరించి, కర్మవశంబునఁ దనకు సంప్రాప్తించిన విపత్తును, శివుండు శపించిన వృత్తాంతంబును శాపావధియుఁ గరతలామలకంబుగ విన్నవించుచు "స్వామీ!

నే నేలాగున కైలాసంబును దర్శింపఁగలను. అది నాకు సాధ్య మగునా? కైలాసంబును దర్శించినఁగాని నాకు శాపవిముక్తిగలుగదు. నా కేదేని యుపాయంబును జెప్పి నన్ను గాపాడు'' మని వేఁడు కొనెను. అందులకుఁ గుమారుండు శివుండు కైలాసమును జూడ వలయునని చెప్పెను గాని, యుత్తరదిశాకైలాసమని చెప్పలేదు. కావున నీవు దక్షిణకైలాసమగు కాళహస్తీశ్వరుని గిరిని సందర్శించినఁ గైలాస దర్శనఫలంబు లభించును. నీకు విధివశంబున సంప్రాప్తిం చిన కుష్ఠరుజ మానిపోవునని జెప్పి, సులభముగా దక్షిణ కైలాసం బును దర్శింపఁగల యుపాయము నాత్మఁ దలపోసి, యీ తమ్మికోలని యందు జలకమాడిన నీ కైలాసంబు సన్నిహితంబగునని చెప్పి షడాననుం డంతర్హితుండయ్యెను.

అంతనత్కీరుండు కుమారుం డాదేశించిన క్రమంబున నత్తమ్మికోలనియం దత్యంత నిష్ఠం జలకమాడి తలమెత్తగా సువర్ణముఖీ నదీతీరంబునఁ గల కైలాసంబు గానవచ్చెను. కుష్ఠవ్యాధి యంత రించి విశుద్ధదేహుఁ డయ్యెను. అయ్యవసరంబున నత్కీరుండు సంతోషాంతరంగుఁడై, సభక్తికంబుగా శ్రీ కాళహస్తీశ్వరుని గూర్చి స్తుతి శతకముతో స్తోత్రముఁ జేసి తన కవిత్వమును సార్థకపఱచు కొనెను. అతని భక్తికిఁ బ్రీతుండై శివుండు జ్ఞానప్రసూనాంబికా సమేతుండై ప్రత్యక్షమయ్యెను. నత్కీరుఁడును భక్తిపారవశ్యంబున నిటలంబున నంజలిఘటియించి నిటలాక్షు నీ సంసార వ్యామోహం బునుండి తరింపఁజేసి శాశ్వత సుఖంబును బ్రసాదింపమని ప్రార్థించెను. శ్రీ కాళహస్తీశ్వరుఁ డాతని భక్తికిమెచ్చి సాయుజ్యమును బ్రసా దించెను. నత్కీరుఁడు శంకరుని తేజంబున లీనంబై శాశ్వతానం దమును బొందెను.

—:0:—

# శ్రీ కాళహస్తి మాహాత్మ్యము



## ప్రతిపదార్థ తాత్పర్యాదులు

1. తన = తనయొక్క (ఆ వటవృక్షముయొక్క); పలాశ = ఆకుల యొక్క; శ్రేణి = సమూహము; ధరకున్ + అంతటికిన్ = ధరకంతటికిన్ = భూమికంతటికిని; పచ్చ = పచ్చనైన; పట్టుపుట్టంబు = పట్టువస్త్రముయొక్క; మేల్కట్టు + కాఁగాన్ = చాందినికాఁగా (మేలుకట్టు = చాందిని, ఉల్లడము. ఇచట పట్టుపుట్టంపు మేల్కట్టని కర్మధారయ సమాసముగా గ్రహించి పట్టు వస్త్రరూపమైన చాందిని యని యర్థమును జెప్పుకొనినచో సమంజసముగా నుండ నోపును); తన = తనయొక్క (ఆ వటవృక్షముయొక్క); ఊర్ధ్వశాఖా=చివరి కొమ్మలయొక్క; వితానంబు = సమూహము; సురలకు = దేవతలకు; మరకత= పచ్చలచేత; రచిత = పొదుపఁబడిన; హర్మ్యములు కాఁగాన్ = మేడలుకాఁగా; తన = తనయొక్క (ఆ వటవృక్షముయొక్క); వ్రేలు + కొమ్మలు = వ్రేలాడు కొమ్మలు; మునులకు = ఋషులకు; కల్పిత = కల్పింపఁబడిన; పర్ణశాలా=ఉటజ ములయొక్క; ఆకుటిండ్లయొక్క; కలాపములు + కాఁగాన్ = సమూహములు గాఁగా; తన = తనయొక్క (ఆ వటవృక్షముయొక్క); దిశాంత=దిగంతముల వఱకు; భ్రాంత=వ్యాపించిన, ప్రసరించిన, (భ్రముసంచలనేయని ధాత్వర్థము); ఘన = గొప్పదియగు; విటపచ్ఛాయ = చిగిరించిన కొమ్మలనీడ; వలయ+అద్రి = చక్రవాళ పర్వతమునందలి; హరిణ = జింకలకు; శాద్వలము + కాఁగాన్ = పచ్చికనేల కాఁగా (నాలుగు పాదములయందును రూపకాలంకార మున్నది); వాలఖిల్య = వాలఖిల్యులనెడి; ముని + ఈశ్వర = మునీశ్వరుల సమూహమునకు; ఆవాసము + ఐన = నివాసస్థానమైన; రోహణమురీతిన్ = రోహణపర్వతము వలె, రత్నగిరివలె ( ఉపమాలంకారము); పితృముక్తి దేహమగుచున్ = పితృ దేవతలకు ముక్తిని ప్రసాదించునట్టి స్థానమగుచు; గయన్ = గయయనెడి పుణ్య క్షేత్రమునందు; ప్రసిద్ధివహించు=ప్రఖ్యాతివహించిన; అక్షయవటంబు=ఎన్నటి కిని నశించని వటవృక్షము; చందమునన్ = విధముగా; ఉన్న = ఉండునట్టి; ఒక మఱ్ఱిక్రిందికిన్ = ఒకానొక మఱ్ఱిచెట్టుక్రిందికి; ఏగి = పోయినవాఁడై (ఉప మాలంకారము).

తా. ఆ వటవృక్షముయొక్క యాకులు భూదేవికిఁ బచ్చని పట్టువస్త్ర రూపమైన చాందినిగాను, చివరికొమ్మలు దేవతలకుఁ బచ్చలుపొదిపిన హర్మ్యములు గాను, వ్రేలాడు కొమ్మలు మునీశ్వరులకుఁ బర్ణశాలలుగాను, దిగంతములవఱకుఁ బ్రసరించిన నీడ చక్రవాళపర్వతమునఁగల హరిణములకుఁ బచ్చికనేల గాను నుండెను. అట్టి వటవృక్షము వాలఖిల్య మునీశ్వరులకు నివాసస్థానమైన రోహణ

పర్వతము చందంబునను, గయయనెడి పుణ్యక్షేత్రంబున పితృముక్తికి నిలయంబై మిక్కిలి ప్రసిద్ధివహించిన యక్షయవటంబు చందంబునను నుండెను. అట్టి విశిష్ట మైన వటవృక్షము క్రిందికి నత్కీరుఁడు పోయెను.

అలంకారము :— రూపకాలంకారము.

ఈ పద్యమునందు వటవృక్షముయొక్క పలాశములు భూమికిఁ బట్టువస్త్ర రూపమైన చాందినిగాను, చివరి కొమ్మలు సురలకు హర్మ్యములుగాను, వ్రేలాడు కొమ్మలు మునులకుఁ బర్ణశాలలుగాను, దిగంతముల వఱకు వ్యాపించిన నీడ వలయాద్రి హరిణ శాద్వలముగాను నుండెనని రూపింపఁబడినది. ఇచట నుపమానోపమేయముల కభేదము చెప్పఁబడినది. కావున నిది రూపకాలంకార మగుచున్నది.

ఉపమాలంకారము:- ఆ వటవృక్షము "వాలఖిల్య మునీశ్వరా వాసమైన రోహణము రీతి" యున్నదనియు "పితృముక్తి దేహమగుచు గయఁబ్రసిద్ధివహించు నక్షయవటంబు చందమున" నున్నదనియు వర్ణించియుండుటంజేసి రెండు చోట్లను ఉపమాలంకారమున్నది. ఉపమానోపమేయములకు సాంగమైన సామ్యము స్పష్టముగా నిరూపింపఁబడినది కావున నీ రెండును నుపమాలంకారములైనవి.

వ్యా. వి. వ్రేలు + కొమ్మలు = వ్రేలుఁగొమ్మలు. (వ్రేలుగొమ్మలని గ్రంథములో నున్నది. ఇది సాధుపాఠము గాదు.)

సూ. సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. (ఉ॥ వ్రేలు+ను+కొమ్మలు). సూ. ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు (ఉ॥ వ్రేలు+ను+గొమ్మలు). సూ. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు (ఉ॥ వ్రేలుఁగొమ్మలు.)

వ్యా. వి. పట్టుపుట్టంబుమేల్కట్టు = పట్టుపుట్టముయొక్క మేలుకట్టు (షష్ఠీతత్పురుష సమాసము).

పాఠాంతరము :— పట్టుపుట్టంపు మేల్కట్టు = పట్టువస్త్రరూపమైన మేలుకట్టని విగ్రహము జెప్పనచో కర్మధారయ సమాసమగును.

వ్యా. వి. 1. వలయ + అద్రి = వలయాద్రి (సవర్ణ దీర్ఘ సంధి).
2. న + క్షయ = అక్షయ (నఞ్ తత్పురుషసమాసము).

**సూ.** అజాది సుబంతము పరమగునేని నఞ్ యొక్క 'న' కారము 'అన్' గాను, హలాది సుబంతము పరమగునేని 'అ' గాను మాఱును.

2. తదీయ = ఆ వటవృక్షముయొక్క; శాఖా శైత్యంబునకున్ = కొమ్మలయొక్క చల్లదనమునకు; అతి+అంత = అత్యంత = మిక్కిలి (యణాదేశసంధి); తత్ +వటంబునుండి = ఆ మఱ్ఱిచెట్టునుండి; పండుటాకులు = పండి

పోయిన యాకులు; బయట+బయట = బట్టబయట = వెలుపలిభాగమున; విహంగములు = పక్షులు; జలంబులన్ + పడినవి=నీటిలోఁ బడినవి; మీనంబులు= మత్స్యములు; పలాశము = ఆకు; జల+ఆశయంబునన్ = కొలనియందు; తట ప్రదేశంబునన్ = ఒడ్డునంచు, గట్టుపైన; మీనపక్షిత్వంబులన్ = మత్స్యము యొక్కయు పక్షియొక్కయు రెండునుకలిసిన రూపమును; తివియు = ఆకర్షించు; చమత్కారము = నేర్పు; అద్భుతపరవశుఁడై = ఆశ్చర్యముచేఁ బరాధీనుఁడై (ఆశ్చర్యముచే నొడలు మఱచినవాఁడై).

తా. ఆ మఱ్ఱిచెట్టుయొక్క విశాలములైన కొమ్మల చల్లదనమునకు మిక్కిలి సంతోషించి యచట నాసీనుఁడై యుండెను. ఆ వృక్షమునుండి రాలిన పండుటాకులు బయటఁ బడినవి పక్షులుగాను, జలములఁ బడినవి మత్స్యములు గాను మాఱిపోవుచుండెను. అందొక్క పండుటాకు కొలనియందు సగమును దట ప్రదేశమున సగమును బడి మీనపక్షిత్వమైన యాకారమును బొంది, లోపలికి వెలుపలికిఁ దిరుగు వైచిత్ర్యమును నక్కీరుం డాశ్చర్యముతోఁ దిలకించుచుండెను.

వ్యా. వి. 1. పండు+ఆకులు = పండుటాకులు (టుగాగమసంధి).

సూ. కర్మధారయంబు లందుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగును.

వ్యా. వి. 2. బయట+బయట = బట్టబయట (ద్విరుక్తటకారసంధి).

సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు.

వ్యా. వి. 3. అతి+అంత = అత్యంత (యణాదేశసంధి).

సూ. ఇ, ఉ, ఋ, ౠ వర్ణములకు సవర్ణములుగాని యచ్చులు పరమైన యెడల య, వ, ర, ల వర్ణములు క్రమముగా వచ్చును. (దీనిని సంస్కృత వ్యాకరణజ్ఞులు యణాదేశసంధి యందురు).

జల+ఆశయము = జలాశయము (సవర్ణదీర్ఘ సంధి).

వ్యా. వి. 4. కొలను—ఏకవచనము—కొలఁకులు—బహువచనము.

సూ. కలన్వాదుల నువర్ణంబుకుఁ గ్జగు; బహువచనము పరంబగునపుడు నిత్యముగానగును.

8. క్రూర = భయంకరమైన; నిరీక్షణ=చూపులయొక్క; ప్రభలన్ = కాంతులతోఁ గూడిన; గ్రుడ్డులు = కనుగ్రుడ్లు; కోఱలున్ = దంష్ట్రిలును; ఊర్ధ్వకేశముల్ = పైకి నిక్కబొడుచుకొన్న వెండ్రుకలు; నీరద=మేఘమువలె;

నీల = నల్లనైన; గాత్రమును = శరీరమును; నిష్ఠురవాక్యములు = కర్కశభాషణములును; అట్టహాసముల్ = వికటములైన నవ్వులును; ఫేరవ = నక్కయొక్క; కంఠనిస్వనము=కంఠమునందలి వికటమైన స్వరమువంటి కంఠస్వరమును; భీకర= భయంకరమైన; హేతియుక్ = ఆయుధమును; మానవ = మనుష్యులయొక్క; అస్థిహారము = ఏముకల దండయొక్క; ఆరవములు = శబ్దములు (కదలునప్పుడు ఎముకల దండలోని ఎముకల రాపిడిచేఁ గల్గిన శబ్దములని భావము); చెలంగఁగ్ = ఒప్పియుండఁగా; వికట+ఆకృతిన్ = వికటమైన రూపముతో; ఒకభూతము= ఒకానొక భూతము; ఆతనిన్ =ఆనత్కీరుని (తరువాతి పద్యముతో నన్వయము)

తా. భయంకరమైన చూపులతోను, మిడిగ్రుడ్లతోను, కోఱలతోను; పైకి నిక్కబొడుచుకొన్న వెంట్రుకలతోను, నల్లని శరీరముతోను, కర్కశభాషణములతోను; వికటమైన నవ్వుతోను, నక్కస్వరమువంటి కంఠస్వరముతోను; భయంకరమైన యాయుధముతోను, ఎముకల హారము చేయు శబ్దములతోను భయంకరాకృతిని గల్గి యొకానొక భూతమా నత్కీరుని సమీపించెను.

వ్యా. వి. 1 హాసము+హాసము = అట్టహాసము (ద్విరుక్తటకారసంధి).

సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు.

వ్యా. వి. 2 మానవ+అస్థి = మానవాస్థి (సవర్ణదీర్ఘసంధి).
వికట+ఆకృతి = వికటాకృతి ( ,, )
హార+ఆరవముల్ = హారారవములు ( ,, )

4. పట్టికొని = బంధించుకొని; తనదు = తనయొక్క; గుహాకున్ =బిలమునకు; బెట్టిదముగన్ = ఉద్ధతితో, క్రౌర్యముతో; తెచ్చి = తీసికొనివచ్చి; మునుపు = పూర్వము; పెట్టిన = ఉంచిన; మనుజుల్ = మనుష్యులు; తట్టిన్+ పడిన = వలలోఁ బడిన (వేఁట తెరలోఁబడిన); పులుఁగులగతిని=పక్షుల చందమున; ఇట్టట్టుపడంగన్ = అడ్డదుడ్డముగాఁ బడునట్లు; ఉనిచి = ఉంచి; ఎంతయున్ = మిక్కిలి; వేడ్కన్ = కుతూహలముతో.

తా. భూతము నత్కీరుని బంధించి తన బిలమునకుఁ దీసికొని పోయెను. ఆ బిలములోఁ బూర్వము భూతము వాతఁబడిన మనుజులు వలలోఁ జిక్కుపడియున్న పక్షుల చందమున బంధింపఁబడియుండిరి. ఆ బిలమున నత్కీరునిగూడఁ బడవైచి మిక్కిలి కుతూహలముతో (తరువాతి పద్యముతో నన్వయము).

వ్యా. వి. తనదు గుహాకున్ = తన+గుహాకున్.

సూ. యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాషనగు.

5. వారలన్ = అట్లుబంధించిన మనుజులను; అందఱన్ = అందఱిని; ఏక+ఆహారముగాన్ = ఒకేసారి తినుటకు వీలైన యాహారముగా; కొనన్+తలఁచి = కైకొనఁ దలంపుగలదై; ఆ+అద్రి = అయ్యద్రి = ఆ కొండయొక్క (యడాగమము—త్రికసంధి); గుహ ద్వారమునన్ = బిలద్వారమున; రాయిన్ = పెద్దబండను; త్రోచి = ద్వారమున కడ్డముగా నెట్టి; మహారయమునన్ = మిక్కిలి వేగముతో; కొలనున్ = సరస్సునందు; ఉదకమాడఁగన్ = స్నానము జేయుటకు; పోవన్ = పోగా.

తా. భూతమా బిలంబున బంధింపఁబడిన వారినందఱి నొకే పర్యాయ మాహారముగాఁ గొనఁదలఁచి బిలద్వారమునొక పెద్దరాయితో మూసివైచి, సరస్సునం దుదకమాడఁ బోయెను.

వ్యా. వి. ఆ+అద్రి = అయ్యద్రి (యడాగమము, త్రికసంధి).
ఏక+ఆహారము = ఏకాహారము (సవర్ణదీర్ఘ సంధి).

7. ఏమి+చేయవచ్చున్ = ఇప్పుడేమి చేయఁగలము; ఇంతయున్ = కొంచెమైనను; మామీఁద; కరుణలేక = దయలేక; కమలగర్భుఁడు = కమలము గర్భమునందుఁ గలవాఁడు (విష్ణువు): ఇపుడు=ఈ యాపదసమయమున; నిన్నున్ = నిన్ను; తెచ్చిపెట్టెన్ = తీసికొనివచ్చి యుంచినాఁడు; నేఁడు=ఈ నాఁడు; ఇఁకన్ = ఇంకమీఁదట; అందఱన్ = ఇచట బంధింపఁబడిన వారినందఱిని; ఇతండు = ఈ భూతము; తినున్ = ఆహారముగాఁ దినును; వీని = ఈ భూతము యొక్క; తెఱఁగు = విధము, వైఖరి; వినుము = చెప్పెదము వినుమని భావము.

తా. భూతము జలకమాడఁబోగా నా బిలంబునఁ బంధింపఁబడియున్న మనుజులు నత్కీరునితో నిట్లనిరి. "మేమింకేమి సేయఁగలము. కమలగర్భునికి మాఁ మీద దయగలుగదాయెను. ఇంతలో నిన్నుగూడ బంధించెను. ఈ నాఁ డందఱిని నితండు తినివేయఁగల"డని చెప్పిరి.

8. ఈతఁడు = ఈ భూతము; మనుష్యులన్ = ఇచట బంధింపఁబడిన మనుష్యులనందఱిని; కనుంగొనునంతటిలోన్ = చూచుచుండఁగనే; నూఱుక+త్రావున్ = నూఱుకొని త్రాగివేయునని భావము (కొనికి కాదేశము వచ్చినది. ఇది సాధుపాఠము గాదు); నూఱువురు+ఐనన్+కాని = నూఱ్వురు మనుష్యులైనప్పుడుగాని; తినన్ = తినుటకు; నోటికినాటదు+అటంచున్ = నోటికి చాలదనియనుకొని; కూర్పగాన్ = ఒకచోటఁ బ్రోగుసేయఁగా; నేటికిన్=ఈ నాటికి; నీవును+కూడన్=నీతోఁగలిసి; మనుష్యులు; నూఱువురు+ఐరి=నూఱు సంఖ్య గలవారైరి; ఇంతటన్ = ఇంతటితో; నూఱును = నూఱు సంవత్సరముల ప్రమాణముగల మన యాయువును; నిండెన్ = పూర్తియైనది; ఇందఱకున్=ఈ

నూఱుమందికిని; అనుగ్రహము = ఏలుబడి, రక్షణము; ఈశ్వరుఁడు; ఏమి + చేయునో = ఏమి చేయఁగలఁడో చూచెదముగాక.

తా. ఈ భూతము చూచుచుండఁగనె మనుష్యుల నందఱిని నూఱుకొని మ్రాగివేయును. లెక్కకు నూఱ్వురు మనుష్యులైనప్పుడే యీతని నోటికి నే కాహారముగాఁ దినుటకు సరిపోవుదురు. నీతోఁగలసి యీనాటికి నూఱుసంఖ్య పూర్తియైనది. ఇంతటితో మనకును నూఱు సంవత్సరముల యాయువు పూర్తి యైనది. ఇంతయేల యందఱికిని నా పరమేశ్వరుఁడే రక్షకుఁడు. అతఁ డేమి సేయునో చూచెదముగాక.

9. అనవుడు = అనిచెప్పఁగా, నత్కీరుండును; మనమునన్ = మనస్సునందు; తలపోసి = ఆలోచించుకొని; దీనిన్ = ఈ ఘోరకృత్యమును; మానుపన్ = పోఁగొట్టుటకు; పురభిత్ + తనయుఁడు=ఈశ్వరుని కుమారుడైన; తారకదమనుఁడు = తారకాసురుని గీటడగించిన వాఁడైన కుమారస్వామి; తనకున్= తన పాలిటికి; కలుగంగన్ =కలిగియుండఁగా; ఇంకన్ = ఇఁకమీఁద;తలఁకు = భయము; ఏల + అనుచున్ = ఎందులకని యనుకొనుచు; (తరువాతి పద్యముతో నన్వయము).

తా. నత్కీరుం డా మాటలువిని మనంబున యోచించుకొని యీ యాపదను బాపుటకు నా పాలిటికిఁ దారక దమనుండైన యీశ్వరపుత్రుఁ డున్నాఁడు గదా యని భావించుకొని భయరహితుఁడై (తరువాతి పద్యముతో నన్వయము).

10. తారకదైత్య భంజనుఁడు = తారకాసురుని సంహరించినవాఁడును; దారుణశక్తిధరుండు = దారుణ = భయంకరమైన; శక్తి=శక్తియనెడి యాయుధమును: ధరుండు = ధరించినవాఁడును (ద్వితీయాతత్పురుష సమాసము); పన్నగాహారవహుండు = పన్నగ = పాములయొక్క; ఆహార = ఆహారముగాఁగల్గిన నెమలిని; వహుండు = వాహనముగాఁ గల్గినవాఁడు; దీనజన = దీనజనముల యొక్క; తామరభూజము = కల్పవృక్షమువంటివాఁడును; షణ్ముఖ = ఆరు మొగములయందలి; అట్టహాస = పెద్దనవ్వుయొక్క; ఆరభటీ = ఆర్భాటముచేత; విపాటిత = చీల్పఁబడిన; దిగంత = దిక్ + అంత = దిశాంతములనెడి; కటాహుఁడు = కాఁగులు గలవాఁడును (కుండలు గలవాఁడును); వీనిన్ = ఈ భూతమును; పట్టి = పట్టుకొని, బంధించి; సంహారము + ఒనర్చి = సంహరించి; ఇందఱన్ = ఇచ్చట బంధింపఁబడిన వారినందఱిని; కృప + అంబుధి + ఐ=దయయనెడి సముద్రముగలవాఁడై; బ్రదికించు + కావుతన్ = మరణమునుండి గాపాడును గాక.

తా. తారకాసురుని సంహరించినవాఁడును, భయంకరమైన శక్తియనెడి యాయుధము గలవాఁడును, నెమలి వాహనముగలవాఁడును, దీనజనములకుఁ దామరభూజమువంటివాఁడును, ఆరు మొగములయందలి పెద్దనవ్వుచేతఁ జీల్పఁబడిన దిశాంతములనెడి కాఁగులుగలవాఁడును నైన సుబ్రహ్మణ్యుఁడీ భూతంబును సంహరించి యిచ్చట బంధింపఁబడిన వారి నందఱిని రక్షించుఁగాక యని నక్కీరుఁడు సుబ్రహ్మణ్యస్వామిని ధ్యానించెను.

వ్యా. వి. హాసము + హాసము = అట్టహాసము (ద్విరుక్తటకారసంధి).
పన్నగ + ఆహార = పన్నగాహార (సవర్ణదీర్ఘ సంధి).

11, భూతముఁ=పిశాచమును; చంపుట=సంహరించుట; ఏ + అరుదు = ఏమి యాశ్చర్యము (చంపుటే = సంహరించుటయే, అరుదు + అ=ఆశ్చర్యమా అనియు పాఠాంతరమును గ్రహింపవచ్చును); బోరనఁ=శీఘ్రముగా ('భోరనఁ' అని ప్రయోగించియున్నాఁడు); తారకుఁ = తారకాసురుని; మన్ని + కొన్న = మన్నిగొన్న = హతమార్చిన, సంహరించిన; విఖ్యాత = మిక్కిలి ప్రసిద్ధివహించిన; మహాప్రతాపునకుఁ = గొప్ప పరాక్రమముచేతఁ గల్గిన తేజముగలవానికి; అద్రిగుహ + ఆలయము = కొండబిలమనెడి గృహము; ఏమిదొడ్డు = ఏమి గొప్ప ? (అదియొక గొప్పవిషయము గాదని భావము, (దొడ్డయొక్క రూపాంతరము దొడ్డు); నిర్ఘాతమువంటి = పిడుగువంటి; శక్తిఁ + కొని = శక్తియనెడి యాయుధమును చేతఁబట్టి; క్రౌంచముఁ = క్రౌంచపర్వతమును; చించిన = వ్రక్కలించిన; రౌద్రమూర్తికిఁ = భయంకర మూర్తికిని; వారితదేవత + ఆర్తికిఁ = నివారింపఁబడిన దేవతలయొక్క దుఃఖము గలవానికిని; భీతిఁ = భయమును; తోలంగఁ + చేయుట=పోఁగొట్టుట; ఒకపెద్దయే=పెద్దవిషయము గాదని భావము.

తా. సులభప్రాయముగాఁ దారకాసురుని సంహరించిన గొప్ప పరాక్రమవంతుఁడైన మేటివీరున కీ భూతమును హతమార్చుటొక లెక్కగాదు. ఈ బిలమును భేదించుటొక పెద్దవిషయమునుగాదు. పిడుగువంటి శక్తియనెడి యాయుధమును ధరించి క్రౌంచపర్వతమును వ్రక్కలించిన రౌద్రమూర్తికిని దేవతార్తిని బరిహరించినవానికిని భయమును బోఁగొట్టుటొక యాశ్చర్యమైన విషయము గాదు.

## పూర్వ గాధ

"క్రౌంచముఁ జించిన రౌద్రమూర్తికిఁ" క్రౌంచపర్వతము మైనాకుని కుమారుఁడు. దేవతలను బాధించుచు మహిషాసురుఁడు మొదలుగాఁ గల రాక్షసులు తఱుముకొనివచ్చి యీ పర్వతగుహయందు దాఁగుచుందురు. ఈ

పర్వత మట్లు రాక్షసులకు రక్షణముగా నుండుటంజేసి కుమారస్వామి దీనిని వ్రక్కలించెను. పరశురామునకుఁ గుమారస్వామికి విలువిద్యలోఁ బందెము జరిగినది. క్రౌంచపర్వతమును బాణముచే వ్రక్కలించుట యందలి విషయము. పరశురాముఁడు బాణమును ప్రయోగింపఁగా నయ్యది పూర్ణముగా వ్రక్కలింపఁ బడలేదు. కుమారస్వామి క్రౌంచమును బూర్ణముగా వ్రక్కలించి పందెమున నెగ్గెను. అట్లు కుమారుఁడు క్రౌంచమునఁ జేసిన రంధ్రమే హంసద్వారమని వ్యవహరింపఁబడినది. వర్షాకాలమున హంస లీరంధ్రమునుండి మానవసరోవర మునకుఁ బోవునని పురాణ ప్రతీతి. కాళిదాసు "హంసద్వారమ్ భృగుపతి యశోవర్త్మ" యని కీర్తించినాఁడు.

"కుమారః క్రౌంచదారణః". ॥అమరము॥

"కుంచ గుబ్బలి వ్రక్కలించిన బలుమేటి. ॥ఆంధ్రనామ సంగ్రహము॥

12. బ్రహ్మణ్య+ఉక్తి+యుక్తంబుగాక = బ్రహ్మణ్యోక్తి యుక్తంబు గాక = బ్రాహ్మణులకు హితమును గలిగించు మాటలతోఁ గూడినట్లుగా; ఇష్ట దేవతా వరేణ్యుండు = ఇష్టదేవతలలో శ్రేష్ఠుండును, భక్తశరణ్యుండును = భక్తులకు రక్షణమును గల్పించువాఁడును; సుబ్రహ్మణ్యున = కుమారస్వామిని; సన్నుతింపఁ = స్తోత్రముఁ జేయఁగా; అనుకంపా = దయచేత; తరంగిత = కల్లోలింపఁజేయఁబడిన; అపాంగుండు = కటాక్షము గల్గినవాఁడు; చండతర వేగంబునన్ = భయంకరమైన కోపవేగముతో; పయిన్+పడి = మీఁదఁబడి; భూతంబు; భూతలంబు+పయిన్+పడన్ = నేలపైఁ బడునట్లుగా: పెడచేతన్ = మీఁ జేతితో; అడిచి = అణఁగఁద్రొక్కి; తిగిచివైచి = తీసివేసి; త్రోసి వేసి; డెందంబులన్ = మనస్సులందు; ఇందుశేఖరనందను=ఈశ్వరుని కుమారుఁ డైన కుమారస్వామిని; సందడించుచుక = అతిశయముగాఁ జేయుచు; పునః ప్రణామంబు+అచరించి = మఱల నమస్కరించి; ప్రసన్నత+అంకురంబులు = సంతోషాంకురములు; ముఖపంకేరుహంబున = ముఖమనెడి పద్మమునందు; ప్రభవింప = ఉద్భవింపఁగా.

తా. నత్కీరుండు బ్రాహ్మణులకు హితమును గూర్చు విధముగా నిష్ట దేవతయు, భక్తరక్షకుఁడును నగు కుమారస్వామి ననేకవిధంబులుగా స్తోత్రముఁ జేసెను. కృపాన్వితమతియైన కుమారస్వామి ప్రత్యక్షుడై మిక్కిలి కోపవేగ మున భూతంబుపైఁబడి హతమార్చి బిలద్వారంబున కడ్డంబుగానున్న పెద్దరాతిని త్రోసివైచి, యచట నిర్బంధింపఁబడినవారి నందఱను వెడలుండని యనుగ్ర హించెను. వారందఱు వందనంబు లాచరించి కుమారు ననేకవిధంబు స్తుతించుచు నెందేని వెడలిపోయిరి. నత్కీరుండును మఱల నమస్కరించి ముఖపద్మంబున

సంతోషాంకురంబులు మొలకలెత్తగా నెదుట నిలిచియుండెను. కుమారస్వామి యాతనిరాకకుఁ గారణం బడుగఁగా నిట్లని విన్నవింపఁదొడఁగెను.

వ్యా. వి. బ్రహ్మణ్య+ఉక్తి = బ్రహ్మణ్యోక్తి (గుణసంధి)
ప్రసన్నత+అంకురంబులు = ప్రసన్నతాంకురంబులు.
(సవర్ణ దీర్ఘసంధి)
ముఖపంకేరుహము=ముఖమనెడి పద్మము (రూపకసమాసము)

(ముఖమేవ పంకేరుహమ్) పూర్వపదార్థము నుత్తరపదార్థమునుగా నిర్ధారించునప్పుడు రూపకసమాస మగును. ఇచ్చట ముఖము వేఱు. పంకేరుహము వేఱు. అయినను ముఖమే పంకేరుహముగా నిరూపింపఁబడినది.

13. శరణాగతవత్సల! = శరణు వేఁడుకొనినవారియందు వాత్సల్యము గలవాఁడ!; కాశవప్రభవ=తెల్లుగడ్డివలన పుట్టినవాఁడా! (శరవణ ప్రభవుఁడు కుమారస్వామి); దీనకల్పక! = దీనజనులకుఁ గల్పవృక్షమువంటివాఁడ!; ఆపత్+నాశకర = ఆపన్నాశకర! = ఆపదలను నాశనము జేయువాఁడ!; దురితగిరిదేవ+ఈశ = పాపములనెడి కొండలకు నింద్రునివంటివాఁడ!; నను౯=నన్ను; కరుణ౯ = దయతో; చూడవే = చూడుము; సుఖ౯+అగుదు౯ = సుఖములను బొందినవాఁడ నగుదును.

తా. శరణాగతులయందు వాత్సల్యము గలవాఁడవును, తెల్లుగడ్డి నుండి జన్మించినవాఁడవును; దీనజనములకుఁ గల్పవృక్షమువంటివాఁడవును, ఆపదల నుండి కాపాఁడువాఁడవును, పాపములనెడి కొండలను ఛేదించువాఁడవు నైన నీవు నన్ను కరుణింపుము. నీ కటాక్ష ప్రసరణముచే సుఖములను బడసెదనని నత్కీరుఁడు సుబ్రహ్మణ్యస్వామిని స్తోత్రముఁ జేసెను.

వ్యా. వి. శరణ+ఆగత = శరణాగత (సవర్ణదీర్ఘసంధి).
దేవ+ఈశ = దేవేశ (గుణసంధి).

అలంకారము "దురితగిరిదేవేశ" (రూపకము)

ఇచట దురితములనెడి కొండలకు నింద్రునివంటివాడని భావము. (కొండల నింద్రుఁడు ఛేదించినట్లు కుమారస్వామి పాపములను ఛేదించునని భావము.) ఉపమానోపమేయముల కభేదమును జెప్పినాడు కావున రూపకాలంకార మగుచున్నది. (దురితములనెడి కొండలు. దురితములుపమేయము. కొండలుపమానము).

14. ఏను = నేను; ఒకతప్పు౯+చేసిన౯=ఒకతప్పిదము నొనరించినందులకు; మహా+ఈశుఁడు = ఈశ్వరుఁడు; కుష్ఠరోగ+అనుపమ వ్యథ౯ = కుష్ఠరోగముచే సంభవించిన గొప్ప బాధయందు; పడుము+ఆటంచును = మ్రగ్గుమని

చెప్పుచు; నన్ను; శపించెన్ = శాపమిచ్చెను; దానికిన్ = అట్లు శపించుటకు; శాపమోక్షము = శాపావధి; ఇట్లు=ఈ క్రింది విధముగా; ఆనతి+ఇచ్చెను=సెల విచ్చెను; ఆత్మనిలయంబు+అగు = నిజనివాసంబగు; రౌప్యనగంబున్ = వెండి కొండను (కైలాసపర్వతము); చూచినన్ = దర్శించుకొనిన యెడల; మానున్+ అటంచున్ = కుష్ఠవ్యాధి మానిపోవునని చెప్పి మార్గమును సూచించెను; ఆ+ కుధరమార్గము = అక్కుధరమార్గము = ఆ కొండను గనుగొనుమార్గము; దుర్గమము = పోఁగూడనిది (సాధ్యముగాదని భావము); ఏమి+చేయుదున్ = ఏమి చేయఁగలను.

తా. నేనొకతప్పిదము నొనరించి నందులకుఁ బరమేశ్వరుండు మిక్కిలి కుపితుండై కుష్ఠవ్యాధి బాధితుండవు గమ్మని శపించెను. శాపావధిని వేఁడుకొనఁగా నిట్లని సెలవిచ్చెను. నిజనివాసంబైన కైలాసంబును జూచిన వ్యాధి విమోచనము గల్గునని చెప్పెను. ఆ కైలాసమార్గం బన్వేషింప సాధ్యముగానిది. ఇఁక నేనేమి చేయఁగలనని నక్కీరుఁడు కుమారస్వామికి విన్నవించుకొనెను.

వ్యా. వి. మహా+ఈశుఁడు = మహేశుఁడు (గుణసంధి).
రోగ+అనుపమవ్యథన్=రోగానుపమవ్యథన్ (సవర్ణదీర్ఘ సంధి)
ఆ+కుధరమార్గము = అక్కుధరమార్గము (త్రికసంధి)

15. కైలాసంబున్ = కైలాసపర్వతమును; ఏలాగునన్ = ఏవిధముగా; దర్శింతున్ = చూడఁగలను; ఎపుడు+కాని+కానన్ = ఎప్పుడైనను జూచి యెఱుఁగను; ఖేద = దుఃఖములనెడి; ఉల్లోల = మిక్కిలి కదలికగల; ఊర్మి= అలలు గలిగిన; రోగ = కుష్ఠరోగమనెడి; జలనిధి = సముద్రమునకు; వేల = చెలియలికట్ట (సముద్రమునఁ బడినవానికిఁ జెలియలికట్ట యాధారమైనట్లు దుఃఖములనెడి యలలతోఁ గూడిన కుష్ఠరోగమనెడి మహాసముద్రమునకుఁ గైలాసము చెలియలికట్టవంటిదని భావము); అనుచున్ = అని చెప్పుచు; విన్నవింపన్ = మొఱపెట్టుకొనఁగా; విని = విన్నవాఁడై; గుహుఁడు = కుమారస్వామి; దయన్ = కరుణతో (తరువాతి పద్యముతో నన్వయము).

తా. నేనేవిధముగాఁ గైలాసపర్వతమును జూడఁగలను. దుఃఖములనెడి యలలతోఁ గూడిన కుష్ఠరోగమనెడి మహాసముద్రమునకుఁ గైలాసము చెలియలి కట్టవంటిది. అది నా కాధారమైనది. అట్టి కైలాసమును నే నెప్పుడును జూచి యెఱుగనని విన్నవింపఁగావిని కుమారస్వామి మనంబున నిట్లని తలపోసికొనెను.

అలంకారము :— (రూపకము).

దుఃఖములనెడి యలలన్గూడిన కుష్ఠరోగమనెడి సముద్రము :-ఇచ్చట నుపమానోపమేయముల కభేదము వర్ణింపఁబడినది. (దుఃఖములనెడి యలలకు—కుష్ఠ రోగమనెడి సముద్రమునకును భేదము లేనట్లు వర్ణింపఁబడినది.)

దుఃఖము, కుష్ఠరోగము :— ఉపమేయములు.

అలలు, సముద్రము :— ఉపమానములు.

వ్యా. వి. దర్శించుదును = దర్శింతును (చుదు — తు).

సూ. చువర్ణంబుతోడ దుగ్ధకారంబునకుఁ దకారంబగు.

16. ఆకాలగ్రీవుఁడు = ఆశివుఁడు; కైలాసంబు = కైలాసమని; అనెన్ + కాని = అనిచెప్పెనుగాని; ఉత్తరదిశా = ఉత్తర దిక్కునందున్న; కైలాసము + అంచున్ = కైలాసమనుచు; ఆడఁడు = చెప్పలేదు; వీఁడు = ఈ నత్కీరుఁడు (ఈ పద్యము నంగు "కాలగ్రీవుఁడు నీవు" అను పాఠము ప్రయుక్తమై యున్నది. ఆ పాఠమును గైకొనినచో నన్వయము కుదురదు. కావున "కాల గ్రీవుఁడు వీఁడు" అని సవరించిన బాగుండును); దక్షిణదిశా = దక్షిణ దిక్కు నందుగల; కైలాసమున్ = కైలాసమును; చూచినన్ = దర్శించినయెడల; చాలున్ = చాలును; కుష్ఠము = కుష్ఠవ్యాధి; మానున్ + అంచున్ = మాని పోవునని; మదిలో = మనస్సులో; చర్చించి=తర్కించుకొని; ఆ పర్వతంబున్= దక్షిణ దిక్కునఁగల పర్వతంబును; ఆలోకింపఁగన్ = చూచుటకు; అశ్రమంబు + అగు = సులభమైనట్టి; ఉపాయంబు = మార్గమును; ఆత్మన్ = మనస్సునందు; చింతించుచున్ = ఆలోచించుకొనుచు.

తా. ఆ పరమేశ్వరుఁడు కైలాసమును జూచిన వ్యాధివిమోచనము జరుగునని చెప్పెనుగాని, యుత్తరదిక్కునఁగల కైలాసమునే చూడవలయునని నిర్ధరించి యుండలేదు. కావున వీఁడు దక్షిణదిశా కైలాసమునైనను జూచినయెడల కుష్ఠవ్యాధి మానిపోవునని భావించి, దక్షిణదిశా కైలాసమును సులభముగాఁ జూడఁగల మార్గము నాత్మగతంబున నాలోచించుచుండెను.

17. తన=తనయొక్క (కుమారస్వామియొక్క); మహత్త్వమ్మున్ = గొప్పతనమును, ప్రభావమును; దాఁచి = మఱుగుపఱచి; నెత్తమ్మికొలని = తామరకొలను యొక్క; మహిమవలెన్ + ఉండన్ = ప్రభావమువలెనుండఁగా (తనప్రభావమువలనఁ గాక తమ్మికొలని ప్రభావముచేతనే యనునట్లుగా); ఆ కవి మండల + ఇంద్రున్ = ఆ కవీంద్రుఁడైన నత్కీరుని; ఇందునన్ = ఈ తామర కొలనియందు; ఆడుము = స్నానము చేయుము; కైలాసము = కైలాసపర్వతము; ఆడన్ + పోవు = స్నానముఁ జేయఁబోవు; తీర్థము + ఎదురు + ఐన + రీతి=పుణ్య నది యెదురుగావచ్చిన విధముగా; సిద్ధించున్ = సంప్రాప్తించును; అనుడు = అనిచెప్పఁగా (ఈ తామరకొలనులో స్నానముఁ జేసిన యెడల కైలాసపర్వత మాడఁబోయిన తీర్థమెదురైనట్లు స్వయముగాఁ గనఁబడునని భావము).

తా. తన ప్రభావమువలనఁగాక తమ్మికొలని ప్రభావము చేతనే యిట్లగునని చెప్పి, నత్కీరుడు నా తమ్మికొలనియందు స్నానముఁ జేయమని చెప్పెను. ఈ కొలనిలో స్నానము జేసినయెడల కైలాస మాడఁ బోవఁ దీర్ఘమెదుగైన రీతి సిద్ధించునని చెప్పెను.

వ్యా. వి. నెఱ+తమ్మి = నెత్తమ్మి (ప్రాఁతాది సంధి).

సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి (లోపనుగాగమములు లోపద్విత్వములు వచ్చునని భావము).

18. సేనానీ = కుమారస్వామియొక్క; వచన+అమృతంబు = అమృతసదృశములైన వాక్కులు; చెవులన్ = వీనులయందు; చిందంగన్ = వ్యాపింపఁగా, సోకఁగా; డెందంబులోన్ = హృదయములో; ఆనందంబు = సంతోషము; ఉదయింపన్ = ఉత్పన్నముగాఁగా; ఆ+కొలనిలో=అక్కొలనిలో= ఆకొలనియందు (త్రికసంధి); అతి+అంత = అత్యంత = మిక్కిలి (యణాదేశ సంధి); నిష్ఠన్ = నియమముతో; కృతస్నానుండై = స్నానము చేసినవాఁడై; తలయెత్తఁగాన్ = శిరస్సును పైకెత్తగా; ఎదుటన్ = ముందఱిభాగమున; ఆలోన్ = అంతలోపలనే; అవాచీన = దక్షిణదిక్కు సంబంధమైన; స్థాణునగంబు = కైలాసపర్వతము; హేమముఖరీ సింధు ప్రతీరంబునన్ = సువర్ణముఖీ నదీతీరంబున; కానన్+వచ్చెన్ = కన్పించెను.

తా. కుమారస్వామియొక్క యమృత వాక్కులు వీనుల సోకినంతనే నత్కీరుం డానందపరవశుఁ డయ్యెను. శీఘ్రమే యా కొలనిలో నత్యంత నిష్ఠాగరిష్ఠుండై స్నానము జేసెను. నీటినుండి తలపైకెత్తగా నెదుట సువర్ణముఖీ నది తీరంబునఁ గైలాసంబు గాన్పించెను.

వ్యా. వి. వచన+అమృతంబు = వచనామృతంబు (సవర్ణదీర్ఘ సంధి).
అతి+అంత = అత్యంత (యణాదేశసంధి).
ఆ+కొలనిలో = అక్కొలనిలో (త్రికసంధి).

19. కుష్ఠవ్యాధియున్ = కుష్ఠరోగమును; మానెన్ = మానిపోయెను; హేమముఖరీ = సువర్ణముఖియొక్క; కూల = తీరమునందు; స్థ = ఉన్నట్టి; కైలాసమున్ = కైలాసమును; నిష్ఠ+అధీనమనస్కుఁడై; = నిష్ఠతోఁ గూడుకొనిన మనస్సు గలవాఁడై; కదిసి = సమీపించి; తత్ = ఆ నదియొక్క; నీరంధ్ర = దట్టమైన; కల్లోల = అలలతో; భూయిష్ఠ=నిండిన; ఓఘంబునన్ = ప్రవాహంబున; తీర్థమాడి = స్నానముఁ జేసి; గిరిజ+అధీశున్ = పార్వతీ వల్లభుడైన; శివున్ = ఈశ్వరుని; దేవతాశ్రేష్ఠున్ = దేవతలలో శ్రేష్ఠుఁడైనవానిని;

ద్రావిడ+ఉక్తిన్+తగన్ = ద్రవిడభాషతో నొప్పునట్లు (అఱవభాషలో); సంస్తుతి = స్తోత్రము; నూఱుపద్యములన్+చేసెన్ = ద్రావిడభాషలో నూఱు పద్యములతో స్తోత్రము చేసెను.

తా. ఆ కొలనిలో స్నానముఁజేసిన వెంటనే కుష్ఠవ్యాధి మానిపోయెను. సువర్ణముఖీ నదీతీరంబున నున్న కైలాసము నత్యంత నిష్ఠాగరిష్ఠుండై సమీపించి, యా నదియొక్క దట్టమైన యలలతో నిండిన ప్రవాహంబున జలకమాడి, ద్రావిడ భాషలో శివునిగూర్చి నూఱుపద్యములతో స్తోత్రముఁ జేసెను.

వ్యా. వి. గిరిజ+అధీశున్ = గిరిజాధీశున్ (సవర్ణదీర్ఘ సంధి).
భూయిష్ఠ+ఓఘంబునన్ = భూయిష్ఠౌఘంబునన్ (వృద్ధిసంధి)

సూ. 'అ' కారమునకు ఏ, ఐ, వర్ణములును, ఓ, ఔ, వర్ణములును బరమగు నేని ఐ, ఔ వర్ణములు క్రమముగా నేకాదేశముగా వచ్చును. (ఆ, ఐ, ఔ, ఆర్ వర్ణములకు వృద్ధియని సంజ్ఞ).

20. ఆ నూఱు పద్యములకున్ = అట్లు శివునిగూర్చి స్తోత్రముఁ జేసిన నూఱు పద్యములకు; సేనానీ జనకుఁడు = కుమారస్వామి తండ్రి; ఆర్తచింతామణి = దీనులపాలిటి చింతామణి; విద్యానిధి=విద్యలకు మూలకందమైనవాఁడు; జ్ఞానప్రసవాంబానాథుఁడు = జ్ఞానప్రసవాంబకు భర్తయైనవాఁడు; కాళహస్తి పతి = కాళహస్తీశ్వరుండైన శివుఁడు; ప్రీతుండు+ఐ = సంతుష్టుఁడై.

తా. నత్కీరుఁడు శివునిగూర్చి చేసిన నూఱుపద్యములతోఁ గూడిన స్తోత్రమునకుఁ గుమారస్వామి తండ్రియు, దీనచింతామణియు, విద్యానిధియు, జ్ఞానప్రసవాంబానాథుఁడును నైన శ్రీకాళహస్తీశ్వరుఁడు సంతుష్టుఁడై (తరువాతి పద్యముతో నన్వయము.)

21. ప్రత్యక్షంబగుచున్ = సాక్షాత్కరించుచు; సాహిత్య శ్రీవర = సాహిత్యలక్ష్మికి భర్తయైనట్టివాఁడ; భవత్+భవము = నీయొక్క పుట్టుక; సాఫల్యంబునున్+పొందెన్ = సార్థకమయ్యెను; సఫలంబయ్యెను; నీకున్; ఇంపు+అగు+వరము = హితమైన వరమును; ఏన్ = నేను; ఇచ్చెదన్ = ప్రసాదించెదను; వేఁడు = వేఁడుకొనుము; భీతి త్యాగంబు+ఒనరించి నాఁడను = భయమును బోగొట్టితిని; అనన్ = అనిచెప్పఁగా (ఇచ్చట 'ఒనరించినాఁడవన' అను పాఠము గ్రంథస్థమైయున్నది. అట్లు వ్యాఖ్యానించిన విరుద్ధమైన యర్థము సంభవించును); నత్కీరుండు; ఉమాజానికిన్=పార్వతీనాథునకు; ప్రత్యక్+జ్యోతికిన్ = పరంజ్యోతి స్వరూపునకు, అపరజ్యోతి స్వరూపునకు; మ్రొక్కిమ్రొక్కి

=మిక్కిలి భక్తితో మ్రొక్కినవాఁడై; ప్రమదప్రాయ+అంతరంగంబుతోన్=సంతోషాతిశయముతోఁ గూడికొనిన మనస్సుతో.

తా. నత్కీరుఁడొనర్చిన స్తోత్రమునకు శివుఁడు మిక్కిలి సంతసించి ప్రత్యక్షమై యిట్లనియెను. "పండితోత్తమా! నీ జన్మ పావనంబయ్యెను. నీకు హితమైన వరమును గోరుకొనుము. నీకుఁగల భయంబును బోఁగొట్టితి" నని చెప్పగా నత్కీరుఁడా పరమేశ్వరునకు మ్రొక్కి సంతోషాంతరంగుఁడై (తరువాత పద్యముతో నన్వయము).

22. నిటలంబునన్=ఫాలభాగమున; అంజలిపుటఘటనంబు+ఒనరించి=రెండు చేతులను జోడించియుంచి నమస్కరించినవాఁడై; ప్రమద = సంతోషము చేత; గద్గద = బొంగురువోయిన; గళము = కంఠము; అస్ఫుట = స్పష్టముగా వినఁబడని; వర్ణ = పదములు గలిగిన; స్తుతి=స్తోత్రము; భాష+ఆర్భటియును=భాషాడంబరమును; రోమ+ఉద్గమము = రోమోద్గమము=గగుర్పాటు; పైపైన్+పఱ్ఱఁగన్ = ఒకదాని వెంబడి మఱియొకటి మెండుకొని వచ్చుచుండఁగా.

తా. నుదుట చేతులు జోడించి నమస్కరించినవాఁడై, సంతోషాతిశయముచే బొంగురువోయిన కంఠస్వరమును, స్పష్టముగా వినఁబడని పదజాలమును, భాషాడంబరమును, గగుర్పాటును నొకదాని వెంబడి మఱియొకటి తమతమ ప్రభావంబులను జూపుచుండఁగా (తరువాతి పద్యముతో నన్వయము).

వ్యా. వి. రోమ+ఉద్గమము = రోమోద్గమము (గుణసంధి).
భాష+ఆర్భటి = భాషార్భటి (సవర్ణదీర్ఘసంధి).

24. ఈ సంసారము = జననమరణ ప్రవాహరూపంబైన యీ సంసారము (లౌకిక సంబంధమైనది); దుఃఖ+ఆవాస+ఆనందము = సుఖదుఃఖములకు నిలయము; దీనిన్=అట్టి సుఖదుఃఖ భూయిష్ఠమైన యీ సంసారమును; వర్జింపంగాన్=విడిచిపెట్టినయెడల; ఏ సుఖము = ఎట్టి సుఖము; కల్గున్=కలుగునో; దయన్=కరుణతో; నన్ను = నీ భక్తుఁడనైన నన్ను; ఆ సుఖమునన్ = అట్టి సుఖముతో; కూర్పవే = ఘటింపఁ జేయుము; కృత+అర్థుడన్+అగుదున్ = ధన్యుఁడనయ్యెదను.

తా. మహాత్మా! ఈ సంసారము సుఖ దుఃఖములకు నిలయంబైనది. అట్టి సుఖదుఃఖభూయిష్ఠమైన యీ సంసార భారంబునుండి విముక్తిని ప్రసాదించి నీ భక్తుఁడనైన నాకు శాశ్వత సుఖముఁబ్రసాదించి ధన్యునిగాఁ జేయుము.

వ్యా. వి. కృతార్థుఁడను = కృతార్థుఁడు+ను.

సూ. ప్రథమాంతంబులగు యుష్మదస్మ ద్విశేషణంబుల కేకత్వంబున వును—లును బహుత్వంబున—రము—లును నంతాగమంబులు ప్రాయికంబుగా నగు. (ఉ॥ కృతార్థుఁడు+ను).

సూ. ఈ యాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు (కృతార్థుఁడ+ను = కృతార్థుఁడను).

25. అని ప్రార్థింపగన్ = పైన వివరింపబడినట్లనేక విధములుగాఁ బ్రార్థింపఁగా; భక్తకల్పకము = భక్తులకుఁ గల్పవృక్షమువంటివాఁడు; అవిద్యా = అజ్ఞానమనెడి; సూత్ర = దారమునకు (రూపకాలంకారము); దాత్రంబు = కొడవలి వంటివాఁడు; జీవన = జీవితమునందలి; ఖేద = దుఃఖములనెడి; అంబర = వస్త్రమునకు (రూపకాలంకారము); కర్తరీముఖము = కత్తెరయొక్క నోటి వంటివాఁడు; కైవల్య+అర్థ = మోక్షమనెడి సంపదను; దాన=ఇచ్చుటయందు; అమృత+అశన = అమృతమాహారముగాఁ గల దేవతలయొక్క; రత్నంబు = చింతామణి వంటివాఁడు (రూపకాలంకారము); తుషారశైలతనయా = మంచుఁ గొండ కూఁతురగు పార్వతియొక్క; జాంపత్య = దాంపత్యముచేత; సంపన్న= కలిగిన, కూడిన; పావన = పవిత్రమగు; గార్హస్థ్యము = గృహస్థధర్మము గలిగిన వాఁడును; కాళహస్తి పురదైవంబు = కాళహస్తీశ్వరుఁడు; సాయుజ్యమున్ = సహయోగమును (భగవంతునిలో లీనమైపోవుట); ఇచ్చెన్ = ప్రసాదించెను.

తా. శివునిగూర్చి నత్కీరుఁ డనేక విధములుగాఁ బ్రార్థింపఁగా భక్తులకుఁ గల్పవృక్షమువంటివాఁడును, నజ్ఞానమనెడి దారమునకుఁ గొడవలి వంటి వాఁడును, దుఃఖములనెడి వస్త్రమునకుఁ గత్తెరనోటి వంటివాఁడును, మోక్షమనెడి సంపదనిచ్చుటయందుఁ జింతామణివంటివాఁడును, పార్వతి దాంపత్యముచేఁ బవిత్రమైన గృహస్థధర్మము గల్గినవాఁడును నైన శ్రీ కాళహస్తీశ్వరుఁడు సాయుజ్యమును బ్రసాదించెను.

అలంకారము :- "అజ్ఞానమనెడి దారమునకు" "దుఃఖములనెడి వస్త్రమునకు" "మోక్షమనెడి సంపదకు" ఈ వాక్యములలో రూపకాలంకారములున్నవి.

అజ్ఞానము, దుఃఖములు, మోక్షము :— ఇవి ఉపమేయములు.

దారము, వస్త్రము, సంపద ;— ఇవి ఉపమానములు.

ఉపమానోపమేయములక భేదమును గల్పించి వర్ణించియుండుటచే నా యా తావులలోని యలంకారములు రూపకములైనవి.

—:o:—

# శ్రీ కాళహస్తి మాహాత్మ్యము

## ముఖ్య ప్రశ్నలు

(1) నత్కీరుఁడు విశ్రమించిన వటవృక్షమును వర్ణించి, యచట జరుగుచుండిన వైచిత్ర్యము నభివర్ణించునది ?

(2) భూతమువాతఁబడిన నత్కీరుఁ డెట్లు బంధవిముక్తుఁ డయ్యెనో వివరించునది ?

(3) నత్కీరుఁడు సుబ్రహ్మణ్యస్వామిని స్తోత్రముఁ జేసిన విధానమును వర్ణించునది ?

(4) నత్కీరునకు వ్యాధివిమోచనము భగవత్సాన్నిధ్యము గల్గిన విధానము నభివర్ణించునది ?

(5) ఉపాఖ్యానమనఁగా నేమి ? నత్కీరోపాఖ్యానమున వెలువడిన పరమార్థమును నిర్వచించునది ?

(6) ధూర్జటి కవికాలాదులను వివరించి యాతని కవిత్వములోని బాగోగులను జర్చించునది ?

(7) "శ్రీ కాళహస్తి" యను పేరెట్లువచ్చినదో సోదాహరణముగా వ్రాయునది ?

ఈ క్రింది వాక్యములకు సందర్భసహిత వ్యాఖ్య వ్రాయుఁడు :—

(1) ఇంతటఁ గూలునునిండె నిందఱ కనుగ్రహ మీశ్వరుఁ డేమి సేయునో. 8

(2) అక్కుధర మార్గము దుర్గమ మేమి సేయుదుఁగా. 14

(3) నీవు దక్షిణదిశా కైలాసముం జూచినఁ జాలున్. 16

(4) ఆడఁబోవు తీర్థ మెదురైనరీతి సిద్ధించుననుఁడు. 17

(5) తట్టేఁబడిన పులుఁగులగతి నిట్టట్టు పడంగ నునిచి. 4

(6) నిర్ఘాతమువంటి శక్తిఁగొని క్రౌంచముఁ జించిన రౌద్ర మూర్తికిన్. 11

(7) ఈ సంసారము దుఃఖావాసానందంబు. 24

(8) భీతిఁ దొఱంగఁజేయు టొకపెద్దమె వారిత దేవతార్తికిన్. 11

## ప్రశ్నోత్తరములు

(1) నత్కీరుఁడు విశ్రమించిన వటవృక్షమును వర్ణించి, అచ్చట జరుగు చుడింన వైచిత్ర్యము నభివర్ణించునది ?

నత్కీరుఁడు తానొనరించిన యపరాధంబునకుఁ బశ్చాత్తప్తుఁడై వంతనొందుచుఁ దీర్థయాత్రకై బయలుదేరెను. మధ్యేమార్గంబున నొక్కెడ నొకకొలను తీరంబున నొక వటవృక్షమునుగాంచి, తదీయ శాఖాశైత్యంబున కానందభరితుఁడై, యచ్చటఁ గొంత కాలంబు విశ్రమించెను. ఆ వటవృక్షము మిన్నొరయుచు దిగంతములవఱకు వ్యాపించియుండెను. ఆ వృక్షముయొక్క యాకులు భూదేవికిఁ బచ్చని పట్టువస్త్రరూపమైన చాందినిగా నుండెను. చివరికొమ్మలు దేవతలకుఁ బచ్చలు పొదిపిన హర్మ్యములుగా నుండెను. వ్రేలుఁ గొమ్మలు ఋషులకుఁ బర్ణశాలలుగా నుండెను. దిశాంతములవఱకు వ్యాపించిన నీడ చక్రవాళపర్వతమునందలి హరిణములకుఁ బచ్చిక బయలుగా నుండెను. అట్టి విశిష్టమైన వట వృక్షము వాలఖిల్య మునీశ్వరులకు నివాసభూమియైన రోహణాద్రి చందంబునుండి, గయయనెడి పుణ్యక్షేత్రమున పితృముక్తికి నిలయంబై మిక్కిలి ప్రసిద్ధివహించిన యక్షయవటంబు చందమునఁ జూపరుల నాకర్షించుచుండెను. తదీయశాఖా శైత్యంబుచే నాకర్షింపఁబడి నత్కీరుఁ డావృక్షంబు నీడఁ గొంతకాలము విశ్రమించెను

ఆ వటవృక్షమునుండి రాలిన పండుటాకులు బయటఁబడినవి పక్షులుగాను, జలంబులఁ బడినవి మీనంబులుగాను మాఱిపోవు చుండెను. అందొక్క పండుటాకు కొలనియందు సగమును, దట ప్రదేశమున సగమును బడి మీనపక్షిత్వమైన రూపమును బొంది

లోపలికి వెలుపలికిఁ దిరుగుచుండెను. అట్టి వైచిత్ర్యమును గొమ్మల నీడ విశ్రమించియున్న నత్కీరుండు జూచి, యాశ్చర్యచకితుఁడై, యందులకుఁగల కారణంబును మనంబునఁ దలపోయుచుండ నింతలో నొకభూత మాతని బంధించుకొని పోయెను. అట్టి వైచిత్ర్యమునకుఁ గారణ మా చెట్టున నాశ్రయించుకొనియున్న భూతమని తెలియ వచ్చుచున్నది. ఇట్లే భూతమా చెట్టుక్రిందికివచ్చిన మనుజుల నంద ఱిని బంధించి తనగుహలో భద్రపఱచి, నూఱుసంఖ్య నిండినప్పుడెల్ల యేకాహారముగాఁ దినుచుండెను.

(2) వటవృక్షము నాశ్రయించుకొనియున్న భూతమును వర్ణించి, భూతము వాతఁబడిన నత్కీరుఁ డెట్లు బంధవిముక్తుఁడయ్యెనో వివరించునది ?

శాఖలు దిశాంతములవఱకు వ్యాపింప, మిన్నొరయుచుండిన యొకానొక వటవృక్షము నాశ్రయించుకొని యొకానొక భూతము కాపురము సేయుచుండెను. ఆ భూతముయొక్క చూపులు మిక్కిలి భయంకరములైయుండెను. మిడిగ్రుడ్లును, ముందుకుసాగిన కోఱలును, పైకి నిక్కబొడుచుకొన్న వెండ్రుకలును, నల్లని శరీరంబును, కర్కశభాషణంబులును, వికటమైన నవ్వును, నక్కస్వరమువంటి కంఠస్వరమును జూపరులకు భయమును గల్గించుచుండెను. ఒక భయంకరమైన యాయుధమును చేత ధరించియుండెను. మెడలో వేసికొనియున్న యెముకల హారము రాపిడిచే నుత్పన్నమైన ధ్వని మిక్కిలి వికటమై తోచుచుండెను. అట్టి భయంకరా కృతిని గల్గి వటవృక్షము నాశ్రయించుకొనియుండి, యట విశ్రమిం చిన మనుజులందఱకును దనవైచిత్ర్యములను జూపుచు, నేమఱుపా టున వారినందఱ బంధించి తీసికొనిపోయి తనగుహలో గుప్తపఱచు కొనుచుండెను. అట్లు బంధించినవారి సంఖ్య నూఱైనప్పుడు వారల నందఱ నేకాహారముగా దినుచుండెను.

నత్కీరుఁ డా మఱ్ఱిచెట్టుయొక్క విశాలములైన కొమ్మల చల్లదనమునకు మిక్కిలి సంతసించి, యచట నాసీనుఁడై రాలిన పండుటాకుల వైచిత్ర్యమును దిలకించుచు, నందులకుఁ దగిన కారణ

మే మైయుండనోపు నని భావించుకొనుచుండెను. అకస్మాత్తుగా, నొక భూత మా నత్కీరుని బంధించి తీసికొనిపోయెను. అట్లు నత్కీరుని బంధించి తీసికొనిపోయి తన నివాసస్థానమైన యొక బిలములో గుప్తపఱచెను. ఆ బిలములోఁ బూర్వమా భూతము వాతఁబడిన మనుజులు లెక్కకు మిక్కుటములుగా బంధింపఁబడి యుండిరి. వారి నందఱిని వేట తెరలో బంధింపఁబడిన పక్షుల చందమున బంధించి యుండెను. నత్కీరుని గూడ మునుపున్న మనుజుల దగ్గరనే బంధించెను.

భూత మొకనాఁడు తాను బంధించిన మనుజుల నందఱ నేకాహారముగాఁ దినఁదలఁచి, సమీపమున నున్న కొలనియందు దుదకమాడఁ బోయెను. అయ్యదను బురస్కరించుకొని యా బిలంబున బంధింపఁబడియున్న మనుజులు నత్కీరునితో నిట్లనిరి. ''మే మింకేమి సేయఁగలము. కమలగర్భునికి మా మీఁద దయ లేకపోయెను. ఇంతలో నిన్నుగూడ బంధించెను. ఈనాఁ డందఱిని భూతము తినివేయఁగలదు. ఈ భూతము చూచుచుండగనే మనుష్యుల నందఱిని నూఱుకొని త్రాగివేయును. నీతోఁ గలిసి యీ నాటికి నూఱుసంఖ్య నిండినది. ఇంతటితో మనకును నూఱు సంవత్సరముల యాయువును నిండిపోయినది. ఇంతకు నా పరమేశ్వరుఁడే మనకు శరణ్య''మని పలువిధముల వాపోవుచుండిరి. నత్కీరుఁడా మాటలను విని మనంబున యోచించుకొని భూతంబును దెగటార్చు నుపాయంబును దలపోసి, యీశ్వరపుత్రుఁడైన కుమారస్వామిని స్తోత్రముఁ జేసెను. నత్కీరుండు తన కిష్టదేవతయైన కుమారస్వామి ననేకవిధంబులుగా స్తోత్రము చేయఁగా భక్తరక్షకుండును, కృపాన్వితమతియు నైన సుబ్రహ్మణ్యస్వామి నత్కీరుని భక్తికిమెచ్చి సాక్షాత్కరించి, మిక్కిలి కోపవేగముతో భూతంబుపైఁబడి హతమార్చి, బిలద్వారమున కడ్డముగానున్న రాతిని దొలగించి, యచట నిర్బంధింపఁబడిన మనుజుల నెల్లరను వెడలుండని యనుగ్రహించెను. వారందఱు కుమారస్వామికి వందనంబు లాచరించుచు ననేకవిధంబులుగా స్తుతించి, యెందేని వెడలిపోయిరి. నత్కీరుండును బునః

ప్రణామం బాచరించి, మనంబున సంతోషాంకురంబులు మొలక లెత్తగా నా దేవదేవుని వేయి విధంబుల స్తుతించుచుఁ దనకు సంభ వించిన కుష్ఠవ్యాధి వృత్తాంతంబును మొఱపెట్టుకొనెను. ఇట్లు నత్కీరుండు భూతంబు బారినుండి బంధవిముక్తుం డయ్యెను.

(3) నత్కీరుఁడు సుబ్రహ్మణ్యస్వామిని స్తోత్రముఁ జేసిన విధానమును గూర్చి వర్ణించునది ?

బిలద్వారమున భూతముచే బంధింపఁబడిన మనుజు లా భూతంబు స్నానమాడఁబోయిన యదనును బురస్కరించుకొని, సర్వవృత్తాంతంబును నత్కీరున కెఱింగించిరి. నత్కీరుఁడును భూతంబు వాతఁబడియున్నవాఁడు కావున నా మనుజులు చెప్పిన మాటలను విని, సర్వంబును నెఱింగినవాఁడై, యా భూతంబును దెగటార్చు నుపాయంబును మనంబునఁ దలపోసికొని, తన యిష్ట దైవంబైన కుమారస్వామిని గూర్చి యనేక విధంబులుగా స్తుతించెను.

తారకాసురుని సంహరించినవాఁడును, భయంకరమైన శక్తి యనెడి యాయుధము గలవాఁడును, నెమలి వాహనముగాఁగల వాఁడును, దీనజనములకుఁ దామరభూజము వంటివాఁడును, ఆరు మొగముల యందలి పెద్దనవ్వుచేతఁ జీల్పఁబడిన దిశాంతములనెడి కాఁగులుగల వాఁడునునైన సుబ్రహ్మణ్యుఁ డీ భూతంబును సంహరించి, యిచ్చట బంధింపఁబడినవారి నందఱిని బంధవిముక్తులను జేయును గాక యని కుమారస్వామిని గూర్చి స్తోత్రమును జేసెను. సులభప్రాయముగాఁ దారకాసురుని సంహ రించిన గొప్ప పరాక్రమవంతుఁడైన మేటి వీరున కీ భూతమును హతమార్చుటొక లెక్కగాదనియు, నీ బిలమును భేదించుటొక పెద్ద విషయముగాదనియుఁ దలపోసికొనెను. పిడుగువంటి శక్తి యనెడి యాయుధమును ధరించి క్రౌంచపర్వతమును వ్రక్కలించిన శౌద్రమూర్తికిని, దేవతార్తిని బరిహరించిన మేటి వీరునకును మన భయమును బోఁగొట్టుటయనెడి విషయమాశ్చర్యకరమైనది కాదని, నత్కీరుండు బ్రహ్మాణ్యోక్తియుక్తంబుగాఁ దన కిష్టదేవతయు భక్త

రక్షకుఁడునునగు కుమారస్వామిని స్తోత్రము చేయఁగాఁ, గృపాన్విత మతియు దీనజనకల్పతరువును నగు సుబ్రహ్మణ్యుఁడు నత్కీరునకుఁ బ్రత్యక్షమయ్యెను. అట్లు ప్రత్యక్షమైన కుమారస్వామిని గూర్చి నత్కీరుఁడు మఱల నిట్లని స్తోత్రముఁ జేసెను.

శరణాగతులయందు వాత్సల్యము గలవాఁడవును, తెల్లుగడ్డి నుండి పుట్టినవాఁడవును, దీనజనములకుఁ గల్పతరువువంటి వాఁడవును, ఆపదలనుండి కాపాడువాఁడవును, పాపములనెడి కొండలను ఛేదించుటలో నింద్రునివంటివాఁడవునునైన నీవు నన్ను గరుణింపుము నీ కటాక్షప్రసరణముచే సుఖములను బడసెదనని పలువిధములుగా స్తుతించి, తనకు సంప్రాప్తించిన యాపదనుగూర్చి మొఱపెట్టుకొనెను.

(4) నత్కీరునకు వ్యాధి విమోచనమును, భగవత్సాన్నిధ్యమును గల్గిన విధానము నభివర్ణించునది?

భూతముచే బిలమున బంధింపఁబడిన నత్కీరుఁడచట మునుపు బంధింపఁబడియున్న మనుజులనుండి సర్వవృత్తాంతంబును దెలిసికొనెను. భూతంబును హతమార్చు నుపాయంబును మనంబునఁ దలపోసికొని, యిందుకుఁ దగినవాఁడు కుమారస్వామియని భావించి, యద్దేవదేవు ననేకవిధంబులుగా స్తుతించెను. అట్లు నత్కీరుండు బ్రాహ్మణ హితంబుఁగోరి, తన యిష్టదైవమైన కుమారస్వామిని గూర్చి స్తోత్రము జేయఁగాఁ గృపాన్వితమతియు, భక్తరక్షకుండును నగు సుబ్రహ్మణ్యస్వామి సాక్షాత్కరించి, సర్వంబును దెలిసికొని భూతంబుపైఁబడి హతమార్చి, బిలద్వారంబున కడ్డంబుగానున్న రాతిని దొలగించి, భూతంబుచే బంధింపఁబడిన వారికందఱికి బంధవిముక్తిని గలుగఁజేసెను. అందఱును నా దేవదేవు ననేకవిధంబుల స్తుతించుచు నెందేని వెడలిపోయిరి. నత్కీరుండు పునఃప్రణామం బాచరించి ముఖపద్మంబున సంతోషాంకురంబులు మొలకలెత్తఁగాఁ గుమారస్వామిని స్తుతించుచుండెను. అట్లు ప్రత్యక్షమైన కుమారస్వామి నత్కీరుని రాకకుఁ గారణం బడిగెను. అందులకు నత్కీరుఁ డిట్లని చెప్పఁదొడఁగెను,

"నే నొక తప్పిదము నొనరించితిని. అందులకుఁ బరమేశ్వరుఁడు కుపితుఁడై కుష్ఠవ్యాధి బాధితుఁడవు గమ్మని శపించెను. శాపావధి వేఁడఁగొనఁగా నిట్లని సెలవిచ్చెను. నిజనివాసంబైన కైలాసంబును జూచిన వ్యాధి విమోచనము గల్గునని చెప్పెను. ఆ కైలాసమార్గ మన్వేషింప సాధ్యముగానిది. ఇఁక నేనేమి చేయఁగలను. నాకు మార్గమును జూపించి నన్ను ధన్యునిగాఁ జేయు" మని మొఱపెట్టుకొనియెను. నక్కీరుని మొఱాలకించి, కుమారస్వామి మనంబున నిట్లని దలపోసికొనియెను. ఆపరమేశ్వరుఁడు కైలాసము జూచిన వ్యాధి విమోచనము జరుగునని చెప్పెను గాని యుత్తరదిశా కైలాసమని చెప్పియుండలేదు. కావున నీ నక్కీరుఁడు దక్షిణదిశా కైలాసమును జూచినయెడల కుష్ఠవ్యాధి మానిపోవునని భావించి, దక్షిణదిశా కైలాసమును సులభముగాఁ జూడఁగల మార్గము నాత్మగతమున నాలోచించి, తన ప్రభావముచేతఁగాక, తమ్మికొలనియందు స్నానమాడుటచేతనే యిట్లగునని చెప్పి, నక్కీరుని, చేరువనున్న తమ్మికొలనియం దుదకమాడిన వ్యాధి విమోచనమును, కైలాస దర్శనమును లభించునని చెప్పి యంతర్హితుండయ్యెను.

కుమారస్వామి యమృతవాక్కులు వీనుల సోకినంతనే యతండానందపరవశుండై యా దేవదేవుని యాజ్ఞమేరకు నా కొలనియందు స్నానముఁ జేసెను. నీటినుండి తల యెత్తగనే యెదుట సువర్ణముఖీ నదీతీరంబునఁ గైలాసము గాన్పించెను. కుష్ఠవ్యాధి మానిపోయెను.

అత్యంత నిష్ఠాగరిష్ఠుండై నక్కీరుఁడా కైలాసమును సమీపించి ద్రావిడ భాషలో శ్రీ కాళహస్తీశ్వరుని గూర్చి నూఱు పద్యములతో స్తుతించెను. అట్లు స్తుతించిన నక్కీరుని భక్తికి దీనచింతామణియు, విద్యానిధియు, జ్ఞానప్రసవాంబానాథుండునునగు శ్రీ కాళహస్తీశ్వరుండు ప్రీతుండై నక్కీరునితో నిట్లనియెను. "పండితోత్తమా! నీ జన్మ పావనంబయ్యెను. నీకు హితమైన వరమును గోరుకొనుము. నీకుఁగల భయంబును బోఁగొట్టితి"నని చెప్పెను.

అంత సంతోషాంతరంగుఁడై నత్కీరుఁడా పరమేశ్వరునకు మ్రొక్కి మహాత్మా! దుఃఖభూయిష్ఠమైన యీ సంసారంబునుండి విముక్తిని ప్రసాదించి నను ధన్యునిగాఁ జేయుమని ప్రార్థించెను. అట్లు ప్రార్థించిన నత్కీరునకు శ్రీకాళహస్తీశ్వరుఁడు సాయుజ్యమును బ్రసాదించెను. ఇట్లు నత్కీరుఁడు వ్యాధి విమోచనమును, భగవత్సాన్నిధ్యమును బొంది చరితార్థుఁ డయ్యెను.

ఈ క్రింది పద్యముల కర్థతాత్పర్యములను వ్రాయుసది :—

1. "ఉ॥ క్రూరనిరీక్షణ ప్రభలగ్రుడ్లులు గోఱలు నూర్ధ్వకేశముల్"
2. "ఉ॥ తారకదైత్య భంజనుఁడు దారుణశక్తిధరుండు పన్నగా"
3. "ఉ॥ భూతము జంపుచే యదుదు భోరనఁదారకు మన్నిగొన్నవి"
4. "శా॥కుష్ఠవ్యాధియు మానె హేమముఖరీకూలస్థకైలాసమున్"
5. "మ॥అని ప్రార్థింపఁగ భక్తకల్పకమ విద్యాసూత్రదాత్రంబుజీ"

ఈ క్రింది పద్యములలోని యలంకారములను బేర్కొని లక్ష్యలక్షణ సమన్వయముఁ జేయునది :—

(1) "తన దిశాంత భ్రాంత ఘనవిటపచ్ఛాయ
వలయాద్రి హరిణ శాద్వలముగాఁగ"

(2) "ఆడు మిందునఁ గైలాస మాడఁబోవు తీర్థ మెదురైనరీతి సిద్ధించు ననుఁడు"

(3) "అని ప్రార్థింపఁగ భక్తకల్పకమవిద్యాసూత్రదాత్రంబు జీ
వనఖేదాంబరకర్తరీముఖము కైవల్యార్థదానామృతా
శనరత్నంబు తుషారశైలతనయాజాంపత్యసంపన్న పా
వనగార్హస్థ్యము కాళహస్తిపురదైవంబిచ్చె సాయుజ్యమున్"

(4) "పితృముక్తి దేహమగుచు గయఁ బ్రసిద్ధివహించు నడుయ
వటంబు చందముననున్న యొక మఱ్ఱిక్రింది కేగి."

## వ్యాకరణ విశేషములు

వ్రేలుఁగొమ్మలు = వ్రేలు+కొమ్మలు.

సూ. సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు

(ఉ॥ వ్రేలు+ను+కొమ్మలు) సూ. ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు. (ఉ॥ వ్రేలు+ను+గొమ్మలు).

సూ. ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు (ఉ॥ వ్రేలుఁ గొమ్మలు).

అక్షయము = న+క్షయము (నఞ్ తత్పురుషసమాసము).

సూ. అజాదిసుబంతము పరమగునేని నఞ్ యొక్క 'న' కారము 'అన్' గాను హలాది సుబంతము పరమగునేని 'అ'గాను మాఱును.

పండుటాకులు పండు+ఆకులు (టుగాగమసంధి).

సూ. కర్మధారయంబు లందుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగును.

బట్టబయట = బయట+బయట (ద్విరుక్తటకారసంధి).

సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు.

అత్యంత = అతి+అంత (యణాదేశసంధి).

సూ. ఇ,ఉ,ఋ,ౠ, వర్ణములకు సవర్ణములుగాని యచ్చులు పరమైనయెడల య,వ,ర,ల వర్ణములు క్రమముగా వచ్చును. (దీనిని సంస్కృత వ్యాకరణజ్ఞులు యణాదేశసంధి యందురు).

తనదు గుహకున్ = తన+గుహకున్.

సూ. యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాషనగు.

దర్శించుదును = దర్శింతును (చుదు–త)

సూ. చువర్ణంబుతోడ దుగ్ధకారంబునకుఁ దకారంబగు.

నెత్తమ్మి = నెఱ+తమ్మి (ప్రాంతాదిసంధి).

సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు గొండొకచోఁ గానంబడియెడి (లోపనుగాగమములు – లోపద్విత్వములు వచ్చునని భావము).

భూయిష్ఠౌఘుంబునన్ = భూయిష్ఠ+ఓఘుంబునన్ (వృద్ధిసంధి)

సూ. 'అ' కారమునకు ఏ, ఐ, వర్ణములును, ఓ, ఔ, వర్ణములును బరమగునేని ఐ, ఔ, వర్ణములు క్రమముగా నేకాదేశముగా వచ్చును. (ఆ, ఐ, ఔ, ఆర్, వర్ణములకు వృద్ధియని సంజ్ఞ).

కృతార్థుఁడను = కృతార్థుఁడు+ను.

సూ. ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున—వు ను—లును, బహుత్వంబున—రుము—లును నంతాగమంబులు ప్రాయికంబుగానగు (ఉ॥ కృతార్థుఁడు+ను).

సూ. ఈ యాగమంబులు పరంబగునపు డుత్వంబున కత్వంబగు (ఉ॥ కృతార్థుఁడ+ను = కృతార్థుఁడను).

ఈ క్రింది వ్యాకరణ విశేషములను వ్రాయుసది ?

1. పండుటాకులు; 2. బట్టబయట; 3. అత్యంతము; 4. వ్రేలుఁగొమ్మలు; 5. అక్షయము; 6. నెత్తమ్మి; 7. కృతార్థుఁడను; 8. భాషార్భటి.

వ్యుత్పత్త్యర్థములు వ్రాయుఁడు :

విహంగము = ఆకసమున సంచరించునది (పక్షి)

జలాశయము = నీటికి నెలవైనది (కొలను)

పక్షి = ఱెక్కలు గలది (పక్షి)

శివుఁడు = మంగళమును గలిగించువాఁడు (ఈశ్వరుఁడు)

కమలగర్భుఁడు = పద్మము నాభియందుఁ గలవాఁడు (విష్ణువు)
ఉమ = తపస్సు వలదని నిషేధింపఁబడినది (పార్వతి)
ఈశ్వరుఁడు = ఐశ్వర్యములను బ్రసాదించువాఁడు (ఈశ్వరుఁడు)
పురభిత్తనయుఁడు = త్రిపురములను భేదించిన శివుని కుమారుఁడు (కుమారస్వామి)
తారకదమనుఁడు = తారకాసురుని హతమార్చినవాఁడు (కుమారస్వామి)
ఇందుశేఖర నందనుఁడు = చంద్రుని శిరోభూషణముగాఁ దాల్చిన శివుని సంతోషపెట్టువాఁడు (కుమారస్వామి)
కాశవన ప్రభవుఁడు = శరవణప్రభవుఁడు, రెల్లుగడ్డినుండి పుట్టినవాఁడు (కుమారస్వామి)
కుధరము = భూమిని ధరించునది (పర్వతము)
పంకేరుహము = పంకమునుండి బుట్టినది (పద్మము)
కాలగ్రీవుఁడు = కంఠమునందు నల్లని మచ్చగలవాఁడు (శివుఁడు)
సేనాని = దేవతలకు సైన్యాధిపతి (కుమారస్వామి)
గిరిజాధీశుఁడు = పర్వతరాజపుత్రికయైన పార్వతికి భర్త (శివుఁడు)
ఉమాజాని = పార్వతీ నాథుఁడు (శివుఁడు)
తుషారశైలతనయ = మంచుకొండయగు హిమవంతుని పుత్రిక (పార్వతి)
పన్నగాహారహయుఁడు = పాము లాహారముగాఁ గల నెమలిని వాహనముగాఁ గలవాఁడు (కుమారస్వామి)
షణ్ముఖుఁడు = ఆఱు మొగములు గలవాఁడు (కుమారస్వామి)

ప్రకృతి వికృతులను వ్రాయుఁడు :

| ప్రకృతి | | వికృతి | ప్రకృతి | | వికృతి |
|---|---|---|---|---|---|
| దిశ | – | దెస | కర్తరి | – | కత్తెర |
| ముక్తి | – | ముత్తి | శక్తి | – | సత్తి |

| ప్రకృతి | | వికృతి | ప్రకృతి | | వికృతి |
|---|---|---|---|---|---|
| మనుష్యుఁడు | - | మానిసి | రత్నంబు | - | రతనము |
| ముఖము | - | మొగము | హర్షము | - | అరుసము |
| ఆజ్ఞప్తి | - | ఆనతి | పురము | - | ప్రోలు |
| వ్యథ | - | వెత | గృహము | - | గీము |
| విద్య | - | విద్దె | అద్భుతము | - | అబ్బురము |
| త్యాగము | - | చాగము | బ్రాహ్మణుఁడు | - | బాపఁడు |
| ఆహారము | - | ఓగిరము | తీరము | - | దరి |
| | | | శ్రీ | - | సిరి |

## పూర్వగాథలు

1. వాలఖిల్యులు:—వాలఖిల్యులు క్రతువను మునియొక్క పుత్రులు. వీరి తల్లి సన్నతి. (క్రియ). వీరు నిత్య బ్రహ్మచారులు. ఊర్ధ్వరేతస్కులు. సూర్యునిరథమం దెక్కి సంచరించుచుందురు. అంగుష్ఠ ప్రమాణదేహులు. తలక్రిందుగనుండి తపస్సు చేయుచుందురని బ్రహ్మాండపురాణము చెప్పుచున్నది. పార్వతీపరమేశ్వరుల వివాహము చూచుటకై బ్రహ్మ వెళ్ళెను. ఆ దంపతులను జూడఁగా బ్రహ్మకు రేతఃపతన మయ్యెను. ఆ రేతస్సునుండి వాలఖిల్యులు జన్మించిరని బ్రహ్మవైవర్తకపురాణము జెప్పుచున్నది.

2. "క్రౌంచముఁ జించిన రౌద్రమూర్తికిన్" క్రౌంచపర్వతము మైనాకుని కుమారుఁడు. మహిషాసురుఁడు మొదలగు రాక్షసులు దేవతలను దఱుముకొనివచ్చి బాధించుచు నెవ్వరికిఁ గన్పింపక యీ పర్వతగుహయందు దాఁగుకొనుచుందురు. ఈ పర్వతమట్లు రాక్షసులకు సహాయమగుటచేతఁ గుమారస్వామి దీనిని ఛేదించెనని పురాణ ప్రతీతి.

పరశురామునకుఁ గుమారస్వామికి విలువిద్యలోఁ బోటీజరిగినది. క్రౌంచపర్వతమును బాణముచే వ్రక్కలించుట యందలి విష

యము. పరశురాముఁడు బాణమును బ్రయోగింపఁగా నయ్యది పూర్తిగా వ్రక్కలింపలేకపోయెను. కుమారస్వామి బాణప్రభావమువలన నయ్యది పూర్తిగా వ్రక్కలింపఁబడినది. కుమారుఁడు పందెమున నెగ్గెను. అట్లు కుమారస్వామి క్రౌంచపర్వతమునఁ జేసిన రంధ్రమునే హంసద్వారమందురు. వర్షాకాలమున హంసలీ రంధ్రమునుండి మానస సరోవరమునకుఁ బోవుచుండునని పురాణ ప్రతీతి. "కుమారః క్రౌంచధారణః"॥ అమరము॥ "కుంచగుబ్బలి వ్రక్కలించిన బలుమేటి"॥ "ఆంధ్రనామ సంగ్రహము"॥

[పైన జేర్కొనఁబడిన ప్రశ్నలకుఁ దగిన సమాధానముల నా యా పద్యములయొక్క యర్థతాత్పర్యాదులు నుండియు నితర వ్యాసములనుండియు గ్రహింపఁదగును.]

—:o:—

# ఛందస్సు

పద్యలక్షణమునుగూర్చి తెలుపు శాస్త్రమునకు ఛందశ్శాస్త్ర మని పేరు. ప్రతి పద్యమునందును సాధారణముగా నాలుగు పాదము లుండును. ప్రతిపాదమును గణములచే నిబద్ధమైయుండును. ప్రతి పాదమున రెండవయక్షరమునకు ప్రాసమని పేరు. కొన్ని పద్యములకుఁ బ్రాసనియమముగా నుండును. ప్రతి పద్యములోను బ్రతి పాదమునందును మొదటి యక్షరమునకు, పాదమధ్యమునందున్న యొకానొక యక్షరమునకును యతిసంబంధ ముండును. అట్టి సంబంధమునకు యతిమైత్రి యందురు. ఇయ్యది పద్యభేదములను బట్టి మాఱుచుండును. పద్యములోని ప్రతి గణమును గురు లఘువుల కూడికచే నేర్పడుచుండును. గురువునకు "గ" యనియు, లఘువునకు "ల" యనియు సంజ్ఞలు. గురువునకు "U" గుర్తు, లఘువునకు "।" గుర్తు.

లఘువులు:—హ్రస్వాచ్చులును, వానితోఁ గూడిన హల్లులును లఘువులు. ఉ॥ అ, ఇ, ఉ, ఋ, ఎ, ఒ, క, కి, కు, కృ, కె, కొ.

గురువులు:—దీర్ఘాచ్చులును, వానితోఁ గూడిన హల్లులును గురువులు. ఉ॥ ఆ, ఈ, ఊ, ౠ, ఏ, ఐ, ఓ, ఔ, కా, కీ, కూ, కౄ, కే, కై, కో, కౌ.

పూర్ణానుస్వారము, విసర్గము, పొల్లు హల్లుముందుఁగల లఘువులు గురువులగును. ఉ॥ కం, కః, కన్ ఇత్యాదులు.

ఏకపదమునందే సంయుక్తాక్షరమునకును ద్విత్వాక్షరమునకును ముందుండు లఘువు గురువగును. ఉ॥ ఛందస్సు. అద్రుచు, విద్రుచు, పద్రుచు, ఎద్రుచు మొదలగు పదములందు మాత్రము ద్విత్వాక్షరమునకు ముందుండు లఘువు గురువుకాదు. అట్లే పదము మొదట సంయుక్తాక్షరమున్నచో దానికి ముందున్న పదమున చివర లఘువు గురువుకాదు.

## గణములు

| | | | |
|---|---|---|---|
| I U U | యగణము | I I I | నగణము |
| U U U | మగణము | I I U | సగణము |
| U U I | తగణము | U U | గగము |
| U I U | రగణము | I U | లగము |
| I U I | జగణము | U I | గలము |
| U I I | భగణము | I I | లలము |

## ఇంద్రగణములు 6

| | | | |
|---|---|---|---|
| I I I I | నలము | U I I | భగణము |
| I I I U | నగము | U I U | రగణము |
| I I U I | సలము | U U I | తగణము |

## సూర్యగణములు 2

| | | | |
|---|---|---|---|
| U I | గలము | I I I | నగణము |

## యతిమైత్రి

యతిమైత్రిగల యచ్చులు, హల్లులు, (ఈ క్రిందివానికిఁ బ స్వరము యతి చెల్లును.)

1. అ, ఆ, ఐ, ఔ.
2. ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ.
3. ఉ. ఊ, ఒ, ఓ.
4. క, ఖ, గ, ఘ.
5. చ, ౘ, ఛ, జ, ౙ, ఝ, శ, ష, స.
6. ట, ఠ, డ, ఢ.
7. త, థ, ద, ధ.
8. ప, ఫ, బ, భ, వ.
9. ర, ఱ, ల, ళ.
10. న, ణ.

11. ము, పు, ఫు, బు, భు.
12. య, హ.

## వృత్తలక్షణము

1. చంపకమాల:—ప్రతిపాదమునందును "న, జ, భ, జ, జ, జ, ర" గణములు వరుసగా నుండును (21 అక్షరములు) 11 వ యక్షరము యతి. ప్రాస నియమముగా నుండును.

ఉదా: అనవు డుభీష్మఁ డిట్లను నసాత
నితోన కటావ ధింపఁ గా

(చంపకమాలలోని మొదటి రెండు లఘువులను గురువుగా మార్చిన ఉత్పలమాల యగును.)

2. ఉత్పలమాల:- ప్రతిపాదమునందును "భ, ర, న, భ, భ, ర, వ" గణములు వరుసగా నుండవలయును, (20 యక్షరములు) 10 వ యక్షరము యతి. ప్రాస నియమముగా నుండును.

ఉదా: కావున నెట్లుజం పుడున కానిభు
జంగముఁ జోవనీ నుజూ

(ఉత్పలమాలలోని మొదటి గురువునకు మాఱు రెండు లఘువులుంచినచో చంపకమాలయగును).

3. శార్దూల విక్రీడితము :— ప్రతిపాదమునందును "మ, స, జ, స, త, త, గ" గణములు వరుసగా నుండవలయును. (19 యక్షరములు) 13 వ యక్షరము యతి. ఇందు ప్రాసనియమము.

ఉదా: U U U | | U | U | | | U
ఆ శా పా శ ము దాఁ గ దుఁ ని డు పు లే
U U | U U | U
ద్రం తం బు రా జేం ద్ర వా

(శార్దూల విక్రీడిత పాదము యొక్క మొదటి గురువునకు మాఱు రెండు లఘువులుంచిన మత్తేభ విక్రీడిత మగును.

మత్తేభ విక్రీడితము:— ప్రతిపాదమునందును "స, భ, ర, న, మ, య, వ" గణములు గల్గియుండవలయును. (20 అక్షరములు) 14వ యక్షరము యతి.

ఉదా: | | U U | | U | U | | |
గ్రా డు గో జ న్ని ద మో క మం డు లు వా
U U U | U U | U
నా కున్ ముం జి యో దం డ మో

(మత్తేభ పాదముయొక్క మొదటి రెండు లఘువులను నొక గురువుగా మార్చినచో నది శార్దూల విక్రీడిత మగును.

5. మత్తకోకిలము:—ప్రతిపాదమునందును "ర, స, జ, జ, భ, ర, గణములుండును. (18 అక్షరములు) 11వ యక్షరము యతి. ప్రాసనియమముగా నుండును.

ఉదా: U | U | | U | U |
ఎ న్న డుం బ రు వేఁ డఁ బోఁ డఁ
| U | U | | U | U
ట య్యే క లుం డఁ ట క న్న వా

6. కందము:— కందపద్యమున "గగ, భ, జ, స, నల" గణములే యుండవలయును. ఒకటవ పాదమునందును, మూడవ పాదము నందును బైన వివరింపఁబడిన గణములలో నేవేని మూడు

గణములుండవలయును. అట్లే పైగణములలో నేవేని యైదు గణములు రెండవ పాదమునందును, నాల్గవ పాదమునందును నుండవలయును. బేసిగణము 'జగణము'గా నుండరాదు. ఆఱవ గణము, పదునాల్గవగణము 'నలముగ'నో, లేక 'జగణము' గనో యుండవలయును. రెండవపాదము కడపటి యక్షరమును. నాల్గవ పాదము కడపటి యక్షరమును గురువుగా నుండవలయును. రెండవ పాదమునందును నాల్గవ పాదమునందును యతిమైత్రి యుండును. ప్రాస నియమము గలదు.

కం. ∪ ∪ ∪ | | ∪ ∪
ఈ సం సా ర ము దుః ఖా

∪ ∪ ∪ ∪ | ∪ | ∪ ∪ ∪ ∪
వ్రా సా నం దం బు దీ ని వ ర్ధిం పం గా

తేటగీతి :— ఈ పద్యమునందు నాలుగు పాదములుండును. ప్రతి పాదమునకు 1 సూర్యగణము, 2 ఇంద్రగణములు, 2 సూర్య గణములు నుండును. ప్రతి పాదమునందును ప్రథమాక్షరమునకును నాల్గవ గణము మొదటి యక్షరమునకును యతి చెల్లుచుండును. ఇందు ప్రాసనియమము లేదు. ప్రాసయతి చెల్లును.

గల త త గల న
∪ | ∪ ∪ | ∪ ∪ | ∪ | | | |
ఉదా : ఏ యు వా డుం డ న మ్మ మి సే యు న న క

8. ఆఁటవెలఁది :— ఈ పద్యమునందు నొకటి మూఁడు పాదములందు మూఁడు సూర్యగణములు, రెండింద్రగణములును నుండును. రెండవ పాదమునను నాల్గవ పాదమునను నయిదు సూర్యగణము లుండవలయును. మిగిలిన లక్షణమంతయుఁ దేట గీతిని బోలియుండును.

ఉదా: ∪ | ∪ | ∪ | | | | ∪ | | | |
ఒం టి వాఁ డ నా కు స్తోఁ క టి రెం డ డు గు ల
(3 సూ + 2 ఇం)

∪ | ∪ | ∪ | ∪ | ∪ |
మ్మే ర యి మ్ము సొ మ్ము మే ర యొ ల్లఁ (5 సూర్య)

9. సీసము :— సీసపద్యమునకు సాధారణముగా నాలుగు పెద్దపాదములుండును. ఒక్కొక్క పాదమునకు వరుసగా, 6 ఇంద్ర గణములును, 2 సూర్యగణములు నుండవలయును. ప్రతిపాదమునకు రెండు యతులుండును. 1, 3 గణముల ప్రథమాక్షరములకు 5, 7 గణముల ప్రథమాక్షరములకును యతి చెల్లుచుండును. ఈ రెండు యతులకు సామ్యముండ నక్కఱలేదు. ఇట్లు నాలుగు పాదములు ముగిసిన పిమ్మట నాఁట వెలఁదినిగాని తేటగీతినిగాని చేర్పవలయును. ప్రాస యతియుఁ జెల్లును. అప్పుడు సీసము సంపూర్ణ లక్షణములోఁ గూడి యుండును.

సీ. | | ∪ | | | | | ∪ ∪ | | | | |
ఇ ది నా కు నె ల వ ని స్తో రీ తి బ లు కు దు
| | ∪ | | | ∪ | ∪ | ∪ |
స్తో క చో ట న క యెం దు నుం డ నే ర్తు

## -: శుద్ధపత్రము :-

| పుట | పంక్తి | | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 4 | 9 | – | పాతమంత్రే | పాపమంత్రే |
| 5 | 7 | – | ఇట్లగు చేర్వడ | ఇట్లగు చేర్పడ |
| 18 | 7 | – | ధారుణి | ధారుణి |
| 19 | 2 | – | నాథు | నాధు |
| 13 | 2 | – | మేథావి | మేధావి |
| 20 | 2 | – | విదె | విదే |
| 21 | 8 | – | వుభయ | యుభయ |
| 20 | 11 | – | అంభఃకర | అంభఃకణ |
| 26 | 5 | – | జ్ఞానప్రనవాంబా నాథుఁడు | జ్ఞానప్రసవాంబా నాధుఁడు |

Victory Press, Prakash Nagar, Nellore.

# SRI VENKATESWARA UNIVERSITY.

Intermediate (1958)

Examiners by Sri D. Ramamurthy, M. A.,
V. R. College, Nellore.

(1) THE PILGRIM'S PROGRESS 0—12—0

(2) JULIUS CÆSAR 0—12—0

## Pre-University Examination.

ENGLISH POETRY:-

(1) Text edited with introduction and notes etc., by Sri D. Ramamurthi.

(2) Guide only (without Text) by the same author.

ENGLISH NON-DETAILED STUDY:-

"TREASURE ISLAND"—Text with introduction etc., by Sri D. Ramamurthi.

Questions and Answers on the above by the same author.

TELUGU OLD POETRY:-

Text edited with introduction and Notes etc., by Vidwan, Sri Badi Gurava Reddy,
Pandit, V. R. College, Nellore.

PHYSICS:-

A class Book of Physics
by Sri K. Kalyanaraman, M. SC.,
V. R. College, Nellore.